# వివేకవాణి



రచన:

శ్రీ కొమరగిరి కృష్ణమోహనరావు





ప్రచురణ :

## జయప్రద పబ్లికేషన్సు

15-30 ఈడేపల్లి, మచిలీపట్నం

 [ వెల : రూ. ౬-00

ప్రథమముద్రణ :

సిద్ధార్థినామ సంవత్సరం

ఏప్రియల్ 1979



ప్రతులు :

2000

ముద్రణ :

హిందూ ప్రెస్,

మచిలీపట్టణము

ప్రతులకు :

జయప్రద పబ్లికేషన్సు

15-30 ఈడేపల్లి ; మచిలీపట్నం

యం. శేషాచలం అండ్ కంపెనీ

మచిలీపట్నం - సికింద్రాబాద్ - మద్రాసు

ఆంధ్ర ప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్సు,

రాష్ట్రపతిరోడ్, సికింద్రాబాద్ - 500 003

# సమర్పణ

పూజ్య జననీ జనకులు



శ్రీ కొమరగిరి నరశింహారావు ★ శ్రీమతి విశాలక్ష్మమ్మ

గార్లకు భక్తి ప్రపత్తులతో

మీ చిరంజీవి



కొమరగిరి - 'గ్రంథకర్త'





నా చిన్నతనంలో విద్యాబుద్ధులను నేర్పి
నన్నింతవానివిగా చేసిన నా మేనమామగారు
శ్రీ తుర్లపాటి రాజేశ్వరరావుగారికి
సాదర, సప్రేమ నమస్కారములు

మీ మేనల్లుడు
—కొమరగిరి కృష్ణమోహనరావు.

# కృతజ్ఞతలు

నాతోపాటు డిటెన్యూగా రాజమహేంద్రవరం కారాగారంలోవుండి, వారిలో సంస్కృత జిజ్ఞాసను నెలకొలిపి, నేర్పి, సంస్కృతజ్ఞానాభివృద్ధికి తోడ్పడిన తూర్పు గోదావరిజిల్లా, రామచంద్రపురం జూనియర్ కళాశాల సంస్కృతోపాధ్యాయులు శ్రీ సూరి సుబ్రహ్మణ్యంగారికినా హృదయపూర్వక కృతజ్ఞతా పూర్వక నమస్కృతులు.

నా 'వివేకవాణి' పుస్తకమును కడు శ్రద్ధతో, సాకల్యముగా చదివి 'అక్షరజ్ఞానము' పేరిట పరిచయ వాక్యాలను వ్రాసి నన్నాశీర్వదించిన సంస్కృత మహాపండితులు గౌ॥ పూజ్యశ్రీ జమ్మలమడక మాధవరామ శర్మగారికి నా హృదయ పూర్వక కృతజ్ఞతాభి వందనములు.

భాషా విషయకమైన తప్పులను, ఒప్పులుగా, ఓపికతో సరిదిద్ది యిచ్చిన అవనిగడ్డ వాస్తవ్యులు రిటైర్డు తెలుగు పండితులు శ్రీజోస్యుల సూర్యనారాయణమూర్తి; అమూల్యమైన ఉత్తమ సలహాలనిచ్చి, సందర్భోచితమైన సూచనలుచేసిన మచిలీపట్నం వాస్తవ్యులు, ప్రముఖ న్యాయవాదులు శ్రీ భేతనభట్ల విశ్వనాథశాస్త్రిగార్లకు నా కృతజ్ఞతలు.

'వివేకవాణి' ముఖ చిత్రమును చక్కగా చిత్రీకరించి యిచ్చిన విజయవాడ వాస్తవ్యులు శ్రీ కామేశ్వరరావు; కలర్ ప్రింటింగులో మంచిగా ముద్రించి యిచ్చిన విజయవాడ "సవితా ప్రింటర్సు ప్రొప్రయిటర్" శ్రీ సుబ్బరాజు, పుస్తక ప్రచురణ విషయంలో ప్రత్యేక శ్రద్ధ తీసుకొనిన మచిలీపట్నం హిందూప్రెస్ ప్రొప్రయిటర్ శ్రీమద్దూరి సుబ్బారావు గార్లకు, ముద్రణ విషయంలో తోడ్పడిన ప్రెస్ కార్మికులకు నా కృతజ్ఞతాభి వందనములు.

ఈ పుస్తక ప్రచురణకై విరాళమిచ్చి ప్రోత్సహించిన దాతలకు కృతజ్ఞతలు.

భవదీయ,

కొమరగిరి కృష్ణమోహనరావు

# తొలిపలుకు

అంతఃకరణమును శుద్ధి చేయునదియే విద్య. నైతిక, ఆధ్యాత్మిక శీల సంపదలను యినుమడింప జేయునదియే సరైన విద్య. తనిప్పాప్పు అను తెలుసుకోవడంలో వ్యక్తులకు తోడ్పడుటయే విద్యయొక్క పరమావధి. అది కేవలం 'చదవడం, వ్రాయడం' వల్ల లభ్యం కాదు. విద్య నేర్చుకోవడం ఉద్యోగం కోసమని, డబ్బు సంపాదించడానికని భావించే వారితో నేను ఏమాత్రం ఏకీభవించను. వట్టి పుస్తక పాండిత్యం వల్లనే ప్రయోజనం లేదు. అది 'పరోక్షజ్ఞానం' మాత్రమే. ప్రత్యక్షజ్ఞానం కూడా ప్రతి ఒక్కరూ సంపాదించి తీరాలి. కోట్లాది ప్రజానీకానికి ఏది మంచిదో, ఏది చెడ్డదో వివరించే శక్తి కలిగినట్టిది; ఏది చీకటో, ఏది వెలుగో చూపేటటువంటిది; ఏమి చేయాలో, ఏమి చేయగూడదో తెలిపేటటువంటిదే 'సరైన విద్య' అని నా విశ్వాసం. విద్యయొక్క పరమావధి విజ్ఞాన సముపార్జన. అంతేకాదు వినయ విధేయతలను నేర్పగలిగినట్టిదే సరి అయిన 'విద్య' అని నా అభిప్రాయం. ఒక్క శాస్త్రజ్ఞానం మీదనే ఆధారపడరాదు. ఈ జ్ఞానంతో అనుభవ జ్ఞానంకూడా జోడించాలి. తద్వారా జనించిన జ్ఞానాన్ని వివేకంతో దేశ కళ్యాణానికి వినియోగించాలి. లౌకికంగా వ్యవహరించి దేశ సమస్యలకు చక్కటి పరిష్కార మార్గాలు కనుగొని తిరిగి అనుభవాన్ని గడించడమే "విజ్ఞానం" అని అంటారు. వివేక విచారణచే విజ్ఞానమును సాధించవచ్చు.

ఎన్ని జ్ఞానాలను సంపాదించినప్పటికి, లౌకిక విద్యల నభ్యసించినప్పటికి 'దైవజ్ఞానము'ను సంపాదించని వానికి శాంతిలేదు. సుఖమూ ఉండదు. 'ఆత్మజ్ఞానం లేనివారు భగవంతునికి ప్రీతిపాత్రులు కాలేరు. లౌకిక విద్యలు జనన మరణాలనుండి రక్షించజాలవు. ఒక్క 'దైవవిద్య' వల్లనే మానవునికి మోక్షం ప్రాప్తిస్తుంది.

జ్ఞానము, విజ్ఞానము, ఆత్మ జ్ఞానములతోపాటు 'సచ్ఛీలము'ను కూడా సంపాదించి తీరాలి. శీలములేని వ్యక్తి పశువుతో సమానము. సౌశీల్య రహితమైన విద్య వినాశనానికి దారితీస్తుంది. వీటితోపాటు

"మాతృదేశ' భక్తినికూడా ప్రతిఒక్కరూ అలవరచుకొనాలి. ఈ భరత మాత పట్ల భక్తి ప్రపృత్తులు కలిగియుండాలి. అట్టివారి వల్లనే దేశానికి ఎక్కువ ప్రయోజనం ఉంటుందని నా విశ్వాసం. ఈ ఐదు ఉత్తమ లక్షణములను నేర్పగలిగేదే "సరైన విద్య" అని నా నమ్మకం.

ఈ దేశంలో 'విద్య' యిప్పటికీ యాంత్రికంగానే బోధించబడుతున్నది. అందులో ఏమాత్రం చైతన్యంగాని, నైపుణ్యంగాని లేదు. శక్తినిగాని, స్ఫూర్తినిగాని, ధైర్యాన్నిగాని, బలాన్నిగాని—ఈ ప్రస్తుత విద్యావిధానం చేకూర్చడం లేదు. అందువల్లనే లోకనాయక్ జయప్రకాశ్ నారాయణ విద్యారంగంలోకూడా సంపూర్ణ విప్లవం (Total Revolution) రావాలని అభిలషిస్తున్నారు. విద్యావిధాన స్వరూపం మారాలి. బోధనా పద్ధతి మారాలి, ప్రభుత్వ దృక్పథం మారాలి, విద్యార్థులలో మానసిక పరివర్తన రావాలి. విద్యార్థుల ఆలోచనా సరళిలోకూడా మార్పు రావాలి. చేతులను మట్టి చేసుకొనకుండా, ఇస్త్రీ బట్టలు నలగకుండా, ఫాన్ క్రిందనో, ఎయిర్ కండీషన్ రూములోనో కూర్చొని, ప్రయాసలేనటువంటి, సునిశితమైన, నాజూకైన ఉద్యోగాలను చేస్తూ ధనం సంపాదించి సుఖవంతమైన, విలాసవంతమైన జీవితాలను గడపాలనే అభిప్రాయాలకు విద్యావంతులు తిలోదకాలివ్వాలి. కష్టించి, శ్రమించి, చమటోడ్చి సంపాదించాలనే మనస్తత్వం అభివృద్ధిజెందాలి. స్వంత పరిశ్రమలను నెలకొలిపి, అధికోత్పత్తిని సాధిస్తూ ధనం సంపాదించాలనే పట్టుదల యువకులలో పెంపొందాలి. ప్రభుత్వం వైపు నుంచి అవసరమైన ప్రోత్సాహం వుండాలి. అప్పుడే దేశం ఆర్థికంగా పురోభివృద్ధి జెందుతుంది. ఇటువంటి ఉత్సాహమూ ప్రోత్సాహమూ యువకులలో కలుగజేసేదే 'నిజమైన విద్య' అని, నా దృఢ విశ్వాసం.

విద్యార్థులలో "విద్య, విజ్ఞానం, దేశభక్తి, క్రమశిక్షణ, సచ్ఛీలం" సద్గుణములను పెంపొందించాలనే తలంపుతో 1969 జూన్‌లో వివేకానంద విద్యా నికేతన్(గురుకుల్) వసతివిద్యాలయమును కృష్ణాజిల్లా నందిగామలో స్థాపించాను. ఈ విషయాలమీద సమగ్రమైన అభిప్రాయాలను వివరిస్తూ ఒక పుస్తకం తీసుకొని రావాలని ఆనాడు సంకల్పించాను. కాని అది అప్పుడు కార్యరూపం జెందలేదు. దేనికైనా సమయం రావాలికదా!

"అంతయూమనమేలునకే" అన్నట్లుగా 1975 జూన్ 28 వతేదీన 'మీసా' క్రింద నిర్బంధించబడి రాజమండ్రి సెంట్రల్ జైలుకు వెళ్ళటం జరిగింది. 19 నెలలుపాటు కారాగారవాసాన్ని అనుభవించాను. కాలాన్ని దుర్వినియోగం చేయటం విజ్ఞతాలక్షణం కాదుగదా! నేను దూరమైనానని బాధపడుతున్న నా అర్ధాంగి శ్రీమతి జయప్రదకు నాపిల్లలైన చి॥ లక్ష్మి, తందు, ఉదయ్, శ్యాం, విజయగౌరీలకు కొంత ఊరడింపును కలుగ జేయాలని, మనశ్శాంతినివ్వాలని సంకల్పించు కున్నాను. దానితోపాటు ఆ నిర్మల పసి హృదయాలలో మంచి ఆలోచన కలుగజేయాలని, అభి ప్రాయపడ్డాను. ఎంతోదూరంనుంచి వచ్చి మా 'గురుకుల్' లో వుంటూ విద్యనభ్యసిస్తున్న బాలబాలికల (అంతా 14సం. లోపు వారే) కు కొంత విజ్ఞానాన్ని అందించాలని భావించాను.

జ్ఞాన విజ్ఞానాదులమీద పరిశీలన ప్రారంభించాను. "తల్లి శరీరాన్ని పోషించి పెంచుతుంది. ఉత్తమ గ్రంథం హృదయాన్ని పోషించి పెంచు తుంది" అని చెప్పిన శ్రీ రావూరి సత్యనారాయణగారి మాటలు గుర్తుకు వచ్చాయి. అటువంటి ఉత్తమ గ్రంథాలను పఠించి తీరాలనే అభిలాష నాలో కలిగింది. జైలులో లభించిన ఉత్తమ గ్రంథాలను మాత్రమే చదివాను. చెత్త సాహిత్యాన్ని వాసనకూడా చూడలేదు. అందులో ముఖ్యంగా భగవద్గీత, భారతం, భాగవతం, రామాయణం, భర్తృహరి సుభాషితములు, పంచతంత్రం, శతకాలు మొదలైనవి నా ప్రయత్నానికి ఉపకరించాయి. సంస్కృతోపాధ్యాయులైన శ్రీ సూరి సుబ్రహ్మణ్యంగారు కూడా నాతోపాటు "డి టెన్యూ" గా ఉండటం వల్ల సంస్కృత పరిచయం కూడా లభించింది. నా ప్రయత్నం నిర్విఘ్నంగా కొనసాగింది. ఉత్తమ గ్రంథాలలో నిజంగా విజ్ఞాన సర్వస్వం ఇమిడివుంది. అవి జ్ఞానసముద్రాలు. ఎవరి ఓపికనుబట్టి వారు ఆ 'జ్ఞానము' ను ఆస్వాదించవచ్చు. వాటిలోనున్న కొన్ని అమూల్య మైన విషయాలను అవగాహన చేసుకున్నాను, అర్థం చేసుకున్నాను. నా ఆశయాలకొక రూపకల్పన యివ్వాలని సంకల్పించుకున్నాను. నేను నిర్బంధితుడ్ని కావడం వల్ల నా భావాలను సూటిగా సరాసరి నా పిల్లలకు చెప్పే అవకాశం లేదుగదా! ఉత్తరాలద్వారా వ్రాయడం ప్రారంభించాను. నేను దూరమైనానని బాధపడుతున్న నా పసిపిల్లల కన్నీటి ధారలను

కొంతవరకైనా తుడిచి వేయడానికి నా ఉత్తరములు ఉపకరిస్తాయని భావించాను. అంతేకాదు ఆ పసి నిర్మల హృదయాలలో విద్యయొక్క ఔన్నత్యాన్ని, గొప్పతనాన్ని, ప్రాముఖ్యతను, అవసరాన్ని, పరమావధిని కొంతవరకైనా చొప్పించాలనే తలంపుతో ఉత్తరాలను వ్రాయడం మొదలుపెట్టాను. నా ఆశ ఫలించింది. నా ఆశయం నెరవేరింది. వాళ్ళలో కొంత ఉత్సాహం కలిగినట్లుగా, వాళ్ళ ప్రత్యుత్తరాలుచూచి ఆనందించాను. నా ప్రయత్నం సఫలీ కృతమైనదని సంతుష్టిజెందాను. ఉత్సాహంతో నా కలం పరవళ్ళు త్రొక్కింది. నా మనస్సు ఉర్రూతలూగింది. నాధ్యేయం నెరవేరుతున్నది గదా అని ఎంతో సంతోషించాను. నిర్బంధితుడనైనాననే బాధనుకూడా మరచిపోయాను. విద్య, జ్ఞానం, విజ్ఞానం, ఆత్మజ్ఞానం సచ్ఛీలం, త్యాగం, దేశభక్తి మొదలైన విషయాలమీద ఎన్నో ఉత్తరాలు వ్రాసాను.

1977 జనవరి 21 వ తేదిన కారాగార విముక్తి సంప్రాప్తించింది. రాజకీయ కార్యకలాపములలో నిమగ్నం కావడం వల్ల ఆ ఉత్తరాలను బయటకు తీసిచూచే తీరుబడి లభించలేదు. మానవజీవితంలో ఊహించనటువంటి సంఘటనలు అప్పుడప్పుడు సంభవించడం సహజం. అనుకోకుండా నందిగామ నుంచి మచిలీపట్నం మకాం మార్చ వలసివచ్చింది. 'అంతయూ మనమేలునకే' అన్న ఆర్యోక్తి నా జీవితంలో యధార్థమైంది. కారాగారం నుంచి వ్రాసిన ఉత్తరాలను చూచే అవకాశం తీరిక నాకు లభించింది. ఆఉత్తరాలలోని విషయాలను ఒక పుస్తకరూపంలో తీసుకొని రావాలని సంకల్పించుకున్నాను. ఒక చక్కటి నీతిని బాలబాలికలకు బోధించేటటువంటి పుస్తకమును తయారుచేయాలని నిశ్చయించు కున్నాను. ఆ సంకల్ప ఫలితమే యీ "వివేకవాణి" పుస్తక స్వరూపం. అంతర్జాతీయ బాలల సంవత్సర సందర్భమున సమర్పించుకుంటున్న నా యీ చిన్న కానుక 'వివేకవాణి.'

భవదీయ

కొమరగిరి కృష్ణమోహనరావు

# అక్షరజ్ఞానము

నేను అక్షరజ్ఞానము లేని చిన్నతనములో కొన్ని శ్లోకములను పద్యములను మా తాత చెప్పగా వల్లించితిని. నా ఉచ్చారణము స్పష్టముగా, స్వచ్ఛముగా, విశదముగా నుండునట్లు తాతయ్య చెంపమీద చెయ్యి పెట్టక నేర్పినారు. నేను అప్పటి జీతగాళ్ళకు కూలివాళ్ళకు తాతయ్య మాట ప్రకారము అందరకూ నా పలుకులు నేర్పితిని. నేర్చుకొనిన వారలకు అప్పుడు అక్షర పరిజ్ఞానము లేదు. నాకును లేదు. అయినా నేను గురువు నయినాను. అందరూ నన్ను తాతా! అనెడివారు. ఇది అరువది సంవత్సరాల నాటి విషయము. ఈ నాడు లోకంలో ఇంతమార్పు వచ్చింది. కండరీగ కుట్టినపుడు నా బుగ్గ వాచింది. పిల్లదోమ కరిచినప్పుడు వాచింది. ఈ నాటి లోకం బలుపు ఆ నాటి వాపువలే ఉంది. వర్ణమాల బూడిదపై దిద్దుకొని అలవరచుకొన్న తరువాత వర్ణ పరిచయం కలిగింది. ఆ పరిచయంతో ఈ పుస్తకం చదివాను. నేను ఆ సమయంలో నేర్చుకున్న వన్నీ ఈ పుస్తకంలో ఉన్నవి. ఆ నాడు ఈ పుస్తకంలేదు. ఈనాడు ఈ పుస్తకంవచ్చింది. లోకము ఏవిధంగా ఉపయోగించుకుంటుందో కొమరిగిరికి తెలుసు. కొమరగిరి కుమారగిరిగా దీన్ని వ్రాయడము నాకువలె అందరకూ సంతోషం కలగాలి. లోకకుమారులు దీనిని చదవాలని చదివించాలని కుమార జనకులు భావించితే తమ కుమారులు తమకన్న మంచి పౌరులవుతారని అసూయపడక ఆదరించవచ్చును. దీనిలో వలసినవి కలవు.

"విద్యాజ్ఞానము, విజ్ఞానము, ఆత్మజ్ఞానము, శీలము, ఏకమతి" అనే వివేక షట్కమున్నది. అంతర విషయాలు 54 ఉన్నవి. అక్కడక్కడ అవసరమయిన స్థలంలో శ్లోకములు పద్యాలు సందర్భోచితముగా ఉన్నవి. ఇట్టి గ్రంథమును అధ్యాపకుడు ప్రబోధకుడు, ప్రచారకుడు చేయగలడు. కొమరిగిరి ప్రయోగించి పరీక్షించి సంతుష్టిపడి లోకతుష్టికై యీ వివేకవాణిని అందించుట ఒక ప్రక్రియావాదము ప్రయోగ వాదమును విద్యాశాలలో

విద్యాభ్యాసం చేసిన విద్యార్థి ఇటువంటి ఉపదేశమునే అందుకొన వలెనని "శిక్షావల్లి" ఆదేశించుచున్నది. ఆ ఆదేశాలు దీనిలో ఉన్నాయి. కథాకథనము ఉపాయముగా ధర్మబోధ చేయుచున్న వివేకవాణి ఉపాదేయ పుస్తకము. అధీతి బోధ, ఆచరణ ప్రచారములు కొమరగిరికి ఉన్న విధమున గిరికుమారులకు హరి కుమారులకు సిరి కుమారులకు వరి కుమారులకు కావలయునని అందరందుకు నేను నందును. 'మిత్రస్య చక్షుషా పశ్యామః' మిత్రుని నేత్రముతో చూచెదము అని అథర్వమనును. "పశ్యేమ శరదశ్శతం, జీవేమ శరదశ్శతం- ప్రబ్రవామ శరదశ్శతం- నందామ శరదశ్శతం- మోదామ శరదశ్శతం- అజీతాస్స్యామ శరదశ్శతం" ఇట్టిది వివేకవాణి, చిరకాలము విజ్ఞానము సంపాదించి చిరంజీవులమై అందరకు ప్రబోధించి అందరమానందముగా జీవించి మృత్యువుచే గూడ పరాజితులము కాకుండెదము గావుత. ఇట్టి విశిష్ట దృష్టిని కుమారగిరి అందించెను. ఇట్టి రచన మొనరించిన శ్రీమాన్ కొమరగిరి కారలోనుండి యింతపనిచేసి కారను అగారమును మెచ్చునట్లు చేసెను. బాలగంగాధరుడు కారావాసముననె కర్మగీత రచించి తిలకము పెట్టెను. ఇంతలు చేయగా నేను నా చిన్నతనమున తాతయ్య దగ్గర నేర్చికొనిన వివేకవాణిని. ఈ వివేకవాణిని చూచి గుర్తుచేసికొంటిని, నావలె నందరు సర్వదా విద్యార్థులై వివేకవాణి వ్యాసంగ మొనరించుట అక్షరజ్ఞానము, అస్తు

— జమ్మలమడక మాధవరామశర్మ

# ఈ పుస్తకప్రచురణకై విరాళములిచ్చి
# ప్రోత్సహించిన
## ఉదార హృదయులు

శ్రీ మానేపల్లి రాజారావు
చిట్టూరి చినపిచ్చయ్య & Co. విజయవాడ–1.... రు. 116-00

శ్రీ పండిట్ రఘువీర వీవర్సు కోపరేటివ్ సొసైటీ
చింతగుంటపాలెం, మచిలీపట్నం ... రు. 116-00

శ్రీ అత్తలూరి సత్యనారాయణ,
అవిగండ్లపాడు. నందిగామ తాలూకా.... రు. 116-00

శ్రీ మన్నే విజయరాంబాబు. సన్ ఆఫ్ మన్నే శేషయ్య
మంగొల్లు, జగ్గయ్యపేట తాలూకా.... రు. 116-00

శ్రీ మేడిశెట్టి నరశింహారావు, కాళ్లపాలెం, కైకలూరుతాలూకా రు. 116-00

శ్రీ శ్యాంప్రసాద్ వీవర్సు కోపరేటీవ్ ప్రొడక్షన్ అండ్
సేల్ సొసైటీ, పోలవరం. బందరు తాలూకా.... రు. 116-00

శ్రీ బట్టు పాండురంగారావు. అవనిగడ్డ-దివితాలూకా.... రు. 116-00

శ్రీ ఉద్దగిరి కోదండరామయ్య, కైకలూరు.... రు. 116-00

శ్రీ డి. శ్రీనివాసరావు. రియల్ కెమిస్టు విజయవాడ–1 రు. 116-00

శ్రీ కనపర్తి వెంకటేశ్వర్లు. మాజీసర్పంచ్-గంఢ్రాయి
జగ్గయ్యపేట-తాలూకా.... రు. 116 00

కీ. శే. ఉప్పులూరి రాధాకృష్ణమూర్తి పేర కుమారులు
శ్రీ ఉప్పులూరి కామేశ్వరరావు అండ్ బ్రదర్సు.... రు. 116-00

శ్రీ దీనదయాళ్ వీవర్సు కోపరేటివ్ సొసైటీ, పెదన
బందరు_తాలూకా .... రు. 116-00

శ్రీ కొల్లూరి కృష్ణమూర్తి. అవనిగడ్డ-దివితాలూకా.... రు. 58-00

శ్రీ చల్లగుళ్ల సత్యనారాయణచౌదరి, పెదపాలపర్రు-
గుడివాడతాలూకా .... రు. 58-00

శ్రీ జవ్వాజి రామస్వామి గుప్త, విజయవాడ-1 రు. 58-00

శ్రీ కూనాగు వెంకటశేషయ్య, క్లాత్‌మర్చంట్-సత్తెనపల్లి.... రు. 58-00

శ్రీ నాళం సుబ్బారావు, ఏలూరు ఆటోవర్క్సు, ఏలూరు ....రు. 58-00

శ్రీ కందుకూరి కోటేశ్వరరావు, తోటరావులపాడు
నందిగామ తాలూకా .... రు. 25-00

వీరికి మా ధన్యవాదములు.

ప్రచురణ కర్తలు

# విషయ సూచిక

పేజీలు

## ప్రథమ భాగము : 'విద్య'



## ద్వితీయ భాగము : 'జ్ఞానము'

తృతీయ భాగము : 'విజ్ఞానము'



చతుర భాగము : 'ఆత్మజ్ఞానము'

# వి వే క వా ణి

## ప్ర థ మ భా గ ము

## " వి ద్య "

# విద్యా - వినయము

"విద్యాదదాతి వినయం, వినయాత్ యాతి పాత్రతామ్
పాత్రత్వాత్ ధనమాప్నోతి, ధనాద్ధర్మం తతః సుఖమ్"

అనగా "విద్య వినయమును యిచ్చుచున్నది. అట్టి వినయము వలన యోగ్యతను లేక అర్హతను పొందు చున్నాడు. అట్టి యోగ్యత వలన (ఐహిక సంపదను) ధనమును పొందుచున్నాడు. అట్టి సంపద వలన ధర్మమును, అట్టి ధర్మము వలన సుఖమును, ఆనందమును పొందు చున్నాడు" అని అర్థము.

ఈ నీతి శ్లోకము వలన మనకు అర్థమవుతున్నది సరైన విద్య యొక్క స్వరూపం. కాని ప్రస్తుత ప్రపంచంలో విద్య అంటే అక్షర జ్ఞానమని, చదవడం, వ్రాయడం, పరీక్షలకు వెళ్ళడం, మంచి మార్కులు తెప్పించుకోవడం మాత్ర మేననే అభిప్రాయం చాలా మందిలో పాతుకొని పోయింది. అంతేకాదు; విద్య నభ్యసించడం ఉద్యోగం చేయడానికని, ధనాన్ని సంపాదించడానికే ననే అభిప్రాయం కూడా చాలామందిలో వున్నది. ఇది యథార్థం కాదు, వాస్తవం అంతకన్నా కూడా కాదు.

విద్య యొక్క అసలైన ప్రయోజనం విజ్ఞానాన్ని సముపార్జించడంతో పాటు వినయాన్ని కూడా అలవరచుకోవటం. అసలు వినయమంటే ఏమిటి ? అణకువ, మంచి నడవడి, మంచి గుణం, సత్ప్రవర్తన అని చెప్పుకుంటే బాగుంటుంది. ఇటువంటి అత్యున్నతమైన మంచి సద్గుణములను నేర్పునదే సరైన విద్య. ఇటువంటి మంచి గుణములనభ్యసించకుండా పరీక్షలయందు ఉత్తీర్ణులయినంత మాత్రాన ప్రయోజనం శూన్యం.

"విద్యా వినయ సంపన్నః" అని పెద్దలు, అనుభవజ్ఞులు ఏనాడో చెప్పారు. విద్యా వినయములు రెండూ కలసి వున్నవాడే రాణిస్తాడు. అభివృద్ధిలోనికి వస్తాడు. పూర్వకాలమున విద్యను నేర్చుకొనడానికి వెళ్ళేవాడికి "వినేయుడు" అని పేరుండేది. అనగా వినయమును అభ్యసించే వాడని అప్పటి అర్థం. విద్యతో పాటు తప్పని సరిగా వినయమును కూడా అలవరచుకోవాలని అప్పటి పెద్దలు భావించేవారు.

అయితే ఇటువంటి వినయ సహితమైన విద్యను ఎప్పుడు నేర్చుకుంటే బాగా అబ్బుతుంది ? విద్య అనేది అంత తేలికగా ఎప్పుడు పడితే అప్పుడు వచ్చేది కాదు. వెలయిస్తే బజారులో లభించే వస్తువు అంతకన్నా కాదు. దీనికి సమయం సందర్భం అంటూ వున్నాయి. "శైశవేఽభ్యస్త విద్యానాం" విద్య అనేది బాల్యమునందే అభ్యసించాలి. అప్పుడే బాగా వంటపడుతుంది. అప్పుడు

నేర్చుకున్నది, అలవరచుకున్నది మాత్రమే జీవితాంతం బాగా గుర్తుంటుంది. మధ్యలో నేర్చుకున్నది మధ్యలోనే పోతుంది. కనుక అటువంటి అమూల్యమైన బాల్య దశను సద్వినియోగం చేసుకోవాలి. ఆ దశలోనే విద్యతోపాటు వినయం కూడా అబ్బుతుంది. విద్యా వినయములు రెండూ సంపాదించిన వానికి మంచి యోగ్యత అర్హత లభిస్తాయి. తద్వారా మంచి పేరు ప్రతిష్టలను సంపాదించ గలుగుతారు. ఉన్నత పదవు లధిష్టించ గల్గుతారు. తద్వారా ధనం సంపాదించ గలుగుతారు. అట్టి ధనంతో దానధర్మాలు చేసి ఐహికసుఖం, ఆనందము పొంది అత్యున్నతమైన మోక్షం కూడా పొందగలుగుతారు. అట్లు చేయకుండా, అమూల్యమైన బాల్య దశను వృథా పరిస్తే భవిష్యత్తులో విచారించ వలసి వస్తుంది, బాధ పడవలసి వస్తుంది.

ఇదే భావాన్ని చక్కగా తెలియబరచే ఈ క్రింది ఒక చిక్కటి నీతి పద్యాన్ని బాల బాలికలు తప్పనిసరిగా కంఠస్థం చేయడం ఎంతైనా అవసరం.

"విద్య యొసగును వినయంబు వినయమునను
బడయుబాత్రత పాత్రత వలన ధనము
ధనము వలనను ధర్మంబు దాని వలన
ఐహికాముష్మిక సుఖంబులందు నరుడు."

# విద్యయే అలంకారము

"సుందరోఽపి సుశీలోఽపి, కులీనోఽపి మహాధనః
శోభతేన వినావిద్యాం, విద్యా సర్వస్య భూషణం"

అనగా "అందమైనవాడైననూ, మంచి శీలవంతుడైననూ మంచి వంశమున జన్మించినవాడైననూ, మహా ధనవంతుడైననూ, విద్య లేకుండ ప్రకాశించడు. ఎందువలననగా విద్య అందరికి అలంకారము" అని అర్థం.

విద్యకు ఎంత విలువున్నదో ఈ శ్లోకం వల్ల అర్థమవుతున్నది. ఒక వ్యక్తికి అందము, శీలము, ధనమూ వుండి మంచి పేరు ప్రతిష్టలున్న గౌరవ ప్రదమైన వంశంలో జన్మించినప్పటికి, విద్యరాని యెడల అతను ఏమాత్రమూ గౌరవించబడడు. అంతేకాదు అతను ఏ రంగములోను చెలామణి కాలేడు. పై లక్షణములతో పాటు విద్య కూడా కలసి వున్నప్పుడే, ఆ వ్యక్తి శోభాయమానంగా రాణిస్తాడు. పదిమందిలో మంచి పేరు ప్రతిష్టలను తెచ్చుకుంటాడు. అభివృద్ధిలోనికి వస్తాడు. "మానవునికి అలంకారం విద్య. శోభనిచ్చేది విద్య. గౌరవమును పెంపొందించేది విద్య. అభివృద్ధికి తోడ్పడేది విద్య. పదిమంది చేత మెప్పును పొందించేది విద్య" అనే విషయం ఏమాత్రం మరువరాదు. విద్యనభ్యసించని వానికి ఈ ప్రపంచంలో ఏమాత్రం విలువ లేదు. అందువల్లనే భర్తృహరి "విద్యా విహీనః

పశుః" అని వ్రాశాడు. విద్య లేనివాడు వింత పశువు. మూర్ఖునితో సమానము అని పెద్దలు ఏనాడో, ఎంతో అనుభవంతో చెప్పారు. కనుక విద్య లేనివాడు ఎందుకూ పనికిరాడు. విద్యతో సమానమైన, అలంకారమైన వస్తువు ఈ భూ ప్రపంచంలో మరొకటి లేదు.

ఇదే వాస్తవమును, యథార్థమును భర్తృహరి సుభాషితములలోని ఈ క్రింది పద్యం తేటతెల్లం చేస్తున్నది. (ఏనుగు లక్ష్మణ కవి తెనిగించారు.)

ఉ. "భూషలుగావు మర్త్యులకు భూరిమయాంగద తారహారముల్
భూషిత కేశపాశమృదు పుష్పసుగంధ జలాభిషేకముల్
భూషలుగావు పూరుషుని భూషితుఁజేయు బవిత్రవాణి వా
గ్భూషణమే సుభూషణము భూషణముల్ నశియించునన్నియున్"

అనగా "భుజములకు అలంకరించుకొను దండె కడియముల వల్ల మనుజునికి అలంకారము రాదు. చంద్రునివలె తెల్లగా ప్రకాశించెడి ముత్యాల దండలను ధరించినందువల్ల ఏమాత్రం ప్రకాశించడు. పన్నీటి స్నానమువలన గాని, చల్లటి చందనమును వ్రాసుకొనుట వలన గాని, సువాసనలు వెదజల్లెడి మల్లెపూలను పెట్టుకొనినందు వలన గాని, చక్కగా దువ్వుకొని అందముగా కేశములను అలంకరించుకొని నందున గాని మనుజుడు ఏమాత్రం శోభించడు" అని అర్థం.

ఈ భౌతిక అలంకారములు ఏమాత్రం శాశ్వతం కావు. కాలక్రమమున క్షీణించి, అరిగి, తరిగి నశించి కాల

గర్భంలో కలసి కనపడకుండా పోతాయి. కాని వ్యాకర ణాది శాస్త్ర శుద్ధమైన వాక్కు అనగా విద్య ఒక్కటే మనుజునికి అలంకార మవుతుంది. అది ఒక్కటే సరైన భూషణం. అదే శాశ్వతమైన కీర్తి ప్రతిష్ఠలను ఆర్జించి పెడుతుంది. దానికి ఎప్పటికీ నశింపు లేదు. పైన అలంకరించు కొన్న అలంకారములను ఒక వేళ దొంగలు దొంగిలించు కొని పోయినా ఆశ్చర్యపడ నవసరం లేదు. కాని కష్టించి శ్రమపడి, కడు శ్రద్ధతో, దీక్షతో, పట్టుదలతో అభ్యసించిన విద్యను సువాక్కును ఎవ్వరూ, ఎప్పుడూ కాజేయ లేరు. పై అలంకారములను భూషణములను దాచుకొనడానికి ఇనుప పెట్టె, కాపలాకు "ఘూర్ఖా" కావాలి గాని విద్యకు అట్టి అవసరం ఏమాత్రం లేదు. విద్యను ఏ భౌతిక శక్తి దొంగి లించ లేదు. కనుక తాత్కాలికమూ, భౌతికమూ, అశా శ్వతమూ ఐన పై పై మెరుగులు చూచి మభ్యపడి మోస పోరాదు. శాశ్వతమైన కీర్తి ప్రతిష్ఠలను సముపార్జించి పెట్టేటటువంటి మంచి విద్యను శ్రద్ధగా నేర్చుకొని వినయ విధేయ తలను అలవరచుకోవాలి.

---

"The end of education is character. వినయ ప్రవర్తనను అలవఱచునదే అసలైన, నిజమైన విద్య. సద్గుణములను పోషించుచూ, మాన వత్వము నుండి దైవత్వమునకు కొనిపోవునదే నిజమగు విద్య. పశుత్వమునకు దిగజార్చు విద్య అవిద్యయే యగును."

—శ్రీ సత్య సాయిబాబా

# విద్యా శ్రేష్ఠత్వము

"విత్తం బంధుర్వయః కర్మ, విద్యా భవతి పఞ్చమీ
ఏతాని మాన్యస్థానాని గరీయోయద్య దుత్తరమ్"

అనగా "ధనము, బంధువు, వయస్సు, కర్మ, విద్య—యీ ఐదు గౌరవించదగినవి. ఇందు వరుసలో అనగా ధనము కంటే బంధుత్వము, దానికంటే వయస్సు దాని కంటే కర్మ, దానికంటే విద్య శ్రేష్ఠమైనది" అని అర్థం.

"ధనమూలం ఇదం జగత్" అన్నారు గదా! ప్రస్తుతం ఈ లోకంలో సామాన్యుల దృష్టిలోనే కాక చాలామంది పెద్దల దృష్టిలో కూడా ధనాన్ని మించినది వేరొకటి లేదనే అభిప్రాయం పాతుకొనిపోయింది. ఎప్పుడైనా ధనవంతునికి, బంధువులకు మధ్య వైరము సంభవిస్తే లేక పోటీవస్తే, సామాన్య దృష్టితో ఆలోచించేవారు సహజంగా ధనవంతుని పక్షంనే వుంటారు. ఇంగిత జ్ఞానం గల వివేకవంతులు మాత్రం బంధుత్వానికి విలువ యిస్తారు. ఇచట బంధుత్వమంటే ఒక చుట్టరికం, లేక రక్త సంబంధం అని చెప్పుకుంటే చాలదు. ఒక్క సుఖములోనే గాక, కష్టంలో కూడా దూరం కాకుండా, ఆత్మీయతతో, అనురాగంతో అంటిపెట్టుకొని వుంటూ మనస్ఫూర్తిగా సహకారాన్ని వెదజల్లేవారిని మాత్రమే 'బంధువులు' అని చెప్పుకుంటే సమంజసంగా వుంటుంది.

ఇకపోతే అటువంటి బంధుత్వానికి, వయస్సుకు మధ్య వైరుధ్యం ఏర్పడితే సహజంగా సామాన్యులు బంధుత్వానికే విలువ యిస్తారు. వయస్సు మళ్ళిన వారిని ఏ మాత్రం గౌరవించరు. కాని విచక్షణాజ్ఞానం, లౌకిక జ్ఞానం గల అనుభవజ్ఞులు మాత్రం వయస్సుకు ప్రాధాన్య మిస్తారు. ఇక్కడ వయస్సు అంటే వట్టి సంవత్సరములు అని చెప్పుతుంటే సరిపోదు. వయస్సుతో పాటు బుద్ధికూడా వికసించిన వయోవృద్ధులు అంటే బాగుంటుంది. అట్టివారిని జ్ఞాన వృద్ధులంటారు.

ఒకవేళ వయస్సు, కర్మల మధ్య వైషమ్యం వస్తే అతిసహజంగా వయస్సుకే విలువయిస్తుంది సామాన్య ప్రజానీకం. కర్మను గుర్తించరు. కాని విజ్ఞులు, దూరదృష్టి కలవారు మాత్రం 'కర్మ' కు ప్రాధాన్యమిస్తారు. 'కర్మ' అంటే యిక్కడ వట్టి మామూలు 'పని' అని చెప్పుకుంటే సరిపోదు. 'కర్మ' అంటే 'సత్ కర్మ' అనగా మంచి పని అని అర్థం. అనగా శాస్త్ర సమ్మతమైన పని అని, అట్టి దానిని నిష్కామ బుద్ధితో, ఎట్టి ఫలితమును ఆశించకుండా, ఈశ్వరార్పణ బుద్ధితో ఆచరించేటటువంటి 'పవిత్ర కర్మ' అని అర్థం.

అటువంటి ఉత్తమ 'కర్మ' 'విద్య' లలో దేనికి ప్రాధాన్య మివ్వాలో నిర్ణయించడం సామాన్యులకు బహుకష్టం. కాని అటువంటి సందిగ్ధ పరిస్థితి ఎప్పుడైనా ఉత్పన్నమైతే సామాన్యులు 'కర్మ' కే విలువనిస్తారు. శాస్త్ర పరిజ్ఞానం గల అనుభవశాలురు మాత్రం 'విద్య' కే ప్రాధాన్య మిచ్చి

గౌరవిస్తారు. కారణం ఏమిటి ? ఇక్కడ 'విద్య' అంటే 'అక్షరజ్ఞానం' అని తలంచరాదు. వినయ విధేయతలతో పాటు, జ్ఞాన విజ్ఞానములను సముపార్జించి పెట్టేదని, శాస్త్ర పరిజ్ఞానంతో పాటు అనుభవజ్ఞానం, వివేకజ్ఞానం, లౌకిక జ్ఞానం కూడ సంపూర్ణంగా సంపాదించి యిచ్చేదని చెప్పు కుండే మంచిగా సరిపోతుంది.

ఆఖరికి దీనినిబట్టి చూస్తే విద్యతో సమానమైనది, సాటి అయినది, సరితూగ గలది ఈ లోకంలో వేరొకటి లేదనే విషయం స్పష్టమవుతున్నది.

ఈ సందర్భంలో విద్య యొక్క గొప్ప తనాన్ని గురించి భర్తృహరి సుభాషితములలోని ఈక్రింది పద్యంలో చక్కగా వర్ణించబడింది.

ఉ. "విద్య నిగూఢ గుప్తమగు విత్తము రూపము పూరుషాళికిన్
విద్య యశస్సు భోగకరి విద్యగురుండు విదేశబంధుఁడున్
విద్య విశిష్టదైవతము విద్యకు సాటి ధనంబులే దిలన్
విద్య నృపాల పూజితము విద్య నెరుంగనివాడు మర్త్యుడే"

విద్య యొక్కటియే పురుషునికి మంచిగా ప్రకాశింప జేయునట్టి రూపము వంటిది. మానవునికి విద్యయే గొప్ప సౌందర్యము, పరుల కెవ్వరికి తెలియకుండా, రహస్యంగా, మిక్కిలి పదిలంగా, భద్రంగా దాచిపెట్టుకొనడానికి వీలైన ధనము లాంటిది. సమస్త, భోగభాగ్యములను, కీర్తి ప్రతిష్ట లను, సుఖ సౌఖ్యములను కలుగజేయునది కూడా విద్యయే. గురువులకు గురువు కూడా విద్యయే. విద్య పరమాత్మవలె

మోక్షమును, ఇష్టదైవమువలె ఐహికాముష్మిక ఫలము లను కూడా యిచ్చును. రాజులచేత పూజింపబడేట్లు చేయు నది, స్వాగత సన్మానములను లభింప జేయునదికూడా విద్యయే. సభ్యులను సమ్మోహితుల్ని చేసి వశపరచుకొన గల శక్తి కూడా విద్యలో ఉన్నది. ఈ లోకంలో సుఖశాంతులతో సౌఖ్యంగా జీవితమును గడపటానికి మంచిగా ఉపకరించేది కూడా విద్యే. విద్య కన్నా అధిక ధనం మరొకటి ఈ లోకంలో లేదు.

అట్టి ఉత్తమోత్తమమైన, పరమోత్కృష్టమైన, వివేక విజ్ఞానాదులను, గౌరవ ప్రతిష్ఠలను, స్వాగత సన్మానా లను సంపాదించి పెట్టేటటు వంటి 'విద్య' ను అభ్యసించడం ప్రతివాని కర్తవ్యం, విద్యుక్తధర్మం. అట్టి విద్య నభ్యసించని వాడు పశువుతో సమానం. అటువంటి సోమరిని అవివేకుడని కర్తవ్యాకర్తవ్యముల నెరుగని వివేక శూన్యుడని సర్వత్రా భావిస్తారు.

---

"Start early, Drive Slowly, Reach Safely ముందుగనే బయలు దేరుము. నెమ్మదిగ నీ బండిని నడుపుము. క్షేమముగా గమ్యమును చేరుము. అనునట్లు చిన్న వయసుననే ఉన్నతమైన, ఉత్తమమైన మార్గములో పయనింప యత్నము చేయుటయే సార్థకమైన మానవత్వమగును."

—శ్రీ సత్య సాయిబాబా.

# విద్య లేనివారు శోభించరు

''రూపయౌవన సంపన్నా విశుద్ధ కులసంభవాః
విద్యా హీనా నశోభన్తే నిర్గంధా ఇవ కింశుకాః''

అనగా ''విద్య లేనివారు మంచి రూపము, యౌవనము కలిగి యున్నప్పటికిని, గొప్ప వంశమునందు జన్మించినప్పటికినీ, వాసన లేని మోదుగువ పూవువలె శోభించరు'' అని అర్థము.

హితోపదేశము నందు ఈ నీతి శ్లోకము చక్కగా ఉపమాన సహితంగా వర్ణించబడింది. మోదుగు పూవు చూడటానికి చక్కగా అందంగా వుంటుంది. కాని సువాసన ఏమాత్రం వుండదు. వాసనలేని పూవును సహజంగా ఎవరూ కోరరుగదా! స్త్రీలు పెట్టుకొనరు. దండలలో గుచ్చుకోరు. (అటువంటి బ్రతుకు అడవిన గాచిన వెన్నెల లాంటిదే అవుతుంది.) అదే విధంగా మేడిపండు కూడా పైకి చూడటానికి నిగనిగలాడుతూ వుంటుంది. పొట్ట విచ్చి చూస్తే పురుగులుంటాయి. అటువంటి పండును ఎవరూ తినరుగదా? అదే విధముగా పొట్టకోస్తే అక్షరం లేని మూర్ఖుని కూడా ఎవరూ ప్రేమించరు, గౌరవించరు.

''చూచీ చూడటంతోనే ఆకర్షణీయమైన అందం, మంచి రూపం రంగూ వుండి, ముఖంలో మంచికళ ఉట్టి

పడుతూ, కన్నులు కడు ఆకర్షణీయముగా లేడి కండ్లలాగే సౌందర్యవంతంగా వుంటూ, ముక్కు కొట్టవచ్చినట్లుగా ఘనంగా కనుపించుతూ, పండ్లు దానిమ్మ గింజలలాగే మెరసిపోతూ, అందరిచేత అందగాడని పొగడ్తలు పొందుతూ. ఈ మన్మధ సౌందర్యానికి తోడు మంచి యౌవనము అనగా మిస మిసలాడె వయస్సు వుంటే అతనికి పట్ట పగ్గాలేవుండవు. ఈ రూపానికి తోడు మంచి సిరిసంపదలు, ఉన్నతమైన మంచి పేరు ప్రతిష్టలు గల గొప్ప వంశమున జన్మించిన అగర్భ శ్రీమంతుడైతే యిక కావల్సింది ఏమిటి?'' అని సామాన్య పామర జనం అంటారు. కాని యిన్ని మంచి లక్షణములు ఒకే వ్యక్తిలో మూర్తీభవించినప్పటికీ అసలు వుండవలసిన, అవసరమైన విద్యే గనుక లేకపోతే అతని బ్రతుకు నిజంగా అడవిన గాచిన వెన్నెలే అవుతుంది. అతను సమాజంలో ఏమాత్రం ప్రకాశించడు. చెలామణి కానేకాలేడు. మేడి పండు కోసి చూచి తినకుండా ఏ విధంగా పారవేస్తారో, అదే విధంగా విద్య లేని ఈ మన్మధుడ్ని ముందు ప్రేమించినా, తరువాత నయినా దూరంగా వుంచుతారు. మోదుగు పూవుని త్రుంచి సువాసన రాకపోవడంతో ఏ విధంగా అవతల పారవేస్తారో, అదేవిధంగా ఛొక్క శుద్ధిలేని వానిని దరికి చేరనీయరు.

కనుక మానవునికి కావలసినది పై పై మెరుగులు మాత్రమే కావు. బాహ్య సౌందర్యంతో పాటు అంతః సౌందర్యం గల మంచి విద్య కూడా వుండాలి. అట్టివారినే

పదిమంది ప్రేమిస్తారు, గౌరవిస్తారు, ఆదరిస్తారు. ఒక్కొక్క సమయంలో బాహ్య సౌందర్యం లేక పోయినప్పటికి ఫరవా లేదు. 'అష్టావక్రుడు' లాంటి కురూపి, గొప్ప విద్వాంసుడు కావడం వల్ల సమాజంలో మంచి పేరు ప్రతిష్ఠలు తెచ్చుకో గలిగాడు. రాజాధి రాజులచేత మంచి సత్కారాలనందు కున్నాడు. కనుక అన్నిటికన్నా మిన్న అయిన 'విద్య' ను అభ్యసించడం ప్రతివాని కర్తవ్యం.

---

''వినయ వివేకాదులను వృద్ధి పొందించుటకు అనుకూలపడని విద్య లేక పోయినను దాని వలన వచ్చెడి నష్టమేమియు లేదు. సుగుణ సంపదను గడించుట కయి విద్య నేర్వవలసినదే గాని, విద్య నిమిత్తమై సద్గుణములను విడువరాదు. పలువురు మూర్ఖులైన నిరక్షరకుక్షులు చేరి చేయు హాని కంటెను, ఒక చదువుకొన్న దుష్టుడు చేయు హానియే అధికము.''

—శ్రీ కందుకూరి వీరేశలింగంపంతులు

# విద్వాంసుడు పూజింపబడుతాడు

"విద్వత్వంచ నృపత్వంచ, నైవతుల్యం కదాచన
స్వదేశే పూజ్యతేరాజా, విద్వాన్ సర్వత్ర పూజ్యతే"

అనగా "పాండిత్యమును, రాచరికమును ఎన్నడూ సమానమైనవి కానేకావు. రాజు తన దేశమునందే పూజింపబడుచున్నాడు. విద్వాంసుడు మాత్రం అన్ని దేశములయందు పూజింపబడుచున్నాడు" అని అర్థం.

సమస్త అధికారాలు, సిరిసంపదలు గల రాచరికం కన్నా పాండిత్యమే గొప్పదనే విషయం ఈ శ్లోకం స్పష్టపరుచుచున్నది. అధికారం, రాజ్యం ఉన్నంత వరకే రాజు గౌరవించబడుతాడు. అధికారం వున్నప్పుడయినా, అధికార పరిధిలో ఉన్నవారు మాత్రమే గౌరవిస్తారు. కాని పండితుని అన్నివేళలా, అందరూ గౌరవిస్తారు, సన్మానిస్తారు, పూజిస్తారు. తాను పుట్టిన దేశంలోనే కాక, ఏ దేశం వెళ్ళినా పండితునికి స్వాగత సత్కారాలు లభిస్తాయి. అధికార దండం చేబూనిన రాజుకన్న, పాండిత్యం గల విద్వాంసునికే సమాజం ఎంతో విలువ యిస్తుంది,

అసలు పండితుడంటే ఎవరు ? పాండిత్యం అంటే ఏమిటి ? పండితుడనగా కావ్య, శాస్త్ర, వ్యాకరణ సాహిత్య పరిజ్ఞానం కలవాడు మాత్రమేనని చెప్పుకుంటే సరిపోదు. సహజంగా, సామాన్యంగా పండితుడనగానే

సాహిత్యమునందు మంచి కౌశల్యము గలవాడని, కవిత్వం శరపరంపరగా 'ఆశువుగా' చెప్పగలవాడని, కావ్యములు అర్థ యుక్తంగా, మాధుర్యంగా గానం చేయగలవాడని, పురాణములు చక్కగా చదివినవాడని, వేదశాస్త్రములను కూలంకుషంగా అధ్యయనం చేసినవాడని, వ్యాకరణ చంధస్సులు కరతలామలకములుగా గలవాడని, అధునాతన భౌతిక శాస్త్ర పరిజ్ఞానం కలవాడని ప్రజలు భావిస్తుంటారు. కాని భగవద్గీతలో భగవానుడు పండితుడనగా "పండితాః సమదర్శినః" అని చెప్పాడు. సమస్త చరాచర ప్రాణి కోటి యందు సమభావము కలవాడని, ఎవరికొఅకును, దేని కొఅకును దుఃఖింపనివాడని, పరోపకారమే పరమావధిగా భావించి, మానవసేవే మాధవసేవ యని తలంచి, నిరంతరమూ ప్రజాసేవలోనిమగ్నుడై నిస్వార్థబుద్ధితో వ్యవహారించగల మహాత్ముడే "పండితుడు లేక జ్ఞాని" అని శ్రీకృష్ణుడు గీతలో చెప్పాడు.

కనుక మనం యిక్కడ మాత్రం శాస్త్ర జన్య పరిజ్ఞానంతో పాటు పైన చెప్పిన విధముగా మహాత్ముల లక్షణములను కూడా అలవరచుకొని సమాజాభివృద్ధికి తోడ్పడవలెను. అటువంటి పరమోత్కృష్టమైన శక్తిని సముపార్జించిన విద్వాంసుడు, లేక పండితుడు రాజుకన్నా గొప్పవాడేనని భావించడంలో ఏ మాత్రం అతిశయోక్తి లేదు. అటువంటి మహా శక్తి సంపన్నుడైన పండితుడు అన్ని దేశము

అలో సహజంగా గౌరవింపబడి, పూజింపబడుతాడంటే ఏ మాత్రం ఆశ్చర్యపడనవసరం లేదు.

కనుక అటువంటి ఉత్తమస్థితికి చేరుకోవాలనే పట్టుదల, శ్రద్ధ ప్రతివ్యక్తికి వుండడం అత్యావశ్యం.

---

''శారీరక, మానసిక అభివృద్ధిలను కలిగించే విద్య నేర్చిననాడే మానవుడు వృద్ధి చెందుతాడు''

—శ్రీ మహాత్మాగాంధీ

''విద్య అంటే విషయ బాహుళ్యాన్ని మెదడుకు పట్టించడం కాదు. జీర్ణం కాక కల్లోలం సృష్టించే సామగ్రికాదు. ఉజ్జీవనకరం, మానవ నిర్మాణకరం, శీల నిర్మాణ సమర్థములైన భావములను జీర్ణించుకో గలిగినదే విద్య''

—శ్రీ వివేకానంద

# విద్యయే గొప్ప ద్రవ్యము

"సర్వద్రవ్యేషు విద్యైవ ద్రవ్యమాహురనుత్తమమ్
అహార్యత్వా దనర్ఘ త్వా దక్షయత్వాచ్చ సర్వదా"

అనగా "ఎల్లప్పుడూ దొంగిలింప శక్యము కాని దగుట వలననూ, నాశనము కానిదగుట వలననూ, వెలకట్ట శక్యము కానిదగుట వలననూ, అన్ని ద్రవ్యములయందు విద్యయే గొప్పదైన ద్రవ్యముగ చెప్పుదురు" అని అర్థము.

భౌతికమైన బంగారము, నగలు, మేడలు, మిద్దెలు, పొలాలు మొదలైన ప్రసిద్ధమగు సిరిసంపదలు కన్నా విద్యా ధనమే ఎన్నో రెట్లు మేలైనది. ఎందుకనగా విద్యా ధనము దొంగలకు దొంగిలింప శక్యము కానిది. పనిగట్టుకొని నాశనము చేయాలనుకున్నా ఎవరి తరమూ కాదు. ఈ విద్యా ధనమునకు విలువ ఎంతో ఎవ్వరూ కట్టలేరు. అటువంటి వెలలేని అమూల్యమైన విద్యా ధనమును పొందినవారు నిజంగా ఎంతో అదృష్టవంతులు. అట్టివారు పూర్వ జన్మలో ఎంతో పుణ్యం చేసుకొని వుంటారనడంలో ఏ మాత్రం అతిశయోక్తి లేదు. ఇక్కడ ద్రవ్యము అంటే సామాన్యమైన భౌతిక సిరిసంపదలు అనగా డబ్బు, బంగారం, నగలు, మేడలు, మిద్దెలు, భవనాలు, పొలాలు అని చెప్పుకుంటే సరిపోతుంది. "అర్థానా మార్జనే దుఃఖమ్" ధనము సంపాదించుటయందు దుఃఖము కలుగుచున్నది. ధనం విప

రీతంగా అనగా తన అవసరానికి మించిన ధనమును సంపాదించిన వానికి సుఖమూ వుండదు, (సౌఖ్యం అంతకన్నా వుండదు), మనశ్శాంతి అసలే వుండదు. తాను అనుభవించ లేడు. ఇతరులకు చూస్తూ చూస్తూ ఇవ్వలేడు. అనుభవిస్తే అయిపోతుందేమోనని భయం. దాచుకుంటే దోచుకుంటారేమోనని మరోవ్యథ. ఎంతో జాగ్రత్తగా ఇనుప పెట్టెలో పెట్టి, గట్టి తాళంవేసి, వీలుంటే విద్యుచ్ఛక్తిని కూడా దానికమర్చి, భవనం మధ్య గదిలో ఆ పెట్టె పెట్టి తలుపులు బిగించి, ఇంటికి ఏ "ఘూర్ఖా" నో కాపలా పెట్టి కూడా ప్రశాంతంగా ఇంటి యజమాని నిద్రపోలేడు. ఇంత కట్టుదిట్టం చేసినా పోయేకాలం గనుక దాపురిస్తే ఎవ్వరూ ఆపలేరు గదా! ఇంత బాధ పడటం ఎందుకని ఆ ధనం ఎవరికైనా అప్పుగా యిస్తే తిరిగి వచ్చేదాకా నమ్మకం లేదు. ఒకవేళ వచ్చినా యిచ్చినదంతా పూర్తిగా రాదు. వచ్చినదైనా ఒకే పర్యాయం చేతి కందదు. ఒకళ్ళ కివ్వడం దేనికని బంగారు నగలు, వెండి వస్తువులు చేయిస్తే, దానిని దాచిపెట్టలేక యిబ్బంది పడాలి. దొంగలు దోచుకుంటారేమోననే భయం సతతమూ వెంటాడుతునే వుంటుంది. చేయించుకున్న వస్తువులు కూడా శాశ్వతంగా వుండవు. కాలక్రమంలో అరిగి, విరిగి, నశించిపోయే ప్రమాదం కూడా వున్నది. ఈగొడవంతా ఎందుకని ఆ సంపాదించిన డబ్బుతో మేడలు, భవనాలు నిర్మిస్తే అవీ శాశ్వతంకావు. నిర్మించిన వాటిలో కొంత భాగం అద్దెలకిస్తే, అద్దెడబ్బు చేతికి వచ్చిందాకా నమ్మకం లేదు. అద్దెకు తీసుకున్నవాళ్ళు ఆ

భవనాలను జాగ్రత్తగా చూస్తారనే నమ్మకం అసలే లేదు. అంతేగాక దురదృష్టవశాత్తు భూకంపం గాని, తుఫానుగాని వస్తే "గాలివాన వస్తే అసలు కథేలేదు" అన్నట్లుగా ఒక క్షణంలో నేలమట్టమవుతాయి. పొలంమీద పెట్టుబడిపెడితే పంట ఇంటికొచ్చిందాకా నమ్మకంలేదు. దొంగలు దొంగిలించ వచ్చు లేక అతి వృష్టి అనా వృష్టులకు సర్వనాశనం కావచ్చు.

కనుక మానవుడు కక్కుర్తిపడి, తన న్యాయమైన అవసరాలకు మించి సంపాదించిన భౌతిక సంపద శాశ్వతంగా మన జాలదనే విషయం జగద్విదితం, పాకిష్టి డబ్బు మనశ్శాంతి లేకుండా చేస్తుంది. ఆత్మీయులను దూరం చేస్తుంది. ప్రేమవాత్సల్యాలను మంట గలుపుతుంది. స్వార్థ సంకుచితత్వాలను సృష్టిస్తుంది. ఈర్ష్యాద్వేషాలను రగులుకొల్పుతుంది. మారణ హోమాలను లేపుతుంది. చిట్ట చివరకు కనపడకుండా కాలగర్భంలో కలసిపోతుంది.

కాని ఈ సమస్త ద్రవ్యములలోకెల్ల ఒక్క విద్యాద్రవ్యమే శాశ్వతమైనది. దీనిని దొంగలు దొంగిలించలేరు. సోదరులు స్వాహా చేయలేరు. బంధువులు భగ్నం చేయలేరు, అగ్నికి ఆహుతి కాదు. ఉప్పెనకు ఊడ్చిపెట్టుకొని పోదు. తుఫానుకు తరగిపోదు. కనుక ఇటువంటి నశింపు లేనటువంటి శాశ్వతమైన, వెలలేని అమూల్యమైన ఈ విద్యాధనమును సంపాదించిన వారికి మాత్రమే మనశ్శాంతి వుంటుంది. అది సంపాదించిన వారికి ఎటువంటి భయమూ

వుండదు. అట్టివాని జీవితమే సార్థకమవుతుంది. అందువల్లనే అన్ని ద్రవ్యములలోకెల్ల విద్యా ద్రవ్యమొక్కటే గొప్ప దని పెద్దలు ఏనాడో చెప్పారు. అటువంటి గొప్పదైన విద్యా ధనమును ప్రతి ఒక్కరూ సంపాదించి తీరాలి. ముఖ్యంగా బాల్యదశయందే ఆర్జించాలి. ఈ సదవకాశమును యిప్పుడు గనుక జారవిడచుకుంటే పశ్చాత్తాప పడవలసి వస్తుంది.

"పశ్చాత్తాపంకంటే పూర్వ తాపము వేయిరెట్లు మేలు" అని గ్రహించవలెను.

---

"భౌతిక శక్తి అవసరమే. కాని శీలము మరింత ముఖ్యం. శీలము లేని శక్తి మనిషిని కేవలం పశువుగా మారుస్తుంది. వ్యక్తిగతంగా చూచినా, జాతి పరంగా చూచినా పవిత్రత, శీలమూ జాతీయ వైభవానికి, మహత్వానికి ప్రాణాధారం."

—శ్రీ గురూజీ గోల్వాల్కర్

# విద్య అపహరింపబడదు

"నభోగ హార్యా నచబన్ధు హార్యా
నభ్రాతృహార్యా నచరాజ హార్యా
స్వదేశ మిత్రం పరదేశ బన్ధుః
విద్యా సుధాం యేపురుషాః పిబన్తి"

అనగా "విద్యా ధనము అనుభవించుటచేత తరగదు. బంధువులచేతనూ, అన్నదమ్ముల చేతనూ, రాజుల చేతనూఅపహరించబడదు. స్వదేశమునందు మిత్రునివంటిది. పరదేశమునందు బంధువు వంటిది. అట్టి విద్యయను అమృతమును ఏ పురుషులు త్రాగుదురో గదా!" అని అర్థం.

విద్యా ధనమును అనుభవించడం-వల్ల ఏ మాత్రం తరిగిపోదు, ఖర్చుకాదు, అయిపోదు, నశించిపోదు. దానిని దానం చేయడం వల్ల అనగా మరొకరికి యిచ్చినందువల్ల ఖర్చుకాదు, నేర్పినందువల్ల తరిగిపోదు. వృధా అంతకన్నా కాదు. ఎవరైనా తనకు వచ్చిన విద్యను, సంపాదించిన విద్యా ధనమును పదిమందికి నేర్పినందువల్ల, యివ్వడంవల్ల ప్రావీణ్యము, అనుభవం పెరుగుతాయే గాని ఏమాత్రం నష్టపోరు. పై పెచ్చు ప్రసిద్ధి చెందిన విద్యా వేత్తలుగా, విద్వాంసులుగా తయారవుతారు. దొంగల చేత సహితం దొంగిలింప శక్యముగాని ఈ విద్యా ధనమును బంధువులు

గాని, అన్నదమ్ములు గాని, చిట్టచివరికి రాజులు గాని ఏ మాత్రం హరించలేరు. కాజేయలేరు కూడాను.

భౌతికమైన స్థిరాస్థులను ఏదో ఒక మిషతో, మాయోపాయంతో, కుట్రతో కొంతమంది స్వార్థపరులైన బంధువులుగాని, కృతఘ్నులైన సోదరులుగాని ఒకవేళ కాజేస్తే కాజేయవచ్చును. మరికొంతమంది, చేసిన మేలును మఱచి విశ్వాస ఘాతుకులుగా, నమ్మించి, మోసంచేసి ఆస్తులను కబళించ వచ్చును. అదేవిధంగా ప్రభుత్వం విపరీతమైన పన్నులు విధించిగాని, గరిష్ట పరిమితి చట్టాల ద్వారా గాని, మరియూ రకరకాలైన నియమ నిబంధనల ద్వారా ఆంక్షలను విధించి గాని, ఏ వ్యక్తి ఆస్తినయినా స్వాధీనపరచుకొనవచ్చును; గాని విద్యా ధనమును మాత్రం ఎవ్వరూ కాజేయలేరు. నీరు చిమ్మినకొద్దీ చెలమ ఏ విధంగా వూరుతూంటుందో; అదే విధంగా పదిమందికీ నేర్పిన కొద్దీ, ఈ విద్య దిన దిన ప్రవర్థమానంగా పెరిగి అభివృద్ధి చెందుతూవుంటుంది.

అంతేకాదు; ఈ విద్య స్వదేశమునందు మిత్రుడులా, ప్రాణస్నేహితుడులా ఉపయోగపడుతూ వుంటుంది. అవసరమైనప్పుడు ఆదుకొంటుంది. రక్షిస్తుంది.

అసలు మిత్రుడంటె ఎవరు? అతని లక్షణాలు ఏ విధంగా వుంటాయి? అనే విషయం తెలుసుకోవడం ఎంతయినా అవసరం. అభివృద్ధిలో ఉన్నప్పుడు, సకల సంపదలతో విలసిల్లు తున్నప్పుడు, భోగభాగ్యాలలో తులతూగుతున్నప్పుడు ప్రతి ఒక్కరూ తమ స్వలాభం కోసం, స్వ

ప్రయోజనం కోసం మిత్రులుగా వ్యవహరిస్తారు. వదలకుండా అంటిపెట్టుకొని తిరుగుతూ వుంటారు. పొగడుతూ స్తుతిస్తుంటారు. ఒకవేళ దురదృష్టవశాత్తు ఆపదలకు లోనై భౌతికమైన సంపదలను సర్వస్వాన్ని కోల్పోయినప్పుడు గాని, ఊహించనటువంటి ప్రమాదములు, కష్టములు సంభవించినపుడు గాని అసలు మిత్రుడెవడో అర్థమవుతుంది. అప్పటి వరకు అమిత ప్రాణస్నేహితులుగా వుంటూ వెంబడి తిరిగే వారిలో చాలామంది దూరమైపోతారు. కంటికి కనపడకుండా మటుమాయమవుతారు. నిజమైన మిత్రుడు, ప్రాణస్నేహితుడు తప్ప అందరూ అదృశ్యమవుతారు. కష్టకాలంలో కూడా విడువకుండా, ఛాయలాగ ఎవరు వెంబడి వుంటారో, ఆదుకుంటారో వారే నిజమైన మిత్రులు. మనకు సంభవించిన సుఖదుఃఖములలో సరిసమానంగా పాలు పంచుకుంటూ, అహర్నిశలూ మనల్ని వదలకుండా, ఎవరు వెంబడి వుంటారో వారే నిజమైన మిత్రులు.

ఇదే భావమును చక్కగా వర్ణించిన భర్తృహరి సుభాషితముల లోని ఈ క్రింది పద్యమును సర్వవేళలా మననం చేయడం చాలామంచిది.

తే. "అఘము వలన మఱల్చు హితార్థకలితుఁ
జేయు గోప్యంబుదాచు బోషించు గుణము
విడువఁడాపన్ను లేవడి వేళనిచ్చు
మిత్రుఁడీ లక్షణంబుల మెలగుచుండు"

అనగా "పాపపు పనుల నుండి మఱల్చుట, మంచి పనులు చేయుటకు పురిగొల్పుట, రహస్యమును దాచుట,

మంచి గుణములను వెల్లడి జేయుట, ఆపద కలిగినప్పుడు కూడా విడచిపోకుండుట, లేనప్పుడు అవసరమైన దాని నిచ్చుట - మొదలైనవి నిజమైన మిత్రుడి లక్షణములు. "మాతా మిత్రం పితా చేతి స్వభావా త్త్రితయం హితం" అనగా "తల్లిదండ్రుల తరువాత సహజంగా ప్రేమించుచూ మేలు కోరేవాడు మిత్రుడే" అనే ఆర్యోక్తి కూడా కలదు. అటువంటి ప్రాణ స్నేహితుడు లాంటి మిత్రుడుండటం అందరూ నోచుకోలేరు. లభించరుకూడాను. దురదృష్ట వశాత్తు అటువంటి మిత్రుడు లభించక పోయినప్పటికీ విచారించ నవసరం లేదు. మంచి విద్య గనుక వుంటే ఆలోటును పూరిస్తుంది. ఎటువంటి విపత్కర పరిస్థితుల నయినా సరే ఈ విద్యా ధనంతో సునాయాసంగా ఎదుర్కొన వచ్చు. ఎంతటి కష్టములనైనా క్షణకాలంలో దాటవచ్చును. అందు వల్లనే 'విద్య' ను మంచి గుణశీలుడైన మిత్రునితో పోల్చారు పెద్దలు.

ఇకపోతే విద్యను పరదేశమునందు బంధువునిగా కూడా వర్ణించారు పెద్దలు. "అసలు బంధువులంటే ఎవరు ? వారి లక్షణములు ఏ విధంగా వుంటాయి ?" అనే విషయం కూడా తెలుసుకోవడం ఎంతయినా అవసరం. బంధువులంటే చుట్టములు, సగోత్రీకులు, దాయాదులు, రక్త సంబంధీకులు అనే అభిప్రాయం సామాన్యంగా అందరిలో వున్నది. ఇది సరిపోదు. ఇంకా కొంచెం ముందుకు పోయి ఆలోచించాలి. ఎవరైనా సరే ధనమును బాగా సంపాదించినప్పుడు మంచి

ఉన్నత స్థితిలో నున్నప్పుడు-అతని చుట్టూ చాలా మంది చేరుతారు. ఎక్కడెక్కడివారో వచ్చి బంధువులమని వరుసలు కలుపుకొని ఇంట్లో తిష్ఠ వేస్తారు. రోజుల తరబడి విందులారగిస్తూ వుంటారు. ఇదే భావమును చక్కగా, వివరంగా ఈ క్రింది సుమతీశతక పద్యంలో వర్ణించబడింది.

కం. "ఎప్పుడు సంపద కలిగిన
నప్పుడు బంధువులు వత్తు రది యెట్లన్నన్
దెప్పలుగా చెఱువు నిండిన
కప్పలు పదివేలు చేరు గదరా సుమతీ"

అనగా "ఎప్పుడు మానవునికి సిరిసంపదలు కలుగునో, అప్పుడు వాని ఇంటికి ఎక్కడలేని బంధువులు పిలువకుండానే వచ్చెదరు. అది ఎట్లనగా చెఱువు సమృద్ధిగా నిండియున్న తరుణమందు కప్పలు అనేకం అందులో చేరుతాయి గదా!" అని అర్థం.

అప్పటి వరకూ బెక బెకలాడుతూ వున్న కప్పలు చెఱువు ఎండిపోయేటప్పటికి ఎక్కడా కనుపించవు. ఎక్కడికో కనపడకుండా పోతాయి. ఇది ప్రకృతి సహజ లక్షణం. అదే విధముగా సంపదలు తరగిపోయినప్పుడు, అప్పటి వరకు ఇంట్లో వుండి సుష్టుగా భోజనం చేస్తున్న బంధువులందరూ మటుమాయమై పోతారు. సహాయం చేయవలసి వస్తుందనే భయంతో కనుపించను కూడా కనుపించరు. సహాయం చేయక పోగా చాటునుండి అభాండాలు వేస్తారు.

అవహేళన చేస్తారు, నిందలు మోపుతారు, అవమాన పరచ డానికి కూడా వెనుకాడరు.

బాహ్య భౌతిక సంపదలను చూచి మోహపడ కుండా, వ్యక్తి మంచి తనానికే విలువ యిస్తూ, మనస్సును గ్రహించినవారు మాత్రమే సంపదలు పోయిన తరుణంలో కూడా వదలిపెట్టిపోరు. కష్ట కాలంలో కూడా విడచిపోక అంటిపెట్టుకొని వుంటారు. పై పెచ్చు అవసరమైన సహాయ మును అందిస్తూ ఆదుకుంటారు. అటువంటి నిస్వార్థపరులైన వారిని మాత్రమే నిజమైన బంధువులుగా చెప్పుకుంటే బాగుంటుంది. మిగతా వారు రక్త సంబంధీకులైనప్పటికి స్వార్థపరులుగా విశ్వాస ఘాతుకులుగా కృతఘ్నులుగా భావించి వారిని వదలివేయడం మంచిది.

రాజాధి రాజు సాక్షాత్ భగవత్స్వరూపుడు అయిన శ్రీకృష్ణ పరమాత్మ కటికి పేదవాడూ తన బాల్య స్నేహి తుడూ ఐన కుచేలుని మరువలేదు. అతడు ప్రేమతో పెట్టిన అటుకులనే మహానందంతో ఆరగించాడు. ఇది నిజమైన మిత్రత్వానికి నిదర్శనం. ఆనాడు కురుక్షేత్ర మహా సంగ్రా మానికి పూర్వం రాయబారానికి వెళ్ళిన శ్రీకృష్ణుడు దుర్యోధనుడివ్వ బూనిన పంచభక్ష్య పరమాన్నాలను స్వీకరించక, పేదవాడైన 'విదురు'ని ఇంట్లోనే భోజనం చేశాడు. శ్రీకృష్ణుడు పేదవాడైన విదురునే ఆత్మీయ భావంతో మన సారా ప్రేమించి గౌరవించాడు గాని సకల సంపదలతో తులతూగుతూ, భోగభాగ్యాలతో విలసిల్లుతూన్న దుర్యోధ

నునికి ఏమాత్రం విలువ యివ్వలేదనే విషయం విస్మరించ రాదు. అటువంటి ఉన్నతములైన, నిరాడంబర భావములుగల వారిని మాత్రమే నిజమైనబంధువులుగా భావించాలి. విదేశములకు వెళ్ళినప్పుడు అక్కడ ఇటువంటి ఆత్మీయులైన బంధువులు ఒక్కొక్కప్పుడు దొరకకపోవచ్చును. అయినప్పటికి 'విద్య' అనే అమూల్యద్రవ్యము కనుక దగ్గరవుంటే ఆలోటు పూరించబడుతుంది. మంచి విద్య ఉత్తముడైన బంధువుతో సమానం. అందువల్లనే విద్యను కూడా ఆత్మీయులైన మంచి బంధువులతో సమానంగా పోల్చారు పెద్దలు.

అట్టి ఉత్తమోత్తమమైన, పవిత్రమైన, అమూల్యమైన, విద్యయను 'అమృతమును' ఎవరు త్రాగుదురో అనగా ఎవరు అట్టి విద్యను శ్రద్ధతో, పట్టుదలతో, అభ్యసిస్తారో వారు వాల్మీకి, వ్యాస, కాళిదాస, వివేకానంద, రవీంద్రనాధటాగూర్ ల వలే శాశ్వత కీర్తిమంతులవుతారు. అట్టి అదృష్టవంతులు ప్రపంచంలో ఏ మూలలకు వెళ్ళినా గౌరవించబడుతారు. పూజింపబడుతారు. అట్టి మహనీయుల చరిత్ర సువర్ణాక్షరములతో లిఖించబడుతుంది. వారి భౌతికమైన దేహాలంతరించి నప్పటికీ వారి కీర్తిప్రతిష్ఠలు మాత్రం చిరస్థాయిగా విలసిల్లుతునే వుంటాయి.

---

''విద్య కామధేనువువలె కాలము కాని కాలమందును ఫలమొసగును; పరిచయం లేని పరదేశమునందును తల్లివలె పోషించును; విల్వచేసిన ధనమువలె సమయమందు లేక కష్టకాలమందు సహాయమొనర్చును.''

—చాణక్యుడు

''శీలరహితమైన విద్య ప్రమాదకరం. చాలా మంది తెలివి గల దొంగల విషయంలోనూ, పెద్ద మనుష్యులుగా చెలామణీ అయ్యే మూర్ఖుల విషయంలోను ఇది వెల్లడవుతుంది.''

—శ్రీ మహాత్మాగాంధీ

''ఆధ్యాత్మిక రంగంలో విద్య ఒకటే చాలదు. తపస్సు కూడా కావాలి. ఈ నాడు ప్రాపంచిక విషయాలైన తిండి, గుడ్డ, పదవి, ధనం కోసం ఉపయోగ పడుతున్న విద్య-నిజంగా అజ్ఞానమే అవుతుంది. ఆధ్యాత్మిక విద్య అట్లుకాదు. ఇహంలో పరంలో కూడా ఆనందాన్నిస్తుంది.''

—శ్రీ సత్యసాయిబాబా

''విద్య వేరు, వివేకం వేరు, మంచికీ చెడ్డకూ వ్యత్యాసం తెలిసిన విద్యాంసు ఎవడూ తప్పుడు పనులకు దిగడు. మనస్సులో నిలకడగా నెలకొనని జ్ఞానం వృథా. అది వట్టి పాండిత్యంగా మాత్రమే నిలుస్తుంది. దానివల్ల ప్రయోజనం ఉండదు.''

—శ్రీ రాజాజీ భారతం నుండి

# జ్ఞానము

### విద్య అంటే ఏమిటి ?

ప్రథమ భాగములో విద్య యొక్క ఔన్నత్యమును గురించి, ఆవశ్యకతను గురించి, ప్రాముఖ్యమును గురించి, గొప్పతనమును గురించి వివరించబడింది. దీనిలో అసలు విద్య అంటే ఏమిటి ? ఎటువంటి విద్యను అభ్యసించాలి ? దాని స్వరూప స్వభావములు ఏ విధంగా వుంటాయి ? అసలు విద్యా ప్రమాణములు ఏ విధముగా వుండాలి ? ఎటువంటి విద్య మానవాభ్యున్నతికి తోడ్పడుతుంది ? అసలు జ్ఞానం ఎటువంటి విద్య నభ్యసించడం వల్ల కల్గుతుంది ? ప్రస్తుత విద్యా విధానం వల్ల ఏమైనా ప్రయోజనం వున్నదా ? అనే విషయాలు పరిశీలిద్దాం.

నేడు మన సమాజంలో విద్య నభ్యసించడం ఉద్యోగం కోసమని ధన సంపాదనకే ననే అభిప్రాయం చాలా మందిలో వున్నది. ఇది నిజంగా దురదృష్టకరం. ఈ భావమును పనిగట్టుకొని మన ప్రజలలో ఆంగ్లేయులు కలుగజేశారు. 'మెకాలే' మన దేశంలో ఆదిలో ఇంగ్లీషును ప్రవేశపెట్టిందికూడా మనల్ని "గుమాస్తాలు" గా తయారు చేయడానికే. ఇదే రకమైన అభిప్రాయాలను, భారత దేశంలో ఆంగ్ల విద్యను ప్రవేశపెడుతూ " మెకాలే " చెప్పాడు. "ఇంగ్లీషు విద్య భారతీయుణ్ణి ఇంగ్లీషువాణ్ణిగా

మార్చివేస్తుంది. రంగులో రక్తంలో ఊహలో ఈ విద్య భారతీయుణ్ణి ఇంగ్లీషువాణ్ణి చేస్తుంది" అని 'మెకాలె' ఆనాడు చెప్పిన మాటలను మనం గుర్తు చేసుకుంటే వాస్తవం బోధపడుతుంది. అదే సందర్భంలో అనగా ది 12-10-1836 న ఇండియానుండి తన తల్లికి "మెకాలె" ఈ విధంగా ఉత్తరం కూడా వ్రాసాడు: " It is my firm belief that if our plan of Education is followed up, there would not be a single idolator in Bengal 30 years hence. " నేను ప్రవేశపెట్టిన ఈ విద్యా విధానం కొనసాగుతే, 30 సంవత్సరాలయ్యేసరికి బెంగాల్‌లో విగ్రహారాధకులు ఒక్కరూ వుండరని నా ధృఢసంకల్పం" అని 'మెకాలె" ఆ ఉత్తరంలో తన అభిప్రాయాలను వెలిబుచ్చాడు. అంతేకాదు "భారతీయులలో ఈవిద్య ఎంతో మార్పు కలిగిస్తుంది. ఇంగ్లీషు చదివిన భారతీయుడెవ్వడూ తన మతం మీాద నమ్మకం పెట్టుకోడు. కొందరు అటూ, ఇటూ పనికిరాని వాళ్ళు తయారవుతారు. కొందరు భ్రష్టులవుతారు. మరికొందరు బహిరంగంగా క్రైస్తవ మతం పుచ్చుకుంటారు," అనే అభిప్రాయాన్ని కూడా ఆనాడే 'మెకాలే' వెలిబుచ్చడం జరిగింది. భారతీయుల భావాలను మార్చడానికి ఇంగ్లీషువారు ఒక పథకం ప్రకారం గట్టి ప్రయత్నం చేసారనే విషయం మనకు స్పష్టమవుతున్నది. ఆంగ్లేయులు తమ విద్యా విధానం ద్వారా, మన ప్రాచీన భారతీయ సంస్కృతిని, విజ్ఞానాన్ని, ఉజ్జ్వల చరిత్రను తారుమారు చేశారు. భారతీయులు అనాగరికులని ఆటవికులని పాఠ్య పుస్తకాలలో వ్రాసి మన చేతనే చది

వించారు. భారతీయులు వట్టి చేతకాని దద్దమ్మలని, అనాగరికులని ప్రచారంచేశారు. కొంతమంది స్వార్థపరులైన భారతీయులు తమ స్వలాభం కోసం, స్వప్రయోజన పరులై బ్రిటిషువారి అండన చేరి ఈ దుష్ప్రచారానికి చేయూతనిచ్చారు. అవాస్తవికమైన చరిత్రను సృష్టించి పాఠ్య పుస్తకాలలో ఇరికించారు. అమాయకమైన పసిహృదయములలో విష బీజాలు నాటారు. నిర్మలమైన మనస్సులు కలుషితం చేశారు. భరించరాని భావ దాస్యం మనలో జనించింది. బ్రిటిషువారు బోధించేదే వేదం, చెప్పిందే సత్యం, వ్రాసిందే వాస్తవం అనే అభిప్రాయం మన విద్యావంతులలో నాటుకొనిపోయింది. చాలమంది విద్యావంతులు సంపాదన వ్యామోహంలో పడి 'సేవకావృత్తి' స్వీకరించారు. ఆత్మవంచన చేసుకొని బ్రిటిషువారికి భృత్యులయినారు. ఏజంట్లుగా, తాబేదారులుగా వ్యవహరించారు. స్వాతంత్ర్యం కోసం సర్వస్వాన్ని సమర్పించి, నిస్వార్థ బుద్ధితో, ధైర్యంగా పోరాటం సల్పుతున్న దేశభక్తులనుసహితం అనేకయిబ్బందులకు గురిచేసారు. ఈభృత్యులు బ్రిటిషువారి అండన చేరి వారి మెప్పును పొందటంకోసం, వేలాదిమంది భారతీయ వీరులను పట్టించి కారాగారములకు పంపించారు. ఉరికంబాలకెక్కించారు. ఈభావదాస్యం ముఖ్యంగా మనవారిలోజనించడానికి కారణం బ్రిటిషువారు అనుసరించిన, ప్రవేశపెట్టిన విద్యావిధానం, వారు వ్రాసి ముద్రించి ప్రచారం చేసిన పుస్తకాల ఫలితమే అనడంలో ఏమాత్రం అతిశయోక్తి లేదు.

స్వాతంత్ర్యం వచ్చి 30 సంవత్సరములు దాటినప్పటికీ, ఈ దాస్య భావాలిప్పటికీ మన మనస్సుల నుండి వైదొలగక పోవడం మిక్కిలి విచారకరం. ఇస్త్రీ బట్టలు నలగకుండా, సున్నితమైన, నాజూకైన ఉద్యోగాలు చేస్తూ, ధనం సంపాదించి, సుఖవంతమైన విలాసవంతమైన జీవితాలు గడపాలనే అభిప్రాయం యిప్పటికీ మన విద్యావంతులలో పాతుకొని పోవడం కడు శోచనీయం. ఒకరి క్రింద పని చేయకుండా స్వేచ్ఛగా, స్వశక్తిమీద, కష్టించి, చెమటోడ్చి సంపాదించాలనే తలంపు యింకా యిప్పటికీ, మన విద్యావంతులలో అవసరమైనంతగా కలుగక పోవడం మిక్కిలి దురదృష్టకరం. ఎక్కువ ఆదాయం లభించేటటు వంటి అనేక విధాలైన స్వేచ్ఛా వృత్తులున్నప్పటికి, దినమంతా కష్టించి పని చేయవలసి వస్తుందనే భయంతో నేటి విద్యావంతులు చాల మంది వాటి జోలికి పోవడం లేదు. తక్కువ జీతాలు లభించే ఉద్యోగాల వైపుకే పరిగిడుతున్నారు. కారణం? స్వేచ్ఛా వృత్తులలో బాధ్యతలు ఎక్కువ, పని కష్టం. ధైర్యం చేసి సాహసంతో నిర్ణయాలు గైకొనవలసి వుంటుంది. కాని ఉద్యోగములలో బాధ్యతలు తక్కువ, పని తేలిక ఈ ఆలోచనా సరళి మారాలి. మన యువకులలో సమగ్రమైన మార్పురావాలి. విద్య యొక్క పరమావధి ఉద్యోగం చేయటమే కాదు. విజ్ఞానము సముపార్జించడం. జీవిత గమ్యం విజ్ఞానమును పొందడంతోనే సంతృప్తి చెందక, దానిని నిజ జీవితంలో అనుభవంలోనికి తెచ్చి సర్వ

మానవ కళ్యాణం కోసం వినియోగించాలి. అప్పుడే అభ్యసించిన విద్యవల్ల ప్రయోజనం కల్గుతుంది.

స్వాతంత్ర్యానంతరం కూడా ఈ భావం విద్యావంతులలో అవసరమైన స్థాయిలో కలుగక పోవడానికి కారణం ఒక్క విద్యావంతుల పొరపాటే కాదు. దీనికి కొంత బాధ్యత మనల్ని పాలించే ప్రభుత్వానిది కూడా. స్వాతంత్ర్యానంతరం కూడా బ్రిటిషువారు అమసరించిన, ప్రవేశపెట్టిన విద్యా విధానమునకు స్వస్తి చెప్పలేక పోవడం, దానిలో అవసరమైన, సమగ్రమైన మార్పులను తీసుకొని రాకపోవడం, విద్యా రంగంలో విప్లవాత్మకమైన సంస్కరణలను ప్రవేశపెట్టకపోవడం, శాస్త్రీయ పద్ధతులలో విద్యా బోధన జరుగకపోవడం, సాంకేతిక పరిజ్ఞానమును అవసరమైన స్థాయిలో పెంపొందించక పోవడం, ఉన్నది కూడా అందుబాటులో లేకపోవడం, వృత్తి విద్యలకు అవసరమైన ప్రాధాన్యం పాఠశాలలలో యిప్పటికీ యివ్వకపోవడం, జీవితంలో తమ కాళ్ళమీద తాము నిలబడే శక్తి నిచ్చేటటువంటి వాస్తవికమైన విద్యను గరపకపోవడం, సామాన్య మానవునికి సహితం అందుబాటులో ఉండేట్లుగా విద్యా విధానానికి సమగ్రమైన రూపకల్పన చేయకపోవడం, శక్తిని, స్ఫూర్తిని, ధైర్యాన్ని, బలాన్ని యిచ్చేటటువంటి త్యాగమయమైన, దేశభక్తి పరిపూరితమైన అనాది భారత దేశ చరిత్రను తిరిగి సమగ్రంగా వ్రాసి బాల బాలికల కిప్పటికీ బోధించే ప్రయత్నం చేయకపోవడం, నైతికమైన విలువలను

పెంపొందించడానికి అవసరమైన నీతి తరగతులను (Moral Classes) యిప్పటికీ అవసరమైన స్థాయిలో నిర్వహించక పోవడం, వివేక విజ్ఞానాదులను కలుగ జేసేటటువంటి ఆధ్యాత్మిక విద్యకు తగిన ప్రోత్సాహం ప్రభుత్వం కల్పించక పోవడం, శారీరక మానసిక శక్తి నినుమడింపజేసేటటువంటి యోగవిద్యకు అవసరమైన ప్రచారం, ప్రాధాన్యం ప్రభుత్వం కలుగజేయక పోవడం వల్లనే విద్యావంతుల ఆలోచనా సరళిలో రావలసినంత మార్పు, అవసరమైన మానసిక పరిణామం రాలేదు.

ఈ దేశంలో 'విద్య' యిప్పటికీ యాంత్రికంగా బోధించబడుతున్నది. అందులో ఏమాత్రం చైతన్యం గాని, నైపుణ్యం గాని లేవు. ఈ ప్రస్తుత విద్యా విధానం తెలివి తేటలను పెంపొందించడానికి గాని, వివేక విజ్ఞానాదులను కలుగ జేయడానికి గాని ఏ మాత్రం ఉపయోగపడటం లేదు. ఉద్యోగం మీద ఆధారపడకుండా, స్వశక్తి మీద జీవించడానికవసరమైన, అనుభవ పూర్వకమైన శాస్త్రీయ సాంకేతిక పరిజ్ఞానమును ఏమాత్రం యివ్వడం లేదు. ఒకవేళ ఎవరైనా స్వప్రేరణతో, ధైర్యంగా ముందుకు వస్తే అటువంటివారికి తగిన ఉత్సాహం, ప్రోత్సాహం, సహాయం లభించడం లేదు. అందువల్ల ప్రతి విద్యావంతుడు గత్యంతరంలేక "ఎమ్ప్లాయిమెంట్ ఎక్స్చేంజి" లో తన పేరును నమోదుచేసుకొని ప్రభుత్వ ప్రయివేటు కార్యాలయాల చుట్టూ, సంవత్సరాల తరబడి కాళ్ళకి బలపం కట్టుకొని తిరుగుతున్నాడు. కాని ప్రయోజనం శూన్యం. ఉద్యోగాలు

లక్ష్యం కావడం లేదు, చిట్టచివరికి చేసేది లేక విద్యా వంతులలో నిరాశ జనించి, నిస్పృహాతులోనై ఆత్మ హత్యలకు సహితం పాల్పడుతున్నారు. అవినీతి విచ్చలవిడిగా, విశృంఖలంగా విలయతాండవం చేస్తున్నది. బాలబాలికలలో నైతికమైన విలువలను పెంపొందించి, మానసిక శక్తి నినుమడింపజేయడానికవసరమైన, ఆదర్శవంతమైన విద్యా విధానమును రూపొందించాలి. విద్యా రంగంలో సమగ్రమైన సంపూర్ణమైన మార్పు, సంస్కరణలు (Total Revolution) తీసుకొనిరావాలి.

## ప్రముఖుల అభిప్రాయములు

విద్యా విధానంలో సమగ్రమైన మార్పు రావాలని ప్రభుత్వంలో నున్నవారు, మరియు పెద్దలు, అనుభవజ్ఞులు యిప్పుడిప్పుడే సూచిస్తున్నారు.

లోకనాయక్ జయప్రకాశ్ నారాయణగారు ఇలా సూచించారు : ''ముక్తిని సాధించేది విద్య'' అని ప్రాచీన కాలం నుంచి విద్యకు చెబుతున్న అసలైన అర్థం. కాని నేటి విద్య ముక్తి సాధకంగా లేదు సరిగదా మనలను ఇంద్రియ దాసులనుగా తయారుచేస్తోంది. పీడిత ప్రజానీకానికి సేవ చేయడానికి బదులు స్వార్థ ప్రవృత్తిని పెంపొందిస్తోంది. ఇందులో నుండే 'శోషణ' 'సంఘర్షణ' బయలుదేరుతున్నాయి. నేటి విద్యకు జీవితావసరాలకు ఏమీ సంబంధం

ఉండటంలేదు. సాంఘిక పరిస్థితులకు ఏమాత్రం అది అనుకూలం కాదు. కేవలం అది పుస్తకాల వరకే పరిమితమై ఉండిపోతోంది. ఆ కారణంగా చదువుకున్నవాడు ఉద్యోగాన్వేషకుడై ఎక్కే గుమ్మం దిగే గుమ్మంగా తయారయినాడు. కనుక ఉద్యోగానికి విద్యకు ఉన్న సంబంధాన్ని త్రెంచివేయాలి. పరిశ్రమల తోటి, నైతిక భావాలతోటి దానికి సంబంధాన్ని ఏర్పరచాలి. న్యాయాలయాలకు వలెనే విద్యమీద కూడ ప్రభుత్వపు అధికారాంకుశాన్ని తొలగించి దానిని స్వయం శాసితంగా చేయాలి. కనుక ప్రస్తుత విద్యా స్వరూపాన్ని, విధానాన్ని మార్చవలసి వున్నది. నేనాశిస్తున్న సంపూర్ణ విప్లవంలో ఒక భాగం విద్యారంగంలో విప్లవాత్మకమైన మార్పు." మాజీ కేంద్ర విద్యా శాఖా మంత్రి ప్రొఫెసర్ నూరుల్ హసన్ "సామాజికమైన మార్పుకు విద్య ఒక మార్గం" అనే అంశంపై హైద్రాబాద్ అడ్మినిస్ట్రేటివ్ స్టాఫ్ కాలేజి (నవంబరు 1976) లో మాట్లాడుతూ "దేశంలో కొంతమంది ఉన్నత వర్గాల వారికి మాత్రమే ఉపయోగపడుతున్న ఈ విద్యా విధానంలో మార్పులు తీసుకొనివచ్చి, ప్రస్తుత పరిస్థితుల కనుగుణంగా విద్యా వ్యవస్థను రూపొందించాలి" అని పేర్కొన్నారు. మన ఉప రాష్ట్రపతి గౌ. శ్రీ బి. డి. జెట్టి పూనాలో జరిగిన 'సెమినార్' (నవంబరు '76) లో మాట్లాడుతూ "ప్రస్తుత విద్యా వ్యవస్థలో సంపూర్ణమైన మార్పురావాలి" అని అన్నారు. ఈ మధ్య 'సేవాగ్రాం' లో జరిగిన అఖిల భారత బేసిక్ విద్యా మహా సభలో "సెకండరీ విద్య

గాంధేయ పద్ధతులలో బోధించబడాలి, అది ఉత్పాదన శక్తిని పెంపొందించేది గాను, సమాజ అవసరములకు ఉపయోగ పడేదిగాను వుండాలి'' అని తీర్మానించారు. దేశం నలుమూలల నుండి విద్యావేత్తలు ఈసభలో పాల్గొన్నారు. ఈ మధ్య ''జాతీయ విద్యా పరిశోధనా శిక్షా మండలి'' ఢిల్లీ కేంద్ర పాలిత ప్రాంతంలోని విద్యార్థులలో సర్వే జరుపగా ఎక్కువమంది విద్యార్థులు ''విద్యతో పాటు హైయర్ సెకండరీ స్థాయిలోనే వృత్తి విద్యకు సంబంధించిన కోర్సులను నడపాలి'' అని అభిప్రాయపడినట్లు వెల్లడైంది. ప్రస్తుత 'జనతా ప్రభుత్వం' ఈ సమస్యను తీవ్రంగా ఆలోచిస్తున్నట్లు కనపడుతున్నది. ''మనిషిని దోపిడి నుంచి కాపాడేది-విద్య'' అని ఒక చక్కటి ఆలోచనను దేశం ముందు వుంచారు ప్రధాన మంత్రి శ్రీ మొరార్జి. 1977 సం॥లో కేంద్ర విద్యా మంత్రి శ్రీ పి. సి. చందర్ పార్లమెంటులో ఒక ప్రకటన చేస్తూ ''తమ ప్రభుత్వం ప్రాథమిక విద్యను సార్వజనీనం చేయగలదని, వయోజన విద్యా వ్యాప్తికి అత్యధిక ప్రాధాన్య మివ్వగలదు'' అని స్పష్టం చేసారు. వయోజన విద్యా వ్యాప్తికై 1978-83 పంచవర్ష ప్రణాళికలో మున్నెన్నడూ కేటాయించనంత ఎక్కువ మొత్తం కేటాయించబడింది. దీనితోనే సంతృప్తి చెందరాదు. ఇంకా విప్లవాత్మకమైన మార్పులు గైకొనినప్పుడు సామాన్య ప్రజానీకానికి 'విద్య' అందుబాటులోనికి వస్తుంది. సర్వతో ముఖాభివృద్ధికి తోడ్పడుతుంది.

'స్టాక్ హోం విశ్వ విద్యాలయం' లో ప్రొఫెసర్ గా పని చేస్తున్న "ప్రొఫెసర్ గున్నర్ మిర్దాల్" (నోబుల్ బహుమతిని కూడా పొందారు) జనవరి 1972 లో ఢిల్లీకి వచ్చినప్పుడు 'హిందూస్థాన్ టైమ్సు" పత్రికా విలేఖరి కిచ్చిన ఇంటర్వ్యూలో భారతదేశ విద్యా విధానమును గురించి అడుగగా "భారత దేశపు విద్యలో అధిక భాగము అభివృద్ధికి వ్యతిరేకమైనది. నీవు నీ చేతులు మట్టి చేసుకో వద్దు అనే మనస్తత్వాన్ని అది పెంచుచున్నది" అని అన్నారు.

కనుక విద్యా విధానపు రూపు రేఖలు మారాలి. విద్యా రంగంలో విప్లవాత్మకమైన, మౌలికమైన మార్పులను తీసుకొనిరావాలి. విద్యా ప్రమాణములను అభివృద్ధి పరచాలి. బోధనా పద్ధతి మారాలి. మానవ జీవన వికాసానికి తోడ్పడే విధంగా విద్యా వ్యవస్థను పునర్ వ్యవస్థీకరించాలి. మరొకరిమీద నాధారపడకుండా తన కాళ్ళమీద తానే నిలబడేట్లుగా చేసేటటువంటి విద్యను గరపాలి. 'వృత్తి విద్య' అన్ని విద్యలలో కెల్ల చాలా గౌరవప్రదమైన దనే అభిప్రాయం కలుగజేయాలి. మన దేశంలో సహజ సిద్ధంగా లభించే ప్రకృతి సంపద, ఖనిజ సంపదలను, మానవ కళ్యాణమునకు, దేశ ఆర్థిక పురోభివృద్ధికి ఉపయోగ పడేట్లుగా చేసుకొని దాని కవసరమైన విజ్ఞానమును బోధించే విద్యను నేర్పాలి. మానవునిలో అంతర్యాతమై వున్న అనంత శక్తిని వికసింపజేయటానికి కావలసిన శాస్త్రీయ

సాంకేతిక పరిజ్ఞానమును పెంపొందించే టటువంటి విద్యావ్యాప్తి జరపాలి. తరతరాల నుండి సాంప్రదాయకంగా అనుసరిస్తున్న పద్ధతులలో మూఢమైన వాటికి తిలోదకాలిచ్చి, మంచిని మాత్రమే గ్రహించి దానిని అధునాతనమైన పద్ధతుల ద్వారా, అధికోత్పత్తికి ఉపయోగ పడేందుకు అవసరమైన సాంకేతిక పరిజ్ఞానమును సామాన్య ప్రజలకు అందివ్వాలి. అప్పుడే మానవుని బుద్ధి వికసిస్తుంది. మానవ శక్తి సమాజ కళ్యాణానికి ఉపయోగపడుతుంది. మనం బూజు పట్టిన సిద్ధాంతాలకు స్వస్తి చెప్పగలుగుతాం. అప్పుడు 'గుమాస్తాగిరి' మన సత్వం అంతరిస్తుంది. నిరుద్యోగ పిశాచి కౌగిలి నుండి మన యువతీ యువకులు బయట పడగలుగుతారు. అవకాశం వున్న వారు, అనుభవాన్ని గడించిన వారు స్వశక్తి మీద పరిశ్రమలను స్థాపించుకో గలుగుతారు. మిగిలిన వారికి ఉద్యోగాలు సులువుగా దొరుకుతాయి. ఆస్తి వుండి, ఆర్థిక స్తోమత వున్నా కుటుంబాలలోని విద్యావంతులైన యువకులు ప్రభుత్వ ఉద్యోగాల కోసం అర్రులు చాచకుండా, స్వంత పరిశ్రమలు స్థాపించుకోవాలని ప్రభుత్వం ఆదేశించి నప్పటికీ ఫరవాలేదు. ఆ విధంగా ముందుకు వచ్చిన వారికి అవసరమైన ఆర్థిక సహాయం, పరపతి సౌకర్యాములు బ్యాంకుల ద్వారా వివిధములైన ప్రభుత్వ ధన సహాయక సంస్థలద్వారా సులువుగా లభించేట్లు చూడాలి. పరిశ్రమలకు అవసరమైన ముడిపదార్థం తేలికగా లభ్యమయ్యేట్లు చూడాలి. పరిశ్రమలలో తయారైన వస్తు

వులకు మంచి మార్కెట్ వుండేట్లు చూడాలి. ఆ విధంగా చేయడం వల్ల ప్రభుత్వోద్యోగాలకు ఒత్తిడి తగ్గుతుంది. ప్రభుత్వానికి కొంత భారం తగ్గుతుంది. స్థిరాస్తి, ఆర్థిక స్తోమత లేని విద్యావంతులకు త్వరగా ఉద్యోగాలు లభిస్తాయి. ఉత్పత్తి కూడా పెరుగుతుంది. దేశం సస్యశ్యామల మవుతుంది. విదేశాల మీద ఆధారపడవలసిన అగత్యం వుండదు. మన దేశ గౌరవ ప్రతిష్ఠ లినుమడించి, ప్రపంచంలో ఒక అగ్రరాజ్యంగా మన దేశం రూపొందుతుంది. స్వరాజ్యం సురాజ్య మవుతుంది. మహాత్మాజి కలలు సఫలీకృత మవుతాయి.

ప్రభుత్వ ఆలోచనా సరళితో పాటు, విద్య నభ్యసించే బాల బాలికల మనోభిప్రాయాలు, మనస్తత్వాలు, అభిరుచులు, ఆలోచనలలో కూడా మార్పురావాలి. విద్యార్జన ఉద్యోగం కోసం మాత్రమే కాదు, విజ్ఞాన సముపార్జనకు కూడా అనే భావం కలగాలి. ఉద్యోగముల మీద ఆధారపడకుండా స్వశక్తి మీద ధనము సంపాదించాలనే అభిప్రాయం కలగాలి. వ్యవసాయ, పారిశ్రామిక, వైజ్ఞానిక రంగాలలో అత్యున్నతమైన అభివృద్ధిని సాధించేందుకు ప్రతి విద్యావంతుడు తన శక్తిని, యుక్తిని, సమర్థతను, విజ్ఞానమును సంపూర్ణంగా వినియోగించాలి.

“ప్రతి చేతికి పని కల్పించాలి, ప్రతి చేను (పొలం) కు నీటి నివ్వాలి, ప్రతి గ్రామానికి విద్యుచ్ఛక్తి అందాలి, ప్రతి గృహం ఒక పరిశ్రమ కావాలి” ఈ మహోన్నత

ఆశయ సాధనకోసం ఒక్క ప్రభుత్వమే కాదు, ప్రతి ఒక్క విద్యావంతుడు తన విజ్ఞానము నుపయోగించి అవిరామంగా కృషి చేయాలి, సాధించాలి. అప్పుడే దేశం సస్యశ్యామల మవుతుంది. స్వాతంత్ర్యం కోసం సర్వస్వాన్ని అర్పించి, అసువులు బాసిన అమర వీరుల ఆత్మలు అప్పుడే సంతృప్తి జెందుతాయి.

## జ్ఞానము

విద్య జ్ఞానాభివృద్ధికే గాని ఉద్యోగం చేయడానికి కాదని లోగడ వివరించడమైనది. అయితే "అసలు జ్ఞానం అంటే ఏమిటి? దాని స్వరూప స్వభావములు ఏ విధంగా వుంటాయి? అట్టి జ్ఞానమును సంపాదించటం ఎట్లా ?" అను విషయములను కొంత వివరిస్తాను. జ్ఞాన మనగా ప్రకాశం, క్రాంతి, వెలుగు అని అర్థం చెప్పుకుంటే సరి పోతుంది. ఇట్టి జ్ఞానమే మానవునికి నిజమైన శక్తి. ఒక్కొక్క వస్తువుయొక్క పూర్వాపరములను తెలుసుకోవటమే జ్ఞానం. వ్యక్తి సంబంధమును గుర్తించుటయే జానము. మన మనస్సులలో నున్న పాత అనుభవాలతో క్రొత్త అనుభవాలను జోడించి సరిక్రొత్త నూతన విషయాలను కనుగొనుటయే జ్ఞానం. అసలు మనిషిలో ప్రకాశం, క్రాంతి, వెలుగు ఎలా వస్తుంది ? వేద వేదాంగములు, ఉపనిషత్తులు, ఆధ్యాత్మిక శాస్త్రములు, స్మృతులు, పురాణములు, ఇతిహాసములు, నీతిని బోధించే ఉద్గ్రంధములు, మహానుభావుల చరిత్రలు,

భౌతిక విజ్ఞాన సాంకేతిక శాస్త్రములు, మానసిక శాస్త్రములు మొదలగు ఎన్నో ముఖ్యమైన గ్రంథములను వినుట వలన, పఠించుట వలన ఈ 'జ్ఞానం' మనిషిలో కలుగుతుంది. వివేకంతో, విచక్షణా యుతంగా ఆలోచించే శక్తి కొంత వరకు ఉద్భవిస్తుంది. అట్టి జ్ఞానమే నిజమైన, వాస్తవికమైన విద్య. శాస్త్రములు చదువగా వచ్చిన జ్ఞానమును "శాస్త్ర జన్య జ్ఞానము" అందురు. ఇది పరోక్షపు జ్ఞానము మాత్రమే. విస్తృతంగా దేశాటన గావించడం వల్ల లభించు జ్ఞానం 'అనుభవ జ్ఞానము' అందురు. దీనినే ప్రత్యక్ష జ్ఞానమంటారు. ఈవిషయాలు మూడవ అధ్యాయంలో చర్చించబడుతాయి.

"జ్ఞానేనహీనాః పశుభిస్సమానాః" జ్ఞాన హీనులైన వారు పశువులతో సమానము. జ్ఞాన, విజ్ఞానములతో సమానమైనది ఈ ప్రపంచంలో మరొకటి లేదు. మొట్ట మొదట జ్ఞానం యొక్క ఆవశ్యకతను, స్వరూప స్వభావాలను వివరిస్తాను. దీని ఆవశ్యకతను గురించి భగవద్గీతలో "నహిజ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే" అనగా 'ఈ ప్రపంచమున జ్ఞానముతో సమానముగా పవిత్రమైనది లేనే లేదుగదా!' అని అర్థం. ఈ ప్రపంచంలో పవిత్రమైన వస్తువులెన్నో వున్నాయి. అతి ప్రియమైనవి కూడా వున్నాయి. అయినప్పటికి వాటన్నికన్నా పవిత్రమయినది, ప్రియమయినది, మానవునికి వెలుగు ప్రసాదించునది ఒక్క 'జ్ఞానము' మాత్రమే కనుక అట్టి పరమోత్కృష్టమయిన

'జ్ఞానము' ను జీవిత కాలంలో ఈ గడ్డమీద పుట్టిన ప్రతి వ్యక్తి సంపాదించి తీరాలి. జ్ఞానమే జీవులకు చరమ లక్ష్యం. అసలు ఈ జ్ఞానము అనే తేజస్సును ఎవరు పొందగలుగుతారు ? గీతలో దీనికి చక్కటి సమాధానం వున్నది. "శ్రద్ధావాన్ లభతే జ్ఞానం" శ్రద్ధ గలవాడు మాత్రమే జ్ఞానమును పొందగలుగుతాడు. ఏ కార్యమును సాధించవలెననినప్పటికి "శ్రద్ధ" మిక్కిలి అవసరం. ఏ విద్యార్థి అయినా సరే పరీక్షలలో మంచి మార్కులతో ఉత్తీర్ణుడవ్వాలంటే 'శ్రద్ధ' ముఖ్యం. 'శ్రద్ధ' ఉన్నప్పుడే మంచి ఫలితాలను సాధించ గలుగుతారు. ఈ శ్రద్ధతో పాటు 'ఏకాగ్రత' (Concentration) కూడా తప్పనిసరిగా వుండాలి. తన శక్తియుక్తుల నన్నింటిని ఒకచోట కేంద్రీకరించి శ్రద్ధతో, పట్టుదలతో పని చేసినప్పుడే విజయం లభిస్తుంది. ఒక చెంప పాఠముల చదువుచూ, మరొక ప్రక్క అమ్మ చేసిన పిండివంటల మీదకుగాని, బడిలోని ఆటల మీదకు గాని మనస్సు పోనివ్వరాదు. ఏ పని చేస్తున్నప్పుడు ఆ పని మీదనే తన యావత్ దృష్టిని కేంద్రీకరించి శ్రద్ధతో, పట్టుదలతో కృషి సల్పిన యెడల సత్ఫలితాలు చేకూరుతాయి.

"జ్ఞాత్వా శాస్త్ర విధానోక్తం" శాస్త్రమునందు చెప్పబడిన పద్ధతిని తెలుసుకొనుము అని అర్థం. ఏ పని అయినా సరే చేయవలసి వచ్చినప్పుడు, అది చేయదగినదో లేక చేయకూడనిదో తెలుసు కొనవలెననిన, అప్పుడు శాస్త్రములను ప్రమాణముగా తీసుకొనవలెను. శాస్త్రము

లను అధ్యయనం చేయడం వల్ల ఏది మంచో, ఏది చెడో నిర్ణయించుకొనే శక్తి కలుగుతుంది. కనుక మానవ పురోభివృద్ధికి శాస్త్రములు ఏ విధంగా, ఎంత వరకు ఉపక రిస్తాయో పరిశీలిద్దాం. ఎటువంటి జ్ఞానమును ప్రబోధిస్తు న్నాయో కొంచెం ఆలోచిద్దాం. శాస్త్ర జన్య జ్ఞానం వల్ల ప్రతి వ్యక్తి మనస్సు వికసించి అభివృద్ధి చెందుతుందని పెద్దలు అనుభవజ్ఞులు అనాది నుంచి చెబుతున్నారు.

"మాతృదేవో భవ, పితృదేవోభవ, ఆచార్యదేవో భవ, అతిథిదేవో భవ" అని శాస్త్రములు ఘోషిస్తున్నాయి. తల్లి దండ్రులను దైవ సమానులుగా పూజించాలి. భారతీయ సంస్కృతి యందు గురువునకు అత్యున్నతమైన స్థానమివ్వ బడింది. భారత దేశంలో అతిథులను దైవ సమానముగా భావించి గౌరవించి ఆతిథ్య మివ్వడం యిక్కడి సాంప్ర దాయం. తల్లి శరీరాన్నిస్తుంది. తండ్రి రక్షణ యిస్తాడు. గురువు బుద్ధి వికాసానికి తోడ్పడుతాడు. అతిథులు సంఘంలో నీకు సరియైన స్థానాన్ని కలిపిస్తారు. కాబట్టి వీరందరూ దైవసమానులు, పూజ్యులు.

## మా తృ భ క్తి

ఎంతో శ్రమపడి నవమాసములు మోసి, కని ఎంతో ఓర్పుతో లాలించి, ప్రేమతో పెంచి, మంచి బుద్ధులు నేర్పి ఎంత అల్లరి చేసినా సహనంతో విసుగుకొనక, చీటికిమాటికి కొట్టకుండా మంచి మాటలను చెప్పి, ఓర్మితో బుజ్జగించి,

చెడు మార్గమున పోనివ్వకుండా, ఓపికతో మంచి మార్గమున నడిపించుతూ పెద్దవారినిగా చేసిన తల్లిని ప్రతివారు ప్రేమించి, గౌరవించి, పూజించి పోషించాలి. అటువంటి సహనశీలి అయిన తల్లికి పిల్లలు కావడం, ఆ పిల్లల పూర్వ జన్మ సుకృతమే అవుతుంది. అందువల్లనే అనాదినుంచి మన దేశంలో మాతృ దేవతకు మకుటాయమానమైన స్థానం యివ్వబడింది. తల్లికి మించిన దైవము లేదని శాస్త్రములు కూడా ఘోషిస్తున్నాయి. మన దేశంలో 'స్త్రీ' ని తల్లిగా మాతృ స్వరూపిణిగా భావిస్తారు. ఇతర దేశములలో 'స్త్రీ' ని ఒక భోగ్య వస్తువుగా పరిగణిస్తారు. మన దేశంలో 'స్త్రీ' కి ఎటువంటి గౌరవ మర్యాదలను అనాదిగా మన వారు యిచ్చారో దీనిని బట్టి మనం బాగా అర్థం చేసుకొనవచ్చు. లవకుశులు, అభిమన్యుడు, శివాజి, బాలచంద్రుడు, గాంధీ లాంటివారు వీరాధి వీరులుగా తయారవడానికి ముఖ్య కారణం వారి మాతృమూర్తులనే విషయం విస్మరించరాదు. అదే విధముగా ప్రతి బాలుని యొక్క, బాలిక యొక్క పురోభివృద్ధి, భవిష్యత్తు ఆయా మాతృమూర్తుల చేతుల లోనే ఉన్నది. కనుక పిల్లల యోగక్షేమములను, ఆయురారోగ్యములను, అభివృద్ధిని మనసా, వాచా కోరుకుంటున్న మాతృమూర్తులను పూజించడం బాల, బాలికల కర్తవ్యం, విద్యుక్త ధర్మం.

## చిన్న కథ

పండరీపుర పుణ్యక్షేత్రమందు 'పుండరీకుడనే' ఒక బ్రాహ్మణుడుండేవాడు. అతడు ప్రతి దినము తెల్లవారు జాముననే లేచి ముసలి తల్లి దండ్రులను చంద్రభాగా నదిలో స్నానము చేయించి, వారికి భక్తితో పాదపూజ చేసి వారిని సంతృప్తులను చేసిన తరువాతనే తన నిత్య కార్యక్రమము లలో నిమగ్నుడయ్యేవాడు. ఒకనాడు శ్రీకృష్ణుడు పుండరీకునికి తన తల్లిదండ్రులయందు గల భక్తిశ్రద్ధలను పరీక్షించ దలచి, అతని కుటీరము దగ్గరకు వచ్చి, వాకిట వద్దనే నిలచి పుండరీకుని పిలుస్తాడు. తల్లిదండ్రుల సేవలో నిమగ్నుడై యున్న పుండరీకుడు తల యెత్తి చూడకుండానే 'మీరు ఎవరు' అని అడుగుతాడు. అప్పుడు "నేను పాండురంగడను నీ మీద ప్రేమతో నిన్ను అనుగ్రహించుటకు వచ్చాను. నా దర్శనము అందరికి సామాన్యంగా దొరకదు. నీకొఱకు వేచి యున్నాను" అని శ్రీకృష్ణుడు బదులుచెబుతాడు. అప్పుడు పుండరీకుడు "ఈ దీనునికోసం యింతసేపు బురదలో నుంచు న్నావు. పాపం! ఇదిగో ఈ ఇటుక మీద కొంచెంసేపు నిలుచో. నా తల్లి దండ్రులను సేవించి వస్తాను" అని ఇటుకను స్వామి యెదుటకు విసిరివేస్తాడు. పాండురంగడు చేసేది ఏమీ లేక భక్తుని రాకకోసం ఆ ఇటుక మీద నుంచొని వేచివుంటాడు. పుండరీకుడు తల్లిదండ్రుల సేవను పూర్తి చేసుకొని, వారి అనుజ్ఞను తీసుకొని, పండరీనాథుని దర్శించి,

ఆయన అనుగ్రహానికి పాత్రుడవుతాడు. ఈ కథను బట్టి మనం నేర్చుకొనవలసిన నీతి ఒకటున్నది. "సాక్షాత్ భగవంతుడు కూడా, తల్లిదండ్రుల సేవలో నిమగ్నులై యున్న వారిని ఆదరించుతాడు" అని స్పష్టమవుతున్నది.

## పితృభక్తి

జన్మ యిచ్చిన తండ్రిని కూడా గౌరవించి పూజించాలి. శ్రమించి, కష్టించి సంపాదించిన డబ్బుతో తాను మాత్రమే అనుభవించక, పిల్లల చదువుకు, అభివృద్ధికి అనుక్షణం తాపత్రయపడే తండ్రిని కూడా మనసారా ప్రేమించాలి, గౌరవించాలి. వార్ధక్యంలో సకల సపర్యలు చేయాలి. పితృవాక్య పరిపాలనకు మంచి ఆదర్శం శ్రీరామచంద్రుడు. తన తండ్రి ఆజ్ఞానుసారము సకల భోగభాగ్యాలను, రాజ్యమును తృణప్రాయంగా భావించి పదునాలుగు వత్సరములు అరణ్య వాసమును చేసిన ఆదర్శ పురుషుడు 'శ్రీరామచంద్రుడు.' మణిమయ సౌధాలలో, వంది మాగధుల కైవారాలతో, మంగళ వాద్యాలతో పరిచారికాగణం పసిడి వీవనలు వీస్తుంటే, మధుర నాదాల వీణాస్వరాలతో, మృదు మధురమైన గానాలను ఆస్వాదిస్తూ, సకల రాజ భోగాలను అనుభవించవలసిన 'శ్రీరామచంద్రుడు' పితృవాక్య పరిపాలనకు తలవంచి, కాకులు దూరని కారడివిలో, అతి క్రూర మృగాలు భయంకర నాదాలు చేస్తూ విచ్చల విడిగా సంచరిస్తున్న కీకారణ్యాలలో మరియు పరమ కిరాతకులైన

రక్కసి మూకల మధ్య పదునాలుగు సంవత్సరాలు కఠోర మైన జీవితాన్ని గడిపి చక్కటి ఆదర్శం లోకాని కందించిన పితృవాక్య పరిపాలకుడు శ్రీరామచంద్రుడు. ఆ మహనీ యుని అడుగు జాడలలో నడవడం ప్రతివాని కర్తవ్యం.

## చిన్న కథ

'శ్రవణ కుమారుడు' అనే బాలుడు, కోసల రాజ్య మును 'దశరథ మహారాజు' పరిపాలిస్తున్న రోజులలో వుండే వాడు. అతనికి ముసలివారు, గ్రుడ్డివారైన తల్లి, తండ్రి వుండేవారు. వారిని అమిత ప్రేమాదరాభి మానములతో, భక్తి శ్రద్ధలతో శ్రావణుడు పూజిస్తుండేవాడు. ఒకసారి అతని తల్లి దండ్రులకు తీర్థయాత్రలను చేయాలనే కోరిక కలిగింది. కాని ఏమి చేయాలో తోచక నిస్సహాయులై విచారములో వున్నారు. అది చూచిన శ్రావణుడు తన తల్లి దండ్రులను తీర్థ యాత్రలకు తీసుకొనిపో సంకల్పించాడు. కావడి కొని తీసుకొనివచ్చి తల్లిని ఒకవైపు, తండ్రిని ఒక వైపు కూర్చొనబెట్టి, కావడి భుజమున పెట్టుకొని బయలు దేరాడు. వారికి ఏ మాత్రం కష్టం కలిగించకుండా, సకా లంలో ఆహార పానీయాలనందిస్తూ, పవిత్ర ప్రదేశాలను, వాటి ప్రాముఖ్యములను వివరిస్తూ దేశాటన గావిస్తున్నాడు. ప్రజలందరూ ముక్త కంఠంతో తల్లిదండ్రుల యందు అతనికి గల భక్తి శ్రద్ధలను వేనోళ్ళ పొగడుతున్నారు. వారు ఒక

రోజు రాత్రి అడవిలో విశ్రమించవలసి వచ్చింది. తండ్రికి దాహం వేయగా శ్రావణుడు ఒక ముంత తీసుకొని ప్రక్కనే వున్న నదికి వెళ్ళాడు. ఆ నదిలో ఆ కడవను ముంచు తుండగా 'బుడ బుడ' మనే శబ్దం వస్తోంది. వేటకు వచ్చిన దశరథ మహారాజు ఆ శబ్దము విని ఏదో ఒక మృగము నీరు త్రాగటానికి వచ్చిందని భావించి బాణం వదలగా, రివ్వున వచ్చి శ్రావణుని గుండెల్లో గ్రుచ్చుకొంది. శ్రావణుడు కెవ్వున పెట్టిన కేకను విన్న దశరథుడు పరుగెత్తుకొని వచ్చి గుండె లలో గ్రుచ్చుకొన్న బాణం చూచి ఎంతో బాధపడుతాడు. చేసేది ఏమీ లేక నిస్సహాయ స్థితిలో అతి దీనంగా శ్రావ ణునిచూస్తూ దశరథుడు అక్కడనే నుంచుంటాడు. అప్పుడు ప్రాణం పోతున్న శ్రావణుడు "అయ్యా! ఆ అడవిలో ఒక చెట్టు క్రింద నా తల్లిదండ్రులు దాహంతో బాధ పడు తున్నారు. మీరు వెంటనే వెళ్ళి ఈనీరును వారికందించండి" అని చెప్పి తల్లి దండ్రులను స్మరించుకుంటూ కన్ను మూస్తాడు. ఈ విషయం దశరథుని ద్వారా విన్న తల్లి దండ్రులు పుత్ర శోకంతో విలపిస్తూ "ఏ విధంగా మేము ప్రాణాలను విడువ బోతున్నామో అదే విధంగా, భవిష్యత్తులో నీవు కూడా పుత్రక శోకంతో మరణిస్తావు" అని శపించి కన్నుమూస్తారు. "తల్లి దండ్రుల సేవయే పరమావధిగా భావించి, కర్తవ్య పరాయణత్వంలో కన్ను మూసిన శ్రవణ కుమారుని జీవితం" మనకు ఆదర్శప్రాయమై ఉండాలి.

## గురుభక్తి

ప్రతి విద్యార్థి గురువుల యెడల భక్తి శ్రద్ధలు కలిగి ఉండాలి. జ్ఞానార్జనకు గురుసేవ ముఖ్యం. శాస్త్రాలలో వున్న అమూల్యమైన జ్ఞాన సంపదను ఆస్వాదించాలంటే గురువు సహాయం ఎంతయినా అవసరం. జ్ఞాన భిక్షను ప్రసాదించే టటువంటి అనుభవజ్ఞుడైన 'గురువు' గారి అనుగ్రహము ను పొందటానికి ప్రతి విద్యార్థి ప్రయత్నించాలి. వినయ విధేయతలతో, నమ్రతతో, అణుకువతో, మెలుకువగా వారి మెప్పును పొంది జ్ఞానార్జన గావించాలి. వారు మంచి మార్గమును మాత్రం చూప గలుగుతారు. నడువ వలసినది ఎవరికి వారే ననే విషయం విస్మరించరాదు. తన భారాన్నంతా పూర్తిగా గురువు మీదనే వేయకూడదు. ఎవరి కాళ్ళమీద వారు నిలబడాలి. గురువుయొక్క అమూల్యమైన సలహాలను తీసుకుంటూ, సూచనల ననుసరిస్తూ, ఆదేశాలను పాటిస్తూ, ఆశయములను అవగాహన చేసుకుంటూ, భక్తి శ్రద్ధలతో పూజిస్తూ, స్వశక్తి మీద ముందుకు సాగిపోవడం నేర్చుకోవాలి. గురుభక్తికి చక్కటి ఆదర్శము ''ఏకలవ్యుడు.'' ద్రోణాచార్యుడు విలు విద్యను నేర్పడానికి నిరాకరించి నప్పటికి ఏ మాత్రం నిరాశ చెందక, నిస్పృహపడక, దీక్షతో, నిగ్రహంతో అతని విగ్రహమును ముందుంచుకొని, శ్రద్ధతో పట్టుదలతో తీవ్ర కృషి సలిపి, స్వ బుద్ధి నుపయోగించుకొని స్వశక్తి మీద సాటిలేని మేటి విలుకాడయ్యాడు ''ఏకలవ్యుడు.'' ద్రోణాచార్యుడు అతని విలువిద్యా నైపుణ్యా

మును చూచి ఆశ్చర్యపడి, మెచ్చుకొని పారితోషికంగా కుడి బొటన వ్రేలును కోరగా, ఏ మాత్రం సంకోచించకుండా, సందేహించకుండా, విలు విద్యకు అత్యావశ్యకమైన ఆ కుడి బొటన వ్రేలును నిర్దాక్షిణ్యంగా కోసి 'గురువు' కు భక్తి పూర్వకంగా సమర్పించి వేస్తాడు. ఏ విలువిద్య కోసం అహర్నిశలు, వత్సరాల తరబడి, ఏకాగ్ర చిత్తముతో ఎనలేని తీవ్రకృషి సలిపి సాధించాడో, మరుక్షణంలోనే, అట్టి విలు విద్యా నైపుణ్యమునకు ఆధారమైన ఆ బొటన వ్రేలును, ఎట్టి విచారమూ లేకుండా, ద్రోణాచార్యులవారు అడగడంతోనే భక్తి భావంతో, ఏమాత్రం ఆలోచన చేయకుండా తన వ్రేలును కోసి యిచ్చిన మహా త్యాగి "ఏకలవ్యుడు.' నిరంతర కృషి ఫలితంగా సాధించిన ఆ విలు విద్య ఆనాటితో పరిసమాప్తమవు తుందని తెలిసికూడా ఏమాత్రం బాధపడకుండా, సంకోచించకుండా అడగటంతోనే ధైర్యంగా తన బొటన వ్రేలును కోసి ద్రోణాచార్యుని పాదపద్మాలకు సమర్పించిన త్యాగశీలి, ధీశాలి, గురుభక్తి పరాయణుడు ''ఏకలవ్యుడు.'' గురుభక్తి పరాయణత్వానికి, త్యాగశీలతకు చక్కటి ఆదర్శం ''ఏకలవ్యుడు.'' ''ఆ మహానీయుని అడుగుజాడలలో ప్రతివారూ నడవాలి.''

## చిన్న కథ

పూర్వం గౌతమ మహర్షి వద్ద అనేక మంది శిష్యులుండేవారు. ఒకనాడు ఆ శిష్యులందర్నీ పిలచి ''ఈ

ప్రాంతంలో కరువు కాటకములు ఏర్పడి మన నాల్గువందల గోవులకు పచ్చికగాని, నీరుగాని లభ్యమవక అలమటిస్తు న్నాయి. వాటి దీనావస్థను నేను చూస్తూ, నా విధులను నిర్వర్తించలేను. మీలో ఎవరో ఒకరు వాటిని సుభిక్ష ప్రాంతానికి తోలుకొనివెళ్ళి, వాటి సంరక్షణ భారమును కొంతకాలము వహించవలెను'' అని గౌతముడు చెప్పాడు. శిష్యులు ఏమీ బదులు చెప్పక తలలు వంచి నిలుచున్నారు. కాని 'సత్యకాముడు' అను ఒక శిష్యుడు మాత్రం ముందుకు వచ్చి తానా బాధ్యతను స్వీకరించ గలనని చెబుతాడు. మిగతా శిష్యులందరూ అతనిని నిరుత్సాహ పరచినప్పటికీ ఏమాత్రం వెనుకాడలేదు. నాలుగు వందల ఆవులు, వెయ్యి ఆవులు అయిన తరువాతనే తిరిగిరావలసినదిగా శిష్యుని గురువు ఆదేశించి, ఆశీర్వదించి పంపుతాడు. సత్యకాముడు వాటిని దూర ప్రదేశములకు తోలుకొని పోయి గోసేవయే గురుసేవగా, గురుసేవయే భగవంతుని సేవగా భావించి వాటిని జాగ్రత్తగా సంరక్షిస్తుంటాడు, దినములను గాని గోవుల సంఖ్యను గాని గమనించకుండా, గోసేవలో భగ వన్నామ స్మరణలో నిమగ్నుడైపోతాడు. అతని కర్తవ్య పరాయణత్వానికి, గురుభక్తికి దేవేంద్రుడు సహితం ఆశ్చర్యపడి ప్రత్యక్షమై ఆవుల సంఖ్య వేయి అయినవని, గురువువద్దకు తోలుకొని వెళ్ళమని ఆదేశిస్తాడు. దేవేంద్రుడు కూడా అతని వెంట ప్రయాణంచేస్తూ నాలుగు వేదములను బోధించి, ఆశీర్వదించి అంతర్ధానమైపోతాడు. సత్యకాముడు అపరిమితమైన తేజస్సుతో, ఆనందంతో వేయి ఆవులను తన

గురువద్దకు తీసుకొని వెళ్ళి సమర్పించి వినయ విధేయతలతో పాదాభివందనం చేస్తాడు.

"భక్తి శ్రద్ధలతో గురువును సేవించినవారికి, గుర్వాజ్ఞలను తూచా తప్పకుండా శిరసావహించిన వారికి దైవ సహాయం తప్పని సరిగా లభించితీరును." అనే నీతిని ఈ కథ వల్ల మనం నేర్చుకొనవచ్చును,

## అ తి ధి భ క్తి

అతిథిని కూడా భక్తిభావంతో పూజించి గౌరవించి, ఆతిథ్యం యివ్వడం మన భారతీయ సాంప్రదాయం. పూర్వ కాలంలో ప్రతి ఇంట్లో యజమాని భోజనం చేసేటప్పుడు ప్రక్కనే ఒక అతిథి కూడా భోజనం చేసే సాంప్రదాయం వుండేది. ఇంకా ఎవరైనా ఆగంతుకులు భోజనానికి వస్తారేమోనని చూచి ప్రతి ఇంట్లో మధ్యాహ్నం 12 గంటలు తరువాతనే భోజనం చేసేవారు. ఈ సాంప్రదాయానికి రాను రాను తిలోదకాలివ్వబడ్డాయి. ఆర్థిక పరిస్థితులు తారుమారు కావడం వల్ల అనాదిగా వస్తున్న సత్సాంప్రదాయములను ఆచరించలేక పోతున్నారు. ఆర్థిక స్తోమత ఉన్నవారు నిర్లక్ష్యంతో వీటిని ఆచరించటంలేదు. మనకున్న సంపదలో కొంత భాగం దానం చేయాలి. మరికొంత జీవరాసులకు సమర్పించాలి. కొంత ప్రభుత్వానికి పన్నుల రూపంలో చెల్లించాలి – ఇది అనాదిగా వస్తున్న భారతీయ సాంప్ర

దాయం. సంపద ఎంత వున్నది? తన అవసరములకు అసలు సరిపోతుందా లేదా? అనే ప్రశ్నే వుదయించరాదు. ఉన్న దానిలోనే యివ్వడం భారతీయ సాంప్రదాయం.

## చిన్న కథ

ధర్మరాజు అశ్వమేధయాగము చేసి ఎంతో మందికి అన్నదానంతో పాటు ఎన్నో ధర్మములను చేసి యాగము నిర్విఘ్నముగా చక్కగా జరిగిన దనుకొంటుండగా ఒక 'ముంగిస' వారి ముందుకు వచ్చి పక పకా నవ్వింది. ఆ ముంగిస యొక్క ఒక ప్రక్క భాగము బంగారపు పూత పూసినట్లుగా ధగ ధగ లాడుతోంది. పాండవులు ఆ విచిత్రపు ముంగిసను సమీపించి ఎందులకు నవ్వితివి అని అడుగుతారు. దానికి సమాధానముగా ముంగిస "ఓ రాజా! నీవు చాలా గొప్పగా అన్నదానం చేశావని సంతృప్తి పడుతున్నావు. త్యాగశీలుడవని భావిస్తున్నావు. కాని ఒకప్పుడు ఒక పేద బ్రాహ్మణుడు చేసిన దానము, త్యాగమునకు పోల్చిచూస్తే నీ యాగము ఏపాటిది?" అని ఈ క్రింది కథ చెబుతుంది.

## సక్తుప్రస్థుని కథ

ఒకప్పుడు కురుక్షేత్రంలో సక్తుప్రస్థుడనే ఒక బీద బ్రాహ్మణ కుటుంబం వుండేది. తమకు గల కొద్దిపాటి

పొలంలో కష్టించి పండించుకున్న ఆహార ధాన్యములను తిని కొంత దానం చేస్తూ నీతి నిజాయితీలతో బ్రతుకుతుండేవారు. ఉన్నంతలో యితరులకు సహాయపడటం తమ విధ్యుక్త ధర్మంగా భావించేవారు. ఒక పర్యాయం కటిక క్షామం సంభవించింది. తినటానికి తిండి లేక ప్రజానీకం ఆకలితో కొట్టలను చేసుకొని ముందుంచుకొని తిన బోతూవుండగా ఒక వృద్ధ బ్రాహ్మణుడు నడవలేక నడవలేక వచ్చి గుమ్మం వద్ద నిలబడ్డాడు. వానిని చూచి ఆదరంతో ఆహ్వానించి తమతో భుజించుమని కోరుతాడు ఆ యజమాని. మొదట తన ముందున్న ఆహారము అతిధికి పెడుతాడు. దానిని భుజించిన అతిధి ఆకలి తీరలేదనగా, తన భార్య వంతు ఆహారమును పెడతాడు. అప్పటికీ ఆకలి తీరలేదని చెప్పగా తన కుమారుని భాగమును సమర్పించుకుంటాడు. కాని అప్పటికీ అతిధి ఆకలి తీరదు. చివరకు ఆ ఇంటి కోడలు తన వంతు ఆహారమును కూడా ఇచ్చివేస్తుంది. ఆ విధముగా ఆ నలుగురు తమకున్నదంతా అతిధికి పెడతారు. అతిధి సేవా తత్పరతకు, త్యాగబుద్ధికి ఆ బ్రాహ్మణుడు సంతసించి తాను ధర్మ దేవతనని పరీక్షించుటకు వచ్చితినని చెప్పి, ఆ కుటుంబమును స్వర్గమునకు తీసుకొని వెళ్ళుతాడు. "రాజా! ఆ సంఘటనంతా కళ్ళారా చూచాను. క్రిందరాలిన పిండిని కొంత చవి చూచాను. కొంత పిండి నా శరీరమునకు అంటుకొనగా, ఆ భాగమంతయూ సువర్ణమయ్యెను. దానం చేసిన పిండిలో అంత మాహాత్మ్యమున్నదని గుర్తించాను. అప్పటి నుండి దానంలో నున్న మహాత్తువు, త్యాగంలో

వున్న గొప్పతనమును గ్రహించాను" అని ముంగిస ఆ కథ చెప్పగా అందరూ ఆశ్చర్యపడి తలలు వంచుకున్నారు.

"సిరిసంపదలు గలవారు దానం చేయడంలో విశేషం లేదు. తనకున్న కొద్దిపాటి ఆహారమును సహితం అవసరమైతే తానుతినక యితరులకు పెట్టడంలోనే వున్నది విశేషం" ఇదే నీతిని పై కథ మనకు బోధిస్తున్నది.

## మాతృ దేశ భక్తి

తల్లి లాంటిదే జన్మించిన దేశం కూడాను. మనది భారత దేశం. ఇది మనకు మాతృభూమి, పుణ్యభూమి, తపోభూమి. కనిపెంచిన తల్లి మీద ఏ విధమైన మాతృభావన మన కుంటుందో, జన్మించిన ఈ దేశం మీద కూడా అదే విధమైన మాతృభావన వుంటుంది. అందువల్లనే ఈ పవిత్రమైన గడ్డను "మాతృ భూమి" (Mother Land) గా భావించి పూజించడం మన సాంప్రదాయం. ఇటువంటి మాతృభావన ప్రపంచంలో మరెచటా కనుపించదు. ఇతర దేశాలవారు వారి వారి దేశములను "పితృ భూమి" (Father Land) గా భావించుతారు. ఈ మాతృ భూమి సకల సంపదలను మనకిస్తున్నది. వాల్మీకి, వ్యాసుడు, వసిష్ఠుడు, అగస్త్యుడు లాంటి మహర్షులు యీ పవిత్ర భూమిలోనే జన్మించారు. శ్రీరాముడు, శ్రీకృష్ణుడు, ధర్మరాజు, సత్య హరిశ్చంద్రుడు మొదలైన మహానుభావులు ఈ గడ్డ

లోనే పుట్టారు. శిబిచక్రవర్తి, బలిచక్రవర్తి, దధీచిలాంటి త్యాగ పురుషులను కన్నది ఈ భరతమాతే. రామకృష్ణ పరమహంస, అరవిందుడు, రమణ మహర్షి లాంటి ప్రవక్త లకు జన్మ యిచ్చింది యీ భరతమాతే. వివేకానందుడు, రాజా రామమోహన్ రాయ్, కందుకూరి వీరేశలింగం పంతులు లాంటి ప్రవక్తలను ఈ మాతే కన్నది. శివాజీ, రాణాప్రతాప్, శ్రీకృష్ణదేవరాయలు, ఝాన్సీలక్ష్మీబాయి, రుద్రమదేవి లాంటి వీరాధి వీరులను, వీర వనితలను కన్నది ఈ మాతే. చాణక్యుడు, తిమ్మరుసులాంటి మహా మంత్రు లను కనినఘనత భరతమాత కేదక్కింది. కాళిదాసు, పోతన రవీంద్రనాధటాగూర్ లాంటి మహా కవులు కూడా ఈ పవిత్ర భూమిలోనే పుట్టారు. తిలక్, గోఖలే, గాంధీ, నేతాజి లాంటి మహా నాయకులను ఈ మాతే ప్రసా దించింది. పవిత్రమైన నదీ జలాలు ఎన్నో యిక్కడ ప్రవ హిస్తున్నాయి. మానవాళికి భుక్తి నిస్తున్నాయి. పుణ్య క్షేత్రములు కోకొల్లలు. శిల్పకళా ఖండములకు పుట్టినిల్లు. ఇక్కడి ప్రతి అణువు మనకు పవిత్రం, ఒకప్పుడు అమెరికా ఇంగ్లండు లాంటి సంపన్న దేశములను సందర్శించి, భారత దేశమునకు తిరిగి ప్రయాణ మవుతున్న వివేకానందునితో మీ మాతృభూమి పట్ల మీ అభిప్రాయమేమిటని కొంత మంది పత్రికా విలేకరులు ప్రశ్నించగా "భారత దేశాన్ని లోగడ ప్రేమించాను, కాని యిప్పుడు భారత భూమిలోని ప్రతి ధూళికణం నా కత్యంత పవిత్రము. అది నా కొక తీర్థస్థానము" అని సగర్వంగా శ్రీ వివేకానంద సమాధానం

చెప్పారు. కనుక ఇటువంటి పవిత్ర భూమిలో మనం జన్మించడం నిజంగా మన పూర్వ సుకృతమే, శ్రీరాముడికి సహితం మాతృభూమిపట్ల అపారమైన ప్రేమాదరాభిమానములు వుండేవని ఈ చిన్న సంఘటన వల్ల మనకవగతమవుతున్నది. శ్రీరాముడు లక్ష్మణునితో సహా వానర సేనను సమకూర్చుకొని వారిధిని కట్టి లంకాపురిపై దండెత్తి రావణుని సంహరించి, సీతను తీసుకొని వస్తాడు. సకలైశ్వర్యములతో తులతూగుతూ, స్వర్ణ మయమైన లంకాపురిని చూచి లక్ష్మణుడు మోహపడుతాడు, అక్కడే వుండి రాజ్యమును పాలిద్దామని, కడు బీదదైన భారతదేశానికి వెళ్ళవద్దని లక్ష్మణుడు శ్రీరామచంద్రుడ్ని అర్థిస్తాడు. అప్పుడు శ్రీరామచంద్రుడు ఈ విధంగా సమాధానం చెబుతాడు.

"అపి స్వర్ణ మయీ లంకా నమే లక్ష్మణ రోచతే
జననీ జన్మ భూమిశ్చ స్వర్గా దపి గరీయసీ"

అనగా "ఓ లక్ష్మణా! లంకాపురి బంగారు మయమైననూ నాకిష్టంలేదు. జన్మనిచ్చిన తల్లి, జన్మించిన దేశం స్వర్గం కంటే కూడా గొప్పవి" అని శ్రీరాముడు అంటాడు. మనం యిక్కడ నేర్చుకోవలసిన 'నీతి' ఒకటున్నది. జన్మ ఇచ్చిన తల్లి అతి కురూపి, అందవిహీనమైనది అయినప్పటికీ ఏ విధముగా ప్రేమిస్తామో, అదే విధముగా జన్మించిన దేశం కూడా బీదదైనప్పటికీ గౌరవించి, ప్రేమించడం మన విద్యు

క్త ధర్మం. మన 'మాతృభూమి' పట్ల భక్తి శ్రద్ధలు కలిగి ఉండటం ప్రతి భారతీయుని కర్తవ్యం.

## దైవభక్తి

దైవభక్తి ప్రతి వారికీ వుండాలి. భక్తియనే పుష్పం నుండి జ్ఞానము ఆవిర్భవిస్తున్నది. ఈ చరాచర సృష్టి సర్వస్వానికి కారణ భూతుడైన పరమాత్మ యందు అచంచలమైన, నిశ్చలమైన భక్తి శ్రద్ధలు కలిగి యుండవలెను. అట్టి అకలంక భక్తునికి ఒకవేళ శాస్త్ర పరిజ్ఞానం ఏ కారణం చేతనైనా లేక పోయినప్పటికీ జ్ఞానోదయం కలగడానికి అర్హుడే అవుతాడు. అతడు దేనినడుగుతే దానిని భగవంతుడిస్తాడు. ఎప్పుడు పిలుస్తే అప్పుడు ఎదుట నిలుస్తాడు. జ్ఞాన నేత్రం లేనివాడు అనగా జ్ఞానోదయం కానివాడు, అతడెంత గొప్ప విద్వాంసుడైనప్పటికీ, ధనికుడైన, బలవంతుడైన, సర్వాధికారములు గల చక్రవర్తి అయిన – భగవానుని దృష్టిలో గ్రుడ్డివాడు మాత్రమే.

అకలంక భక్తునికి మంచి ఆదర్శం "ప్రహ్లాదుడు." అతని తండ్రియగు హిరణ్యకశిపునికి 'హరి' మాటంటే అసలే సరిపడదు. 'హరి' ని స్మరించకుండా ఒక్క నిముసమైనా నిలువలేడు. "ప్రహ్లాదుని" 'హరి' పేరును స్మరించ వద్దని తండ్రి ఎన్నో బాధలు పెడుతాడు. ఏనుగులతో త్రొక్కిస్తాడు, విషసర్పములతో కరిపిస్తాడు. కొండల మీదనుండి

కొట్టిస్తాడు, కొరడాలతో కొట్టిస్తాడు. అయినప్పటికీ ప్రహ్లాదుడు 'హరి' నామ స్మరణ విడనాడ లేదు. ఏమి చేయాలో తోచక విసిగి వేసారి, చిట్టచివరికి "నీకు శక్తి వుంటే ఈ స్తంభంలో నీ "హరి ని చూపించు" అని గర్జించి హిరణ్యకశిపుడు ఆ స్తంభమును కోపంతో మూడు ముక్కలు చేస్తాడు. దానిలోనుండి నృసింహావతారంలో ఆ 'పరమాత్మ' బయటకు వచ్చి హిరణ్య కశిపుడ్ని సంహరించి ప్రహ్లాదునికి ఆనందం చేకూరుస్తాడు. భక్తితో సాధించ లేనిదంటూ ఈ ప్రపంచంలో మరొకటి లేదని ఈ ఉదంతం వల్ల మనకు స్పష్టమవుతున్నది. ఎవరు నిశ్చలమైన భక్తితో, నిర్మలమైన చిత్తంతో శ్రద్ధతో పట్టుదలతో భగవంతుని ఆరాధిస్తారో, అట్టివారికి పరమాత్మ కరుణా కటాక్షములు ఎల్లప్పుడూ వుంటాయనే విషయం ఈ సంఘటన వల్ల రుజువవుతున్నది. కనుక ప్రతి ఒక్కరు సర్వకాల సర్వావస్థల యందు దైవము నందు భక్తి శ్రద్ధలు కలిగి యుండవలెను. భగవంతుని నమ్మినవారికి యిక ఎట్టి భయమూ వుండదు. భక్త కబీరు, భక్త తులసీదాస్‌లు ఈ కోవకు చెందినవారు. "హరిని స్మరించినవాడు హరియే కాగలడు. హరిని వరించుటే జీవితమును తరింప చేసుకొనుట" అని కబీరుచాటెను. "వాంఛారహితుని మాత్రమే రాముడు వరించుననియు, అట్టి వానిని తరింపజేయుననియు, హృదయమున రామనామం నింపి, కరమున కర్తవ్య, కర్మల నాచరింపుము" అని భక్త తులసీదాసు ప్రబోధించెను.

మాతృభక్తి, పితృభక్తి, గురుభక్తి, దైవభక్తి, అతిథి భక్తులతోటు ప్రతి స్త్రీకి 'పతిభక్తి' అత్యంతావశ్యకము. "పాతివ్రత్యం' భారతీయ స్త్రీల పరమోత్కృష్టమైన ఆదర్శం. పాతివ్రత్యమునకు మించిన శీలం మరొకటి లేనే లేదని భారతీయ ధర్మం బోధిస్తున్నది. బంగారపు ఆభరణములను పెట్టుకొనడం స్త్రీకి అలంకారం కాదు. స్త్రీకి అలంకారం శీలంలో మాత్రమే వున్నది. భర్త అడుగు జాడలలో నడవడం భారతీయ స్త్రీ లక్షణం. కష్ట సుఖములలో పాలు పంచుకోవడం ఆమె విద్యుక్త ధర్మం. అందుకోసమే భార్యను 'అర్ధాంగి' అన్నారు. పతిభక్తికి చక్కటి ఆదర్శం సీత, సావిత్రి, అనసూయలు. తండ్రి ఆజ్ఞానుసారం శ్రీరాముడు అరణ్యమునకు బయలు దేరునప్పుడు ఎంతవద్దని చెప్పినప్పటికి సీత శ్రీరాముని వెంబడిస్తుంది. భర్తననుసరించడమే భార్య పరమావధి అని భావిస్తుంది. హంస తూలికా తల్పాల మీద శయనించవలిసిన అతి సుకుమారి సీతాదేవి శ్రీరాము ననుసరించి, అతి భయంకరమైన కీకాణ్యాలలోని కటికి రాళ్ళమీద శయనించి, ఎన్నో కష్టాల ననుభవించి, ప్రపంచానికి 'పతిభక్తి' యొక్క విశిష్టత్వాన్ని చూపించిన పతిభక్తి పరాయణరాలు సీతాదేవి. శ్రీరాముడు తనతో తీసుకొని వెళ్ళడానికి నిరాకరించగా, సీత అప్పుడు శ్రీరామునితో భర్త లేని స్వర్గం కంటే, భర్తతో అరణ్య

వాస దుఃఖమునే వరింతును. నీతో వుండటమే స్వర్గం. నిన్ను విడచి వుండటమే నాకు నరకం.

కనుక నన్ను తీసుకొని పొమ్ము" అని విలపిస్తుంది. మరియు "నన్ను ఐశ్వర్యములుగాని, ధనముగాని లోభపెట్ట జాలవు. సూర్యుని విడచి వెలుగు ఎట్లుండదో, నిన్ను విడచి నేను అట్లుండలేను. నన్ను వనవాసమునకు తీసుకొని వెళ్ళని యెడల విషము త్రాగియో, నీటిలో పడియో, అగ్నిలో దుమికియో మరణిస్తాను" అని బెదరిస్తుంది. సుఖములోనే కాక, దుఃఖములో కూడా పాలుపంచుకోవడం నిజమైన భారత నారీ ధర్మమని లోకానికి నిరూపించింది సీత. మానవుని యొక్క నిజమైన వ్యక్తిత్వం కష్ట సమయములలోనే కనిపిస్తుంది. తనను వివాహమాడి పట్టమహిషివి కమ్మనమని రావణుడు ఎంతో ప్రాధేయ పడుతాడు, అర్థిస్తాడు. చివరకు బెదరిస్తాడు, అయినప్పటికి సీత ఏమాత్రం చలించదు. ధైర్యంగా రావణునితో "నీవు నన్ను చూచి భ్రమించితివి. జంబుకము వంటి నీకు, ఆడు సింగము వంటి నేను దుర్లభురాలునని ఎరుగుము. ఒకవేళ వజ్రధరుడగు ఇంద్రుని భార్యను అవమాన పరచి బ్రతికిన బ్రతకవచ్చునేమోగాని శ్రీరామచంద్రుని భార్యనగు నన్ను బలాత్కారముగా హరించి, నీవు అమృతమును త్రాగియుండినను, మృత్యువును మాత్రం తప్పించుకొనజాలవు." అని సీతాదేవి ధైర్యంగా హెచ్చరిస్తుంది. ఎటుచూచినా నూరు యోజనముల సముద్రం, నా అన్నవారెవరూ కనుచూపుమేరలో

లేరు. భయంకరమైన రాక్షస మూకల మధ్య ఒంటరిగా వున్నది. వారు పెట్టే బాధలను, బెదరింపులను సహిస్తూ కూడా, ఏమాత్రం చలించక, ఆత్మ విశ్వాసాన్ని కోల్పోక ధైర్యమును విడనాడక పరిస్థితుల ప్రభావానికి లొంగక, రావణుని అష్టైశ్వర్యములను కాలదన్ని భారతీయ నారీత్వ ఔన్నత్యమును లోకమునకు చాటినది. భారతీయ స్త్రీకి "పాతివ్రత్యము" అనునది ఒక మహత్తరమగు తపమని, అట్టి తపోనిష్ఠురాండ్రగు స్త్రీలను వంచించువారు, యెంతటి బలపరాక్రమ సంపన్నులైనప్పటికీ, అగ్నిలో పడిన మిడుతల వలె దగ్ధమై పోవుదురని 'సీత' లోకమునకు నిరూపించినది. ఎన్ని కష్టములు వచ్చినా, వాటిని లెక్కచేయక ధైర్యంతో ఎదిరించి పోరాడగల ఆత్మబలం, నైతికశక్తి భారత స్త్రీలకు కలదని 'సీతాదేవి' రుజువు చేసింది. రావణ సంహారానంతరం, శ్రీరాముని శంకాపూరితమైన మాటలు విని కూడా ఓర్పును విడనాడలేదు. సీతాదేవి ఆజ్ఞానుసారం లక్ష్మణుడు చితిని ప్రజ్వలింపజేయగా తన భర్తకు ప్రదక్షిణంచేసి, దేవతలకు ప్రణామమొనర్చి అగ్నిలోనికి దుమికేముందు "నా యొక్క హృదయము, నిత్యమూ రాఘువుని తప్ప యితరుని మీద పోకుండ నున్నచో, నన్ను సకల విధములా అగ్ని రక్షించు గాక!" అని అగ్నిలో ప్రవేశిస్తుంది. అగ్ని ఆరి పోతుంది. "ఓ రామా! పాపరహితయగు సీతను పరిగ్రహించుము" అని అగ్నిదేవుడు ఆజ్ఞాపిస్తాడు. రావణవధానంతరం, అతని భార్య మండోదరి విలపిస్తూ. "నీవు పతివ్రతయగు సీత యొక్క తేజము చేత దగ్ధమైనావు" అని వాపో

తుంది. 'పాతివ్రత్యము' నకు మించిన శక్తి మరొకటి లేదని రుజువు చేసింది 'సీతాదేవి'. తన పాతివ్రత్య మహిమ చేత మరణించిన సత్యవంతుని ప్రాణాలను తిరిగి తెప్పించ గలిగింది సతీ సావిత్రి. సతీ అనసూయ తన పాతివ్రత్య మహిమ చేత ఇనుప గుండ్లను గుగ్గిళ్ళుగా వండి నారదునికి యిచ్చి త్రిమూర్తుల భార్యల నాశ్చర్యచకితులను చేసింది. తన పాతివ్రత్య మహిమచేత సూర్య గమనాన్ని సహితం నిలిపి తన భర్త ప్రాణాలకు రక్షించుకొన్నది 'సుమతి.' భారతదేశ పురాణముల పుటలను త్రిప్పుతుంటే అడుగడుగునా కనుపిస్తాయి భారత మహిళల పాతివ్రత్య మహిమలు. భావి తరముల వారికి వారి జీవితాలు ఆదర్శ ప్రాయములవ్వాలి.

## సోదర ప్రేమ

ప్రతి వ్యక్తి తన సోదరులను, సోదరీమణులను (అన్నదమ్ములను, అక్క-చెల్లెళ్ళను) మనసారా ప్రేమించవలెను. ఆపదకాలంలో సహితం, విడువకుండా కష్ట సుఖములలో పాలుపంచుకునే వారే నిజమైన సోదరులు. సోదర ప్రేమకు మంచి ఆదర్శము దశరథ కుమారులైన శ్రీరామచంద్రుని సోదరులు. శ్రీరాముడు తండ్రి ఆజ్ఞానుసారము అడవులకు బయలుదేరినప్పుడు, వద్దన్నప్పటికి వినకుండా లక్ష్మణుడు కూడా శ్రీరాముని అనుసరిస్తాడు. తల్లిదండ్రులను, ప్రియమైన భార్యను, సకల రాజ భోగములను తృణ ప్రాయంగా నెంచి అడవులకు పయనమై వెళ్ళి సీతారాములకు అంగ

రక్షకుడుగా, సేవకుడుగా సకల సపర్యలు చేస్తూ చివ
రికి రావణ సంహారంలో శ్రీరామునికి కుడి భుజంగా వుండి
పడరానిపాట్లు పడతాడు. హాయిగా, సుఖముగా కాలం
గడపడానికి ఎన్నో అవకాశము లున్నప్పటికి, అన్నగారి
యెడల వున్న ఎనలేని ఆప్యాయత వల్ల, కష్టములకు బుద్ధి
పూర్వకంగా తానంతటతానే స్వాగతం చెప్పుకొని, వాటిని
నవ్వుతూ, నవ్వుతూ స్వీకరించి సోదర ప్రేమ యొక్క ఔన్న
త్యాన్ని ప్రపంచానికి చాటి చూపించిన సోదర భక్తి పరా
యణుడు లక్ష్మణుడు. శ్రీరాముడు కానకేగునప్పుడు భరత
శత్రుఘ్నులు అయోధ్యలో లేరు. శ్రీరాముని వియోగము
నకు తట్టుకోలేక దశరథుడు పరమపదిస్తాడు. ఆ మరణవార్త
విన్న భరత శత్రుఘ్నులు తాతగారింటినుండి బయలుదేరి
అయోధ్యకు వస్తారు. శ్రీరాముని కానలకు పంపినందుకు
తల్లి కైకేయిని నిర్దాక్షిణ్యంగా నిందించి, అనరాని మాటలు
అంటాడు భరతుడు. దశరథుని అంత్యక్రియలను పూర్తి చేసి
భరత శత్రుఘ్నులు సైన్య సమేతంగా బయలుదేరి అరణ్య
మునకు వెళ్ళి, అయోధ్యకు తిరిగివచ్చి రాజ్యమును పాలించ
మని ప్రాధేయపడుతాడు, వేడుకుంటాడు భరతుడు. అవ
కాశం వచ్చిందే చాలుకదాయని, రాజ్యాన్ని స్వీకరించ
కుండా, నిస్వార్థబుద్ధితో, కల్లాకపటం లేకుండా, శ్రీరాము
నికే పట్టాభిషేకం చేయడానికి ఎంతో ప్రయత్నిస్తాడు.
శ్రీరామునికి బదులు అతనే పదునాలుగు సంవత్సరములు
అరణ్యవాసం చేస్తానని పట్టు పడుతాడు. కాని శ్రీరాముడు
ససేమిరా అంగీకరించడు. భరతుని ఓదార్చి వెళ్ళి రాజ్య

మును పాలించమని నచ్చచెబుతాడు. కాని భరతుడు పట్టిన పట్టును విడువడు. గత్యంతరం లేక చిట్ట చివరికి ప్రాయోప వేశమునకు సిద్ధమవుతాడు. అయినప్పటికి శ్రీరాముడు తన నిర్ణయమును మార్చుకోనడు. తండ్రి దశరథాజ్ఞను శిరసా వహించినప్పుడే తండ్రికి నిజమైన ఆత్మ శాంతి చేకూరు తుందని భరతునికి నచ్చజెబుతాడు. చివరికి చేసేది లేక శ్రీరాముని పాదుకలను, ప్రాధేయపడి తీసుకొని, నెత్తిమీద పెట్టుకొని తిరిగి వెళ్ళిపోతాడు భరతుడు. కాని మళ్ళీ అయోధ్యలో మాత్రం కాలుపెట్టడు. అయోధ్య ప్రక్కనే వున్న నందిగ్రామంలో మకాంచేసి శ్రీరాముని పాదుకలకు పట్టాభిషేకంచేసి, వాటి ప్రతినిధిగా పదునాలుగు సంవత్స రములు శ్రీరాముడు తిరిగి వచ్చేదాకా భరతుడు చక్కగా రాజ్యమును పాలిస్తాడు. సకల భోగభాగ్యములను విడనాడి, నారబట్టలను ధరించి, ఒక మునిలా పదునాలుగు సంవత్స రములు ఎట్టి కోరికలు లేకుండా సన్యాసి జీవితమును గడు పుతూ, అతి నిరాడంబరముగా రాజ్యమును పాలించిన మహా త్యాగశీలి భరతుడు. రావణ సంహారానంతరం తిరిగివచ్చిన శ్రీరామునికి స్వాగతంపలికి, తిరిగి రాజ్యమునిచ్చి కడు వైభవో పేతంగా సీతారాములకు పట్టాభిషేకం చేసి, జీవితాంతం అన్నగారికి విధేయుడై జీవితాన్ని కడు నిరాడంబరముగా గడిపి, ప్రపంచానికి సోదర ప్రేమ యొక్క గొప్పతనాన్ని, ఔన్నత్యాన్ని, విశిష్టతను చాటి చూపించిన ఆదర్శ జీవి భరతుడు. రామ రావణ యుద్ధంలో ఒకప్పుడు రామ లక్ష్మణు లిద్దరూ నాగపాశాస్త్రమునకు గురై స్పృహతప్పి

మూర్ఛిల్లుతారు. ముందుగా శ్రీరామునికి తెలివివస్తుంది. మూర్ఛలో నున్న తమ్ముని చూచి "సీతలాంటి భార్యలు భూలోకమున ఎక్కడైనా లభిస్తారు. కాని లక్ష్మణునితో సమానమైన సోదరుడు మాత్రం లభించటం దుర్లభం" అని విలపిస్తాడు. మరొకప్పుడు అడవులలో సీతను వెతుకుతుండగా అన్నదమ్ము లిద్దరూ ఒకే పర్యాయం "కబంధుడను" రాక్షసుని చేతిలో చిక్కుతారు. అప్పుడు లక్ష్మణుడు" నీవునన్ను గూర్చి ఆలోచించడం మానివేసి, కబంధునికిబలిగా సర్పించి, నీవు సుఖముగా పొమ్ము" అని శ్రీ రాముని ప్రార్థేయ పడుతాడు. శ్రీరాముని సోదరులు ఒకరికి మించిన వారు మరొకరు. వారి సోదర ప్రేమ అనిర్వచనీయం. వారి ఆప్యాయతలను గురించి, సోదరప్రేమను గురించి మానవాళి వున్నంత కాలం చెప్పుకుంటూనే వుంటారు. అధునాతన ప్రపంచంలో ఆస్తుల కోసం, స్వార్థంతో, సంకుచితత్వంతో పండంటి కుటుంబాలలో చిచ్చు పెట్టుకొని, సలక్షణంగా జీవిత యాత్రను కొనసాగిస్తున్న కాపురాలను సర్వనాశనం చేసుకొనడానికి కూడా ఏమాత్రం వెరవని సోదరులకు 'రామాయణం' చక్కటి వెలుగు బాటను చూపుతుంది. శ్రీరాముని సోదరుల ఆదర్శ జీవిత చరిత్రను మానవాళిలో విస్తృతంగా ప్రచారం సల్పుతే, స్వార్థంతో సోదరుల మధ్య ఏర్పడుతున్న అగాధము కొంత వరకు తగ్గుతుందేమో!

## సత్యం

"సత్యమేవ జయతే." సత్యమే జయించునని మన స్మృతులు ఎలుగెత్తి చాటుతున్నాయి. ఎటువంటి పరిస్థితులలోను అంతిమ విజయం సత్యానిదేనని మహా ప్రవక్తలు తమ జీవిత కాలంలో నిరూపించారు. సత్యమనగా నిజం, అబద్ధమాడకుండా వుండటం. "సత్యంవద, ధర్మంచర" "సత్యమునే చెప్పుము, ధర్మమునే ఆచరించుము" అని వేదములు తెలుపుచున్నాయి. ఎన్ని కష్టములు వచ్చినా, బాధలు కలిగినా, అవాంతరములు ఏర్పడినా, చిట్ట చివరికి ప్రాణమునకు ముప్పువాటిల్లినా సత్యమునే చెప్పవలెను. ధర్మపథమును విడనాడరాదు. అసత్యం చెప్పిన యెడల, అబద్ధమాడిన యెడల, ఒకవేళ సిరిసంపదలు కలసిరావడానికి అవకాశం వున్నప్పటికి, అట్టి దుష్ట ప్రయత్నం మాత్రం ఎటువంటి పరిస్థితులలోను చేయరాదు. ఒకవేళ ఎవరైనా పిల్లలు పొరపాటున చేయకూడని పనిచేస్తే, పెద్దలు దండించుతారనే భయంతో సహజంగా పిల్లలు అబద్ధమాడుతారు. తరువాత అబద్ధమాడటానికి ఏమాత్రం వెరువరు. సంకోచించరు. చివరకు అలవాటైపోతుంది. నైతిక భ్రష్టులవుతారు. ఇది ఏమాత్రం మంచి పద్ధతికాదు. చేసినపని తప్పే అయినప్పటికి ధైర్యముగా ఒప్పుకోవడంలోనే వున్నది గొప్పతనం. చేసిన పొరపాటును ధైర్యంగా ఒప్పుకోవడం వల్ల అతని ప్రతిష్ఠ యినుమడిస్తుందే గాని ఏమాత్రం తరగదు. మళ్ళీ అటువంటి పొరపాటు జరగకుండా చూచుకోవాలి

గాని, పెద్దలు కోపం చేస్తారేమోననే భయంతో అబద్ధం మాత్రం ఆడరాదు. ఈ విషయంలో పెద్దల బాధ్యతకూడా కొంత వున్నది. పిల్లలు ఏ చిన్న తప్పు చేసినా సహజంగా పెద్దలు చివాట్లు పెడతారు. ఇంకా కొంతమంది కోపంతో కొడతారు. దానినుండి తప్పించుకోవడానికి, అసలు విషయము కప్పిపుచ్చి అబద్ధమాడుతారు పిల్లలు ప్రారంభంలో. పెద్దలు వెంటనే ఆగ్రహించక సహనంతో అనుగ్రహించాలి. అనురాగంతో మృదుమధురమైన మాటలతో బుజ్జగించాలి. చేసిన పొరపాటును విడమరచి చెప్పాలి. దానివల్ల వచ్చే చెడును కూడా వివరించాలి. మళ్ళీ అటువంటి పొరపాటు చేయకుండా చూడాలి. పిల్లలలో మానసిక పరివర్తన వచ్చే లాగున ప్రయత్నించాలి. పిల్లలు చేసిన ప్రతిపనికీ ఆమోదం తెలుపుతూ, మెదలకుండా మౌనం వహిస్తుంటే మాత్రం పిల్లలు చేతికిరారు. పిల్లలను చేతులారా పాడుచేసినవాళ్ళ మవుతాం. సత్యమును ధైర్యంగా చెప్పగలిగేటటువంటి 'ఆత్మశక్తి' ని బాల బాలికలలో కలుగజేయడం తల్లిదండ్రుల ప్రథమ కర్తవ్యం.

సత్యానికి ప్రతీక సత్య హరిశ్చంద్రుడు. కష్టములు వచ్చినప్పుడు ఆ మహనీయుని చరిత్రను స్మరించు కొనిన యెడల స్ఫూర్తి వస్తుంది. ఆడిన మాటను నిలబెట్టుకొన డానికోసం తన సర్వ సంపదలను, రాజ్యాన్ని సహితం త్యాగం చేసిన త్యాగశీలి. చిట్ట చివరకు తన అనుంగు భార్యా పుత్రులను కూడా అమ్ముకొని బాకీని తీర్చిన సత్య

వ్రతుడు. ఇంకా మిగిలియున్న బాకీని తీర్చుటకై, తనను తాను అమ్ముకొని కాటి కాపరిగా పనిచేసిన త్యాగధనుడు. రాజ్యభ్రష్టుడై, భార్యా పుత్ర వియోగియై కాటి కాపరిగా వున్ననూ, బాధలు పడుతున్ననూ సత్యపథమును మాత్రము విడనాడలేదు. తన కుమారుడు లోహితాస్యుడు పాముకరచి చనిపోగా, భార్య అయిన చంద్రమతి ఆ పిల్లవాని శవమును స్మశానమునకు తీసుకొనిరాగా, కాటి సుంకము చెల్లించనిదే కాల్చుటకు వీలుకాదని స్పష్టంగా చెబుతాడు. ఆమె భార్య అనియూ, ఆ పిల్లవాడు కుమారుడని తెలిసి కూడా, కాటి కాపరిగా తన విద్యుక్త ధర్మమునకు ఏమాత్రం లోటు కానివ్వకుండా, తన బాధ్యతలను తూచా తప్పకుండా ఆచరించి చూపించిన ఆదర్శ పురుషుడు. భరించరాని ఆపదలు వెంబడించి నప్పటికీ సత్య పథమును విడనాడలేదు. ఆడి తప్పని సత్యమూర్తులు తాము చేసిన వాగ్దానములను సదా స్మరించుకుంటూ వుంటారు. ఆపదలు ఒకదాని తరువాత ఒకటి వచ్చి పై పైన పడుతున్నప్పటికి, ధైర్యమును విడనాడక, సత్య మార్గముననే నిర్భయంగా నడచి పోతూ వుంటారు. "సత్యమునకు ప్రాణం పోదు. అసత్యమునకు జీవం రాదు" ఈ వాస్తవమును గ్రహించిన మానవునికి ఎట్టి యిబ్బందీ వుండదు. సత్యమే ఈ జగత్తుకు మూలాధారం. దీనినెవరూ విస్మరించరాదు.

పూర్వం ఒక తండ్రి ఉంగరం చేయించుకోమని 'ఉదయ్' అనే ముద్దుల కుమారునికి నాలుగు 'వరాలు' యిచ్చాడు. అనగా బంగారు నాణెములను యిచ్చాడన్న మాట. వానిని ఆ బాలుడు బల్లమీాద పెట్టి చదువులో నిమగ్నుడైనాడు. ఇంతలో 'విజయగౌరి' ఆ అబ్బాయి చెల్లెలు అక్కడికి వచ్చి బల్లమీాద నున్న బంగారు నాణెము లను చూచి ''అన్నయ్యా! ఇదేమిటి'' అని నాణెములను పట్టుకొని అడిగింది. 'అవి ఎవరు యిచ్చారు?' అని ప్రశ్నిం చింది. అప్పుడు వాళ్ళ అన్నయ్య ఇవి 'వరాల చెట్టు' కు కాసినాయి. వీటిని తీసుకొనివెళ్ళి పాతిపెట్టిన యెడల మొక్కలు మొలచి పెద్ద చెట్లు అయి చాలా కాయలు కాస్తాయి. ఆ కాయలలో ఇటువంటి 'వరాలు' చాలా వుంటాయని చెప్పి చదువుకుంటుంటాడు. 'గౌరి' చాలా చిలిపి పిల్ల కావడం వల్ల, ఆ వరాలను నెమ్మదిగా చప్పుడు కాకుండా తీసుకొని, బావివద్దకు వెళ్ళి చిన్న గోయి తీసి 'ఆ వరాలను' పాతిపెడుతుంది. 'ఉదయ్' తన చదువును పూర్తి చేసుకొని, బల్లమీాద చూడగా ఆ 'వరాలు' కనపడవు, ఆతురతతో వెళ్ళి 'గౌరి' ని అడుగుతాడు. అప్పుడు వాళ్ళ చెల్లెలు ''వరాల కాయలు కాయడాని కోసం, బావి వద్ద పాతిపెట్టాను'' అని చెబుతుంది, 'ఉదయ్' త్వరగా వెళ్ళి బావివద్ద వెతుకుతాడు. కాని ఆ 'వరాలు' కనుపడవు. ఆ బాలిక పాతిపెడుతుండగా అంట్లుతోముతున్న 'పని మనిషి'

చూచి వాటిని సంగ్రహించి వుండవచ్చు. ఆ బాలుడు ఏడుస్తూ వాళ్ళ అమ్మతో చెబుతాడు, తన చెల్లెల్ని కొడతాడు కూడాను. ఇదంతా విన్న వాళ్ళ 'నాన్నగారు' వచ్చి "అబద్ధ మాడినందుకు తగినశాస్తి జరిగింది." అని అంటాడు ఈ కథవల్ల మనం నేర్చుకోనవలసిన 'నీతి' ఒకటి వున్నది. 'ఉదయ్' అనే బాలుడు అబద్ధ మాడటంవల్ల, వాటిని 'విజయగారి' నిజమనుకొని నమ్మి వరాలను తీసుకొని వెళ్ళి బావివద్ద పాతిపెట్టింది. అమాయకులైన చిన్న పిల్లలతో అబద్ధం మాటలు చెబుతే 'ఉదయ్' కు జరిగిన శాస్తే జరుగుతుంది. ఆ బాలుడికి వచ్చే ఉంగరం కాస్తా పోయింది. కనుక అబద్ధం ఎప్పుడూ చెప్పరాదు. అసత్యపు మాటలు ఎప్పుడూ మాట్లాడరాదు. ఆటలలో నైనా సరే పరిహాసంగా అబద్ధ మాడరాదు. "సత్యం జయిస్తుంది. అసత్యం ఆఖరికి అపజయమును పొందుతుంది." ఈ వాస్తవాన్ని అందరూ గ్రహించాలి.

## అ హిం స

"అహింసా పరమోధర్మః" 'అహింస పరమోత్కృష్టమైన ధర్మము' అని ఉపనిషత్తులు బోధిస్తున్నాయి. అహింసా సిద్ధాంతం అనగానే యిది నిస్సహాయులు, చేతకాని వారు, బలహీనులు, అనామకులు చెప్పే చవట సిద్ధాంతమని చాలమంది అభిప్రాయం. వ్యాపారంలో డబ్బు సంపా

దించడం చేతకానివారు సత్యమును గురించి ఎదుటి వానిని కొట్టడానికి అంగీకరించనివారు అహింసను గురించి మాట్లాడు తుంటారని మరికొంతమంది నమ్మకం. దురదృష్టవశాత్తు ఈ ప్రస్తుత ప్రపంచంలో ఆశయ ఆదర్శములు గలవారిని అపార్థం చేసుకొనడం, విశాల భావములు గలవారిని చేత కాని వారిగా పరిగణించడం పరిపాటైంది. ఇది మాత్రం వాస్తవం కాదు. ధైర్యము, బలము, శక్తి, ధనము కలిగి వుండి కూడా అన్యోన్య ప్రేమను ప్రదర్శిస్తూ, సముచితమైన దాన ధర్మములను చేస్తూ, కరుణ, దయ, ప్రేమలను వర్షిస్తూ శాంతియుత ప్రశాంత వాతావరణమును కలుగ జేయునదే "అహింసా సిద్ధాంతం," ఆగ్రహంతో హింసకు దిగకుండా, ఆత్మ నిగ్రహమును ప్రదర్శించునదే "అహింసా వాదం." "సహనమే అహింస, అసహనం హింస. అహింస ధర్మం, హింస అధర్మం (చేయగూడని పని)."

హింస చేయగూడని పని అని భావించి క్రూర జంతువులను, విష జంతువులను జంప కూడదని భావించడం ఏమాత్రం విజ్ఞతా లక్షణం కాదు. విష జంతువులైన పాము లను, పులి మొదలగు క్రూర జంతువులను జంపవలసినదే. వాటిని వదలిపెట్టిన యెడల సమాజమునకు తీరని నష్టం చేస్తాయి. శిక్షించడం హింస కాబట్టి దుష్టులను, రౌడీలను, దొంగలను, దోపిడీదారులను శిక్షించకుండా వుండటం ఏమాత్రం వివేకవంతుల లక్షణం కాదు. అటువంటి చెడు ప్రవర్తన కలవారిని శిక్షించవలసినదే. సమాజ శ్రేయస్సు

కోసం దుష్టులను శిక్షించడం ఉత్తమ ధర్మంగా పరిగణించ బడుతున్నది. అందుకోసమునే పరమాత్మ "దుష్ట శిక్షణ-శిష్ట రక్షణ" కోసం అప్పుడప్పుడు అవతరిస్తానని, జన్మిస్తానని "గీత" లో చెప్పాడు. హింసా ప్రవృత్తి సమాజంలో పెచ్చు పెరిగి, అరాచకం సృష్టించబడి క్రూరత్వం విచ్చల విడిగా, విశృంఖలంగా విలయతాండవం చేస్తున్న రోజులలో "గౌతమ బుద్ధుడు" 'అహింసా వాదము' ను ప్రజలలో విస్తృతంగా ప్రచారం చేసి శాంతిని నెలకొల్పాడు. అదే అహింసా సిద్ధాంతమును గాంధీజి వెలుగులోనికి తీసుకొని వచ్చి 'మహాత్ముడు' గా పేరుగాంచాడు. కనుక సర్వశక్తి మంతమైన, నైతిక శక్తిని యినుమడింప జేసేటటువంటి 'అహింసా సిద్ధాంతము' ను అందరూ అనుసరించి, పాటించి ప్రచారం చేయాలి.

## ప రో ప కా ర ము

ఎన్ని లౌకిక విద్యలను నేర్చుకొని నప్పటికి పరోపకార బుద్ధి అలవరచుకొనని యెడల ప్రయోజనం శూన్యం. పరోపకార బుద్ధి అన్ని బుద్ధులలోనికి మిక్కిలి శ్రేష్టమైనది. పరోపకార మనగా ప్రక్కవారికి, యితరులకు ఉపకారం చేయడం అని అర్థం. ఉపకారం చేసేటప్పుడు మన మనస్సులలో ఎట్టి స్వార్థం వుండరాదు, మనం ఈ రోజున ఒకరికి ఉపకారం చేస్తే, భవిష్యత్తులో వారు మనకు ఉపయోగ

పడవచ్చు ననే భావంతో మాత్రం చేయరాదు. ఎట్టి ఫలా పేక్ష లేకుండా పరులకు నిస్వార్థ బుద్ధితో సహాయం చేయ డమే నిజమైన పరోపకారము. ఇదే భావమును ఈ శ్లోకము విశదీకరిస్తున్నది.

శ్లో॥ "పరోపకారాయ ఫలంతి వృక్షాః
పరోపకారాయ వహంతి నద్యః
పరోపకారాయ దుహంతి గావః
పరోపకారాయ సతాం విభూతయః"

అనగా "పరోపకారము కొఱకు వృక్షములు ఫల ముల నిచ్చుచున్నవి. పరోపకారము కొఱకు నదులు ప్రవ హించుచున్నవి. పరోపకారము కొఱకు గోవులు పాలను యిచ్చుచున్నవి. పరోపకారము కొఱకే సజ్జనుల యొక్క సంపదలు (వినియోగపడుతవి)" అని అర్థం.

వృక్షములకు, నదులకు, గోవులకు, సజ్జనులకు ఎట్టి స్వార్థం వుండదు. పరోపకారమే వాటి (వారి) పరమావధి. ఇతరులకు యివ్వడమే గాని ప్రతిఫలమును మాత్రం ఆశిం చవు ఆశించరు. అట్టి ఉదార స్వభావము, పరోపకారబుద్ధి వృక్షములు, నదులు, గోవులకు గనుక లేకపోతే మానవ జాతే నశించి వుండేది. అదే విధముగా సజ్జనులు తమ సంప దను అనగా భౌతిక సంపద మరియు విద్యా సంపదలను ఉదారంగా పరులకు దానం చేసే పరోపకార బుద్ధి గనుక లేకపోతే మానవ జాతి మనుగడకే ప్రమాదం వాటిల్లి వుండేది. కనుక మానవాభ్యున్నతికి పరోపకార బుద్ధిని

అందరూ అలవరచుకోనవలెను. ''మానవసేవే మాధవసేవ'' అని గీత బోధిస్తున్నది. మనుజులకు నిష్కామ బుద్ధితో సేవ చేయడం అంటే సాక్షాత్ భగవంతుని సేవ చేయడం అన్న మాట. అంతేకాదు ఏ ప్రాణికి ఉపకారం చేసినా సాక్షాత్ పరమాత్మను పూజించడమే అవుతుంది. ''నరునికి సేవ చేసినచో నారాయణునికి అర్పించినట్లే, పరులకు సేవ చేయడం అంటే పరమేశ్వరుని పూజించడమే అవుతుంది.'' తన కుప కారం చేసినవానికి మేలు చేయడంలో లేదు గొప్పతనం. తన కపకారం చేసినవానికి కూడా, వాని తప్పులను తల పోయక, మేలు చేయువాడే ఉత్తముడు. ఇదే విషయాన్ని ఈ క్రింది సుమతీ శతకం పద్యం బోధిస్తున్నది.

కం. ''ఉపకారికి నుపకారము
విపరీతము కాదుసేయ వివరింపంగా
నపకారికి నుపకారము
నెపమెన్నక సేయువాడు నేర్పరి సుమతీ''

ఇది అత్యున్నతమైన తత్వ జ్ఞానము. ఆస్థాయికి చేరు కోవడం అంత తేలిక కాదు. అందరికి చేతకాదుకూడాను. అపకారికి కూడా ఉపకారం చేయడం గొప్ప విషయమే, అయినప్పటికి ఈ ఉపకారం చేయడంలో కొంచెం ''ఇంగిత జ్ఞానం'' వుండాలి. విచక్షణా జ్ఞానాన్ని ప్రదర్శించాలి. గ్రుడ్డిగా నమ్మి అపకారికి కూడా ఎల్లప్పుడూ ఉపకారం చేస్తుంటే, ఒక్కొక్కప్పుడు ప్రమాదం కూడా సంభవిస్తే సంభవించ వచ్చును. కొంతమంది మూర్ఖుల విషయంలో

తప్పని సరిగా విచక్షణ చూపించాలి. చేసిన మేలును మర చిన కృతఘ్నుల విషయంలో విజ్ఞతను ప్రదర్శించాలి. అప కారం చేసిన వారిని దండించడం రాజధర్మం. దుష్టబుద్ధితో ఏ దేశమైనా, మన దేశం మీద దుర్బుద్ధితో దురాక్రమణ చేస్తే గట్టిగా ఎదుర్కొని బుద్ధి చెప్పాలి. అపకారం చేసిన వారికికూడా ఉపకారం చేయాలనే ఆదర్శమును మననం చేసుకుంటూ ఉపకారం చేయడం గాని, ఊరకుండటం గాని చేస్తే ప్రమాదం సంభవించి తీరుతుంది. ఇక్కడ మాతృ భూమిని రక్షించుకోవడం ఉత్తమ ధర్మం. ప్రతి పౌరుని ప్రాథమిక కర్తవ్యం కూడాను. కనుక ఆయా పరిస్థితులను బట్టి ఉత్తమ ధర్మమేదో, తక్షణ కర్తవ్యమేదో వివేకంతో నిర్ణయించుకొని సందర్భోచితంగా, సమయస్ఫూర్తితో వ్యవహరించాలి. పృథ్వీరాజ్ మీద 'ఘోరీ మహమ్మద్'' 17 సార్లు దండయాత్ర చేశాడు. అనేక అకృత్యాలు నొన ర్చాడు. సకల సంపదలను సర్వనాశనం చేశాడు. మారణ హోమం సృష్టించాడు. అయినప్పటికి అన్ని దండయాత్ర లలో చిట్ట చివరికి పృథ్వీరాజ్ చేతులలో బందీ అవుతాడు. క్షమాభిక్షను కోరుకుంటాడు. శరణుకోరిన వారిని క్షమిం చడం ఆనాటి రాజధర్మం కావడం వల్ల గ్రుడ్డిగా పృథ్వీరాజ్ ఉదారతతో 'ఘోరీ' ని క్షమించి వదలిపెడుతాడు. కాని "ఘోరి' కృతఘ్నుడై తిరిగి పృథ్వీరాజ్ మీద దండెత్తి వచ్చి, స్వార్థపరుడైన జయచంద్రునికి ఆశలు కల్పించి,వలలో వేసుకొని మాయోపాయంతో, పృథ్వీరాజ్ ను బంధిస్తాడు.

17 సార్లు క్షమాభిక్ష పెట్టాడనే విశ్వాసం కూడా లేకుండా పృధ్వీరాజ్ రెండు నేత్రములను "ఘోరీ మహమ్మద్" ఊడబెరికిస్తాడు. ఈ ఉదంతం నుండి మనం ఒక 'నీతి' ని నేర్చుకోవాలి. విశ్వాస ఘాతకునికి, క్రూరునికి, చేసిన మేలును మరచిన వానికి, మూర్ఖునికి, ఉపకారం చేయడం పాముకు పాలు పోసినట్లే అవుతుంది. కనుక విజ్ఞతతో ఆలోచన చేసి సమయ సందర్భాల నవగాహన చేసుకొని పరోపకారబుద్ధిని ప్రదర్శించడం నేర్చుకోవాలి.

చిన్న కధ

యుద్ధంలో గాయపడిన సైనికుడొకడు తన ఊరికి పోతూ చంక కఱ్ఱలతో నచ్చి దారిలో వున్న ఒక గ్రామము సత్రములో దిగినాడు. జబ్బు చేయడంవల్ల కదలలేక ఆ సత్ర ములోనే పడుకొని, సపర్యలు చేసేవారు లేక, మందు ఇచ్చే వారు లేక బాధ పడుచుండెను. ఒకనాడు ఒక పేద బాలిక బడికి పోవుచూ దారిలో నున్న సత్రంలో బాధ పడుతున్న ఆ భటుని చూచి జాలిపడెను. బడినుండి తిరిగి వచ్చే టప్పుడు అతని వద్దకు పోయి ఆదరించి భోజనం నిమిత్తం రెండు డబ్బులు తెచ్చి యిచ్చెను. అదేవిధముగా ప్రతిరోజు సాయంత్రం వానికి రెండు డబ్బులు తెచ్చి యిచ్చు చుండెను. ఆ సైనికునికి ఆశ్చర్యమేసి ఒక రోజు ఆ బాలికను దగ్గరకు పిలిచి "అమ్మాయీ! నీ తల్లి దండ్రులు అతి పేద వారని ఈ రోజునే విన్నాను. ప్రతిదినమూ నా కిచ్చు

డబ్బులు ఎక్కడ నుంచి వస్తున్నాయి? మీ తల్లి దండ్రులకు తెలుసునా? దాచక నిజము చెప్పుము." అని అడిగెను. అప్పుడు ఆ బాలిక "నీవు విచారించ నవసరం లేదు. నేను నీకు యిస్తున్న డబ్బు న్యాయార్జిత మైనదే. మా తల్లి దండ్రులకు కూడా తెలుసును. ప్రతి దినము నేను చదువుకొనుటకు పోవు పాఠశాల త్రోవలో అడివివున్నది. అక్కడ దొరికే రేగిపండ్లను కోసి తీసుకొని వెళ్ళి బాల బాలికలకు అమ్మి డబ్బు సంపాదిస్తున్నాను. ఆ డబ్బులు తీసుకొని వచ్చి యిస్తున్నానే గాని దొంగిలించి తీసుకొని రావడం లేదు" అని చెప్పెను. సైనికుడు ఆశ్చర్యపడి "మీ తల్లి దండ్రులు కొప్పడటం లేదా!" అని అడిగెను. అప్పుడు ఆ బాలిక "ఈ సంగతి నా తల్లి దండ్రులకు బాగా తెలుసును, నన్నేమి అనరు. లోకములో మనకంటే దరిద్రులు చాలామంది వున్నారు. మనకున్న దానిలో కొంత యితరులకు యివ్వడం మంచిదని నాతో ఎప్పుడూ చెబుతుంటారు. అందువల్ల యీ విధముగా చేస్తున్నాను." అని బదులు చెప్పెను. అప్పుడా భటుడు తన కళ్ళ వెంబడి నీరు పెట్టుకొని "ఈ పరోపకార బుద్ధిని నీకు నీ తల్లి దండ్రులకు ప్రసాదించిన ఈశ్వరుడు మీకు శుభము కలుగజేయు గాక!" అని ఆశీర్వదించెను.

ఒక పర్యాయం ఒక గొప్ప ఉద్యోగస్థుడు ఆ గ్రామంగుండా పోతూ తన గుర్రమునకు నీళ్ళు పెట్టుకొనడానికి అదే సత్రము వద్ద దిగి ఆ వ్యాధిగ్రస్తుడయిన సైనికుని చూచి ఆనవాలు పట్టెను. వానివద్దకు వెళ్ళి వివరములు

తెలుసుకొనెను. వాని వలన సమస్తమూ విని ఆశ్చర్యపడి "నిన్నన్నదూ ఎఱుగని ఆ పేద బాలికయే అంత సహాయం చేస్తున్నప్పుడు, నా క్రింద చాలా కాలం పని చేసిన నీకు, నేను సహాయం చేయకుండా వుంటానా ?" అని పలికి, ఆ సత్రపు యజమానిని పిలచి ఆ సైనికుని వ్యాధికుదిరి దేహము స్వస్థత చేకూరువరకు కావలసిన అవసరమైన ధనము ఇచ్చెను. తరువాత ఆ యజమానిని అడిగి ఆ పేద బాలిక ఇంటిని తెలుసుకొని, తిన్నగా అక్కడికి వెళ్ళి తల్లి దండ్రుల వద్ద కూర్చొని వున్న ఆ బాలికను చూచి "అమ్మాయీ! నీ పరోపకార బుద్ధికి నేనెంతో సంతోషించు చున్నాను. వృద్ధుడయిన, ఆ రోగ పీడితుడైన సైనికునికి ఎంతో డబ్బు యిచ్చి సహాయం చేసియున్నావు. ఇదిగో నీకు బంగారు నాణెములను యిచ్చు చున్నాను" అని ఒక సంచి చేతికి యిచ్చెను. అప్పుడు ఆ తల్లి దండ్రులు ఆశ్చర్య పడుతూ "అయ్యా! ఇంత సొమ్ము తీసుకొనుటకు మాకు అర్హత లేదు, మాకు వద్దు బాబూ!" అని చెప్పుచున్నప్పటికి వినక ఆ సంచి నిచ్చి ఆ ఉద్యోగి వెళ్ళిపోయెను. ఈ కథవల్ల మనం ఒక 'నీతి' ని నేర్చుకోవాలి. "బీదవారు సయితము తమకున్న దానిలో యితరులకు చేతనైన సహాయం చేయవలెను. పరోపకారము చేయువారికి ఇహ పరములయందు మేలు కలుగును."

## నిరాడంబరము

ప్రతి వ్యక్తి నిరాడంబర జీవితము గడపటం అత్యావసరం. ఆడంబరం వల్ల వ్యక్తిత్వం ఏమాత్రం అభివృద్ధి చెందదు. ఏ వ్యక్తి అయినాసరే సర్వశక్తి సంపన్నుడైనప్పటికిని మిక్కిలి తెలివి గలవాడైనప్పటికిని, మహా మేధావి అయినప్పటికిని, సకల శాస్త్రములను కూలంకషంగా చదివిన మహా పండితుడైనప్పటికిని - అట్టివానిలో వినయ విధేయతలు లోపించిన యెడల ఏమాత్రం రాణింపదు. పై సుగుణములతో పాటు 'నిరాడంబరత' ను కూడా మంచిగా అలవరచుకుంటే మంచి పేరు ప్రతిష్టలను సంపాదించుకో గలుగుతాడు. అందరిలో గౌరవించబడుతాడు. ఉండవలసిన మంచి లక్షణములు ఏమాత్రం లేకపోయినప్పటికి, కొంతమంది బాగా నటన చేయగలుగుతారు, ఫోజులు కొడతారు. షోకులు చేసుకొని జల్సాగా, ఆడంబరంగాతిరుగుతుంటారు. డాబుసరి కబుర్లు చెప్పుకుంటూ తిరుగుతుంటారు. తమకే బాగా తెలుసునని 'అభినయం' చేస్తుంటారు. ప్రజల్ని మోసం చేసి బ్రతుకుతుంటారు. అట్టి మోసగాండ్రను డాంబికులని, ఆడంబరులని అందరూ అంటారు. అట్టివారిని ఏమాత్రం ఎవ్వరూ గౌరవించరు. "అన్నీ వున్న విస్తరి అణగి మణిగి వుంటుంది. ఏమీ లేని విస్తరి ఎగిరెగిరి పడుతూ వుంటుంది." అది దాని సహజ ప్రవృత్తి, అన్ని హంగులూ, సమర్థత వున్నవారు నిరాడంబరముగానే జీవిస్తుంటారు. ఏమీ శక్తి లేనివాడు ఆడంబరంగా జీవితాన్ని గడపాలని ప్రయ

క్షిస్తూ వుంటారు. తన లోటును బహిర్గతం కానివ్వకుండా ప్రతకాలని తాపత్రయ పడుతూ వుంటారు. చివరికి ఫలితం శూన్యం. "ఆడంబరం, అహంకారం, గర్వం" ఈ మూడు దుర్గుణాలు మానవుని పతనానికే ఉపకరిస్తాయి. కనుక ఆడంబరానికి అవకాశం యివ్వక, అహంకారాన్ని దరికి చేర నివ్వకుండా, గర్వం లేకుండా నిరాడంబరముగా జీవితాన్ని గడపటం ప్రతి ఒక్కరూ నేర్చుకోవాలి. "Simple Living and High Thinking" అతి సామాన్యంగా, నిరాడంబరంగా జీవిస్తూ ఉన్నతములైన, ఆదర్శవంతమైన ఆలోచనలు, భావాలు కలిగి వుండాలి. దానితోపాటు నిర్మలమైన మనస్సును కూడా కలిగివుండాలి. గర్వాన్ని విడనాడాలి. అహంకారమునకు ఏమాత్రం అవకాశం యివ్వరాదు. ఆడంబరం అసలే పనికిరాదు. దర్పానికి తిలోదకాలివ్వాలి. వినయ విధేయతలను అలవరచుకొని, అతి సామాన్యంగా నిరాడంబరంగా జీవితాన్ని గడపడం నేర్చుకోవాలి. "నిరాడంబరతే మానవునికి వెలలేని ఆభరణము."

## భూతదయ

సమస్త ప్రాణికోటియందు దయ, కరుణ కలిగి వుండాలని ముఖ్యంగా భగవద్గీత బోధిస్తున్నది. భగవంతుని యెడల భక్తి కలిగియుండి, జీవరాసుల యెడల ద్వేషము కలిగి వున్నచో ఆ భక్తికి అర్థంలేదు. అది భగవంతుని

ఉపచారము కాదు, అపచారమే అవుతుంది. సమస్త ప్రాణులు భగవత్స్వరూపులే. కనుక ఏ ప్రాణికి అపకారం తలబెట్టరాదు. అనవసరంగా ఏ ప్రాణిని హింసించరాదు. "సర్వ జీవి తిరస్కారః కేశవం ప్రతి గచ్ఛతి" ఏ జీవిని తిరస్కరించినను, బాధించినను భగవంతుని బాధించినట్లే అగును. కనుక సర్వ భూతముల యెడల దయ కలిగి వుండవలెను. "ఎవరుధ్యానం, దైవభక్తి, దైవజ్ఞానములతో పాటు సమస్త ప్రాణుల యెడల ప్రేమ, దయ కలిగి వుంటారో అట్టివారు నన్ను తప్పకుండా పొందుతారు" అని శ్రీకృష్ణుడు అర్జునుకి, చెప్పాడు. కనుక సర్వ భూతదయకూడా పరమోత్కృష్టమైన ధర్మములలో ఒకటి. "నిర్వైరస్సర్వ భూతేషు" అన్నట్లుగా సమస్త ప్రాణులయందు ద్వేషము లేకుండా వుండవలెను. సమస్త ప్రాణులు భగత్స్వరూపులు, నారాయణ స్వరూపులు. మన ధర్మ శాస్త్రములలో ఒక్క మనుజునికే గాక సమస్త ప్రాణికోటికి అత్యున్నతమైన, గౌరవప్రదమైన స్థానం యివ్వబడింది. ముఖ్యంగా భగవద్గీతలో యింకా ఒకమెట్టు పైకి పోయి సర్వ మానవ సౌభ్రాత్రం (Fraternity) తోనే సంతృప్తి చెందరాదని "సర్వాత్మ దృష్టి' ని కూడా అలవరచుకోవాలని బోధించబడింది. ప్రేమయగు దైవ గుణమును మానవుల వరకే పరిమితం చేయక, జంతు జాలముల పైనకూడా విస్తరింప జేయాలని ఈ క్రింది భగవద్గీత శ్లోకం మనకు విశదీకరిస్తున్నది.

"విద్యా వినయ సంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని
శునిచైవ శ్వపాకేచ పణ్డితాః సమదర్శినః"

అనగా విద్యా వినయములు కలిగియున్న బ్రాహ్మణుని యందును, గోవునందును, ఏనుగునందును కుక్కయందును, కుక్కమాంసము వండుకొని తిను ఛండాలుని యందును సమదృష్టి కలవారే (సమముగా చూచువారే) 'జ్ఞానులు' అని చెప్పబడెను.

ఈ శ్లోకం అత్యున్నతమైన విశాల భావమును ప్రోత్సహిస్తున్నది. ఉత్తమ, మధ్యమ, అధమ తారతమ్యములు లేకుండా, ఉచ్చ, మధ్య, నీచ భావములకు తావివ్వకుండా సర్వ భూతముల యందు సమభావం, సమదృష్టి కలిగి వుండాలని బోధిస్తున్నది. ఉత్తమ తరగతికి చెందిన విద్యా వినయ సంపన్నుడైన బ్రాహ్మణుని, కుక్క మాంసం తిని బ్రతికే ఛండాలుని అట్లే ఉత్తమ జాతికి చెందిన గోవును, అధమ తరగతికి చెందిన కుక్కను సమ దృష్టితో చూడాలని చెప్పబడినది. మన దేశంలో తప్ప ప్రపంచంలో మరెక్కడా యింతకన్నా మించిన సాంఘిక న్యాయం (Social Justice) కనుపించక పోవచ్చును. ఇటువంటి అత్యున్నతమైన "తత్వజ్ఞానం" (Philosophy) కూడా మరెచటా లేదేమో! అయితే ఈ విషయంలో కూడా వివేకం, విజ్ఞత ప్రదర్శించాలి. "సర్వభూతదయ" అన్నారు గదా యని ఛాదస్తంగా మాత్రం ప్రవర్తించరాదు, పంటలను ధ్వంసం చేసేటటువంటి క్రిమి కీటకాదులను కూడా సంహ

...ించరాదనే తప్పుడు నిర్వచనం మాత్రం యివ్వరాదు. అసలు పంటలు పండు తేగ దామాన వావళి మనుగడవుండేది. అందుకని అనవసరంగా మాత్రం ఏజీవినిహింసించరాదు. ఒక వేళ ఏ జీవినయినా సరే హింసిస్తే లేక సంహరిస్తే ఎక్కువ ప్రయోజనం కనుక వుండేట్లయితే అది చేయరాని పని అని సంకోచించరాదు. అధర్మమని భావించి వెనుకాడరాదు. ప్రతివారు, ప్రతి సందర్భంలో ఉత్తమ ధర్మమేదో విజ్ఞతతో నిర్ణయించుకొని సమాజాభివృద్ధికి అవసరమయ్యే విధంగా ప్రవర్తించాలి. ఏ కారణం లేకుండా, ఏదో ఒక కుంటి సాకు చూపించి ప్రాణులను మాత్రం హింసించరాదు. సమాజ శ్రేయస్సు అన్నిటి కన్నా ఉత్తమ ధర్మం. దానిని దృష్టిలో పెట్టుకొని నడవాలి. స్వార్థంతో సంకుచితత్వంతో స్వలాభ దృష్టితో అన్యాయంగా అక్రమంగా ప్రాణులను మాత్రం హింసించరాదు, సమస్త ప్రాణుల యెడల ప్రేమ, దయ, కరుణలు విస్తరింప జేయడం ఆదర్శ మానవుని అత్యున్నతమైన ఆశయం, ఆదర్శం అయివుండాలి.

## శుచిత్వము

శుచిత్వ మనగా పరిశుభ్రత. ఇది ప్రతి వ్యక్తికి అత్యావసరంగా వుండవలసినదే. ఈ శుచిత్వం రెండు రకములు, 1. బాహ్య శుభ్రత, 2. అంతః శుభ్రత. వీటిలో ఏ ఒకటి లోపించినా ఆ వ్యక్తి ఎందుకూ పనికిరాకుండా

పోరాదు. శరీరము, ధరించు వస్త్రములు, చదువు కొను పుస్తకములు మరియు పరిసర ప్రదేశములు – ఇవన్నియూ బాహ్య శుభ్రత క్రిందకు వస్తాయి. ప్రతి వ్యక్తి వీటిని పరిశుభ్రంగా వుంచుకొనవలెను. ప్రతిరోజు శుభ్రంగా తోము కొని స్నానం చేయాలి. గజ్జి, తీట, తామర మొదలగు అంటు వ్యాధులను దరికి చేరనివ్వకుండా చూచుకోవాలి. మురికి వస్త్రములను ధరించరాదు. వస్త్రములను మాపుకొనకుండా పరిశుభ్రంగా వుంచుకోవడం నేర్చుకొనాలి, మంచిగా తెల్లగా ఉతికిన వస్త్రములను మాత్రమే ధరించాలి. చదువు కొను పుస్తకములను, నోట్సులను మాపకుండా, చింపమండా పరిశుభ్రంగా వుంచుకొనాలి. పరిశుభ్రంగా వుండే బాల బాలికలను అందరూ మెచ్చుకుంటారు. ఉపాధ్యాయులు కూడా అట్టివారినే ప్రేమిస్తారు. పరిసరములనగా నివశించే గృహం. చుట్టు ప్రక్కల నున్న స్థలమును ఎప్పటి కప్పుడు శుభ్రంగా వూడ్చి కడిగి చెత్తా చెదారం లేకుండా మంచిగా వుండేట్లుగా చూచుకొనాలి. "ఇంటిని చూచి ఇల్లాలిని చూడు" అనే సామెత కూడా కలదు. అనగా ఇంటిని, పరసరములను పరిశుభ్రంగా వుంచే ఇల్లాలు, పరిశుభ్రంగావుండి వుంటుందని అభిప్రాయం. "ఆరోగ్యమే మహా భాగ్యం" అన్నారు పెద్దలు. ఎంత సంపద వున్నప్ప టికి ఆరోగ్యం గనుక సరిగా లేకపోతే ఏమీ ప్రయోజనం లేదు. ఆ సంపదను తనివితీరా అనుభవించలేడు. తింటే ఆయాసం, తినకపోతే నీరసం, అట్టివారికి సుఖమూ వుండదు.

ఆనందం అంతకన్నా వుండదు. కనుకనే పెద్దలు అన్నిటికన్నా మిన్నగా ఆరోగ్యమునకు ప్రథమ స్థానమిచ్చారు.

ఇకపోతే రెండవది అంతఃశుభ్రత. అనగా లోపల నున్న మనస్సును కూడా ప్రశాంతంగా, నిర్మలంగా, స్వచ్ఛంగా వుంచుకోనాలి. అట్టివారి భావాలు మాత్రమే ఉన్నతంగా, సౌమ్యంగా వుంటాయి. ఎదురవుతున్న సమస్యలను ప్రశాంత వాతావరణంలో ఆలోచించి సక్రమమైన నిర్ణయములను గైకొన గలుగుతారు. అట్లుగాక మనస్సు మలినమైతే భావాలుకూడా మలినములౌతాయి, చెడు తలంపులు బయలుదేరుతాయి. మనస్సు కలుషిత మవుతుంది. అప్పుడు కామ, క్రోధ, మదమాత్సర్యములకు మనస్సు నిలయమవుతుంది. దుర్మార్గుడై ఎందుకూ పనికిరాని మూర్ఖుడవుతాడు. బయిట చూడటానికి ఎంతో పరిశుభ్రంగా వుండి, లోపల మనస్సు మాత్రం మలినమై వుంటే ప్రయోజనం శూన్యం. మురికి యందున్నవారికి సహజంగా నీచమైన భావాలే కలుగుతుంటాయి. విశాల భావములు అబ్బవు. కనుక బయిటవున్న మురికిని, లోపలనున్న మలినాన్ని రెంటిని శుభ్రంగా కడిగివేయవలెను. బాహ్య శుభ్రతతో పాటు అంతః శుద్ధత్వము కూడా ఉండవలెను. "కోమలమైన హృదయం, స్వచ్ఛమైన మనస్సు, పరిశుభ్రమైన శరీరం ప్రతి ఒక్కరూ కలిగి వుండాలి." అట్టివారు మాత్రమే ఉత్తమాధి పత్యమునకు అర్హులవుతారు. అట్టి వారినే సమాజం గౌరవిస్తుంది. ప్రేమిస్తుంది.

## పట్టుదల

పట్టుదల ప్రతి వ్యక్తియందు వుండి తీరవలసిన చక్కటి ఆయుధము. ఈ పట్టుదల మంచి విషయములను సాధించడంలో మాత్రమే వుండాలి. చెడ్డకోరికలను నెరవేర్చుకొనడంలో మాత్రం వుండరాదు. చెడ్డ విషయాల కోసం పట్టుబట్టడం మొండిపట్టుదల క్రిందకు వస్తుంది. మొండి పట్టుదల మానవుడ్ని పతనం చేస్తుంది. కనుక దీనిని మాత్రం దరికి చేరనీయరాదు. పట్టుదల లేని వ్యక్తి, ఏ ఆశయమును సాధించలేడు, లక్ష్యాన్ని చేరలేడు, విజయలక్ష్మిని చేబట్ట లేడు. ప్రతి వ్యక్తికి "ఉత్తమమైన ఆశయం, ఉన్నతమైన ఆదర్శం, పవిత్రమైన లక్ష్యం" వుండాలి, వాటిని సాధించేందుకు మంచి 'పట్టుదల' కూడా వుండాలి. సాధించేంత వరకు విశ్రమించరాదు. అవిరామంగా నిరంతర కృషి అత్యావసరం. ముఖ్యంగా విద్యార్థుల ఆశయం. విద్యా విజ్ఞానాదులను సముపార్జించడం. వారికి సంతృప్తి అసలే వుండరాదు. ఏదో విధంగా ప్యాసు మార్కులు తెప్పించుకుంటే చాలులే అని సంతృప్తి పడరాదు. ఒక పరీక్షలో కన్నా మరొక పరీక్షలో ఎక్కువ మార్కులని తెప్పించుకొనాలనే పట్టుదల వుండాలి. మనకంటే అధికులతో, బాగా మార్కులు వచ్చే వారితో పోటీపడాలి. మన దేశంలోనే గాక, ప్రపంచంలోనే ఒక ప్రముఖ విద్యావేత్తగా, శాస్త్రజ్ఞుడుగా మంచి పేరు తెచ్చుకొనాలనే ఆకాంక్ష, పట్టుదల వుండాలి.

అల్పదృష్టి పనికిరాదు. ఆశయం ఎప్పుడూ ఉన్నతమైనదిగా వుండాలి.

"Low Aim is Crime" 'నీచమైన లక్ష్యమే నేరము' అని పెద్దలు, అనుభవజ్ఞులు ఏనాడో చెప్పారు. కనుక ఊర్ధ్వ దృష్టి, ఉన్నతమైన లక్ష్యం, విశాల భావం కలిగివుండాలి. "Look up, Aim High" 'పైకి చూడుము, పైకి గురి పెట్టుము' ఇదే మన ఆశయం. ఉన్నతమైన ఆదర్శము, దృఢమైన నిశ్చలమైన మనస్సు, ఎటువంటి పరిస్థితులలోను సాధించి తీరగలననే ఆత్మ విశ్వాసం, మనం చేబూనిన పని యందు నమ్మకం, సాధించి తీరాలనే పట్టుదల ప్రతి వ్యక్తి యందూ వుండాలి. ఒక్క భౌతిక విషయాలను సాధించడం లోనే తృప్తి చెందక, ఆధ్యాత్మిక ఔన్నత్యాన్ని కూడా పొందడానికి పట్టుదలతో కృషి చేయాలి.

## ధైర్య సాహస బల పరాక్రమాదులు

ఈ నాల్గు సద్గుణములు ప్రతి వ్యక్తి యందు వుండి తీరవలెను. అందులో ముఖ్యముగా కార్య సాధకునికి అత్యావసరం. ఏ వ్యక్తి అయినా సరే మంచి తెలివి గలవాడై నప్పటికీ, సకల శాస్త్రములను సాకల్యముగా పఠించిన మహా మేధావి అయినప్పటికి పై నాల్గు సద్గుణములు లేని యెడల అతడు ఏ మాత్రం రాణించడు. ఏ పనిని సాధించవలెననినా ధైర్యం ప్రధానంగా వుండాలి. ధైర్యమే ఏ ప్రయత్నాని

కైనా మూలం, అధైర్యం అన్ని ప్రయత్నాలకు అవరోధం. ధైర్యవంతుడు ఒక్క పర్యాయం మాత్రమే మరణిస్తాడు. అధైర్యవంతుడు అనగా భీరువు జీవితంలో అడుగడుగునా మరణిస్తూనే వుంటాడు. పిరికివాడు, బలహీనుడు సమాజానికి చీడపురుగు లాంటివాడు. ''దేవో దుర్బల ఘాతకః'' భగవంతుడు కూడా బలహీనులనే సంహరిస్తాడు. సాధారణముగా బలవంతుల జోలికిపోడు. బలహీనుల వల్లనే శాంతికి విఘాతకం కల్గుతుంది. పెద్ద చేప చిన్న చేపను మ్రింగివేస్తుంది. బలవంతుడు బలహీనుడ్ని హింసిస్తాడు. బలమైన శక్తివంతమైన, సంపన్నమైన దేశం, ప్రక్కనే వున్న బలహీనమైన దేశమును కబళించి వేయాడానికి ప్రయత్నిస్తుంది. డబ్బుతో మదించిన దురహంకారి పేదవాడిని పీడిస్తాడు. పెద్దపులి చిన్న జంతువులను, మనుష్యులను తేలికగా మ్రింగివేస్తుంది. సర్కస్‌లో నున్న పెద్దపులి మాత్రం 'రింగ్ మాష్టరు' ను చూస్తే జడుస్తుంది. బోనులో నుంచి బయటకు రమ్మంటే వస్తుంది. రింగ్ మాష్టర్ ఏమి చెబితే అది చేస్తుంది. ఎదురుగా నున్న మేకను గట్టిగా వాసన చూడటానికి కూడా భయపడుతుంది. కారణం ? రింగ్ మాష్టర్ చేతిలో నున్న 'హంటర్' అంటే దానికి భయం. అదే రింగ్ మాష్టర్ తన చేతిలో నున్న 'హంటర్' ను అవతల పారివేసిన యెడల ఎదురుగా నున్న మేకను, రింగ్ మాష్టర్ని, ప్రేక్షకులను నిర్దాక్షిణ్యంగా, సునాయసంగా మ్రింగివేస్తుంది. కనుక శక్తిని బలమును చూచి ఎంతటి క్రూరజంతువైనా భయపడి తీరుతుంది.

అదే విధముగా సాహసంతో ఎంతటి పెద్ద కార్యములైనా సాధించవచ్చును. సాహసం లోపిస్తే సునాయసంగా అయ్యే పనులను కూడా సాధించలేము. సాహసంతో పాటు పరాక్రమం కూడా వున్నవానికి ఎదురే వుండదు. వీటిని పొందాలంటే శారీరక విద్యలను నేర్చుకోనాలి. శరీరం ఆరోగ్యంగా, పుష్టిగా, బలంగా వున్నప్పుడే పరాక్రమ సంపన్నుడవుతాడు. దానితో పాటు సాహసం వస్తుంది, కనుక ప్రతిరోజు వ్యాయామము చేసి శరీర ఆరోగ్యమును కాపాడుకోనాలి. బలం, శక్తి, పరాక్రమము వున్నవానికి సాహసం, ధైర్యం వస్తుంది. బలం వున్నది కదాయని యితరులతో అనవసరంగా పోట్లాడరాదు. చెడు కోరికలను నెరవేర్చుకొనడానికి ఆశక్తిని దుర్వినియోగం చేయరాదు. చెడ్డవారిని దండించడానికి, మంచివారికి సహాయ పడటానికి మాత్రమే అట్టి శక్తిని వినియోగించాలి. అట్టి మంచి శక్తిని చూచి చెడ్డవారికి భయం, మంచివారికి ఆనందం కలగాలి, "కేవలం భౌతిక శక్తి మీద, బలం మీద ఆధారపడరాదు. ఆధ్యాత్మిక బలమును కూడా ప్రతి ఒక్కరూ సంపాదించాలి. మానసిక బలాన్ని పెంపొందించుకోనాలి."

విశ్వామిత్రుడు మొదట కేవలం తన శారీరక బలం మీదనే ఆధారపడి బ్రహ్మర్షి అయిన వశిష్టునితో యుద్ధానికి దిగాడు. బ్రహ్మతేజో బలం గల వశిష్టుని ముందు, విశ్వామిత్రుని అస్త్రశస్త్రములన్నీ వృధా అయిపోయినాయి. అప్పుడు విశ్వామిత్రుడు బ్రహ్మ బలం యొక్క దైవశక్తిని

గమనించి 'బ్రహ్మ బలమే బలము, దైవ బలమే బలము'' అని గుర్తించి, ఒక్క భౌతిక శక్తిని నమ్ముకొనినందు వల్ల ప్రయోజనం లేదని భావించి, తీవ్ర సాధనలను గావించి, బ్రహ్మ బలమును పొంది 'బ్రహ్మర్షి' అయినాడు. కనుక ప్రతి ఒక్కరూ ''భౌతిక శక్తితో పాటు, దైవ శక్తినికూడా సంపాదించి తీరాలి.'' ఈ నాల్గు సద్గుణములతో పాటు ఉత్సాహం కూడా వుండాలి. ఉత్సాహం లేనివాడు మన్ను తిన్న పాములాగే బద్ధకంగా ఒక ప్రక్కనపడి వుంటాడు. ధైర్యము సాహసము బలము (శక్తి), పరాక్రమము, ఉత్సాహములతో పాటు సద్బుద్ధి' కూడా వుండి వుంటే, అటువంటి వారికి అపజయమంటూ వుండనే వుండదు. మహాభారత యుద్ధంలో అస్త్ర సన్యాసం చేసిన అర్జునునికి శ్రీకృష్ణుడు మొట్ట మొదట ధైర్యమును, నిర్భయమును ప్రభోదించి ఉత్సాహపరిచాడు. 'క్లైబ్యం మాస్మగమః పార్థ!' "ఓ అర్జునా అధైర్యమును పొందకుము' అని హెచ్చరించాడు. స్వామి వివేకానంద కూడా ''Be Fearless'' అను నిర్భయ మంత్రమును ప్రపంచానికి చాటాడు. దుర్బలత్వమే మహా పాతకమని చెప్పాడు. సుగుణములలో ధైర్యము, నిర్భయత్వము చాలా ప్రధానములైనవి. ఎచట ధైర్యము, ఉత్సాహము, ఆనందములు తాండవిస్తుంటాయో అచట పరమాత్మ వుంటాడని, ఎచట పిరికితనం, దిగులు, దౌర్బల్యము లకు నిలయమవుతుందో అచట దయ్యములు కాపురముంటాయని పెద్దలు చెబుతున్నారు. శాస్త్రములు కూడా యిదే వాస్త

వాన్ని ప్రబోధిస్తున్నాయి. ఇదే విషయాన్ని ఈ క్రింది శ్లోకం కూడా గుర్తు చేస్తున్నది.

"ఉత్సాహస్సాహసం ధైర్యం బుద్ధిశ్శక్తిః పరాక్రమః
షడేతే యత్ర తిష్ఠన్తి తత్ర దేవస్సహాయకృత్"

అనగా "ఉత్సాహం, సాహసం, ధైర్యం, సద్బుద్ధి శక్తి, పరాక్రమము అను యీ ఆరు సద్గుణములు ఎవరి వద్ద వుండునో వారి వద్ద దైవము సహాయము చేయువాడై వుండును" అని అర్థం.

కనుక పై ఆరు సద్గుణములున్న వారు యిక భయ పడనవసరం లేదు. అటువంటి వారికే భగత్సహాయం లభిం చును. ఏ రంగలో ప్రవేశించినా, అటువంటి వారికి విజయం తప్పకుండా చేకూరును. ఆటువంటివారు ఎంతటి అసాధ్య మైన పనినైనా సునాయసంగా సాధించి తీరగలరు. కనుక పట్టుదలతో, శ్రద్ధతో పై సుగుణములను ప్రతి ఒక్కరు తన జీవిత కాలంలో సాధించి తీరవలెను.

ఓం రుష్ట్రి, ఓం రిమ్

ప్రతి వ్యక్తి తన జీవితంలో ఈ సద్గుణాన్ని సాధించి తీరవలెను. ఇది చదువు కుంటే వచ్చేది కాదు, గురువు బోధిస్తే అబ్బేది కాదు, బజారులో లభ్యమయ్యే వస్తువు అంతకన్నా కాదు. నిరంతర సాధనవల్ల మాత్రమేదీనిని సాధించవచ్చును. అంత తేలికగా అందరికి అందుబాటులో

వుండదు. ఈ సద్గుణమునకు పరీక్షా సమయం ముఖ్యంగా కష్టకాలం. కష్టములు దాపురించి నప్పుడు. దుఃఖములు కలిగినప్పుడు, బాధలకు లోనైనప్పుడు సహజంగా మనిషి నిజ స్వరూపం బహిర్గతమవుతుంది. అతనిలో సహజ సిద్ధంగా అంతర్భూతంగా దాగివున్న బలహీనతలు బయటపడుతాయి. అటువంటి విపత్కర పరిస్థితులలో కూడా ఏమాత్రం చలించక, అధైర్య పడక ఓర్పుతో తనను తాను నిగ్రహించుకొని ఓర్మిని ప్రదర్శించి, తనున్న స్థాయినుండి దిగజారకుండా ఆత్మవంచన చేసుకొన కుండా, హుందా తనంగా, గౌరవ మర్యాదలకు భిన్నం కాకుండా వ్యవహరించడం విజ్ఞుల లక్షణం. ఓర్పు ఓర్మి సహనములను కోల్పోయినట్లయితే ఎంతో కాలం శ్రమించి, కష్టించి, కృషి చేసి సంపాదించిన మంచిపేరు ప్రతిష్ఠలు ఒక క్షణంలో భస్మీపటలం అయిపోతాయి. సంపాదించడం ఒక ఎత్తు, దానిని నిలబెట్టుకోవడం మరొక ఎత్తు. ఈ సద్గుణములు లోపించినందు వల్లనే ఎంతో మంది మహా తపఃసంపన్నులు ఎందుకూ పనికి రాకుండా పతనమైపోయారు. రాజాధి రాజులు తమ రాజ్యములను సహితం కోల్పోయినారు. పండితులు భ్రష్టులై పోయినారు. ఏదైనా ఒక సమస్య ఉత్పన్న మైనప్పుడు ఎంతో చాకచక్యంగా వ్యవహరించడం నేర్చుకోవాలి. ఓర్పుతో దాని లోతుపాతులను ఆమూలాగ్రం తెలుసుకొనాలి. ఓర్మిని ప్రదర్శించి, సహనంతో పరిశీలించి దానిని సక్రమంగా పరిష్కరించాలి. తొందరపాటు ఏమాత్రం పనికి రాదు. తొందరపాటు వల్ల సఫలీకృతం అయ్యే కార్యాలు

కూడా చెడిపోయే ప్రమాదం వున్నది. ఎదుటి వ్యక్తి ఉద్రేకంతో, కోపంతో మాట్లాడుతున్నప్పటికీ మనం మాత్రం తొందర పడకూడదు. సహనంతో, ప్రశాంతంగా వినడం నేర్చుకోవాలి. 'భర్తృహరి' క్షమను కవచంతో చక్కగా పోల్చాడు. క్షమ అనగా ఓర్పు. అవమానాదులు సంభవించినప్పుడు, కష్టం వల్ల దుఃఖము కలిగినప్పుడు కోపతాపములకు ఎట్టి అవకాశం యివ్వకుండా, ఈ "ఓర్పు" అనే సద్గుణం అడ్డుగోడలావుండి మానవుణ్ణి రక్షిస్తుంటుంది. 'ఓర్పు' అనే కవచంగల వ్యక్తిని భౌతికమైన కష్టములు ఏమీ చేయలేవు. మనలను ఎవరయినా ఏమన్నా, చులకనగా మాట్లాడినా, పరుషంగా తిట్టినా—మనకు పోయేది ఏమీ లేదు. అంతమాత్రమున మన విలువ ఏమాత్రం తగ్గదు. కాని మన కుండవలసినది "ఓర్పు". అది కనుక మనకుంటే, మనలను ఎవ్వరూ ఏమీ చేయలేరు. కనుక అటువంటి అభేద్యమైన క్షమా కవచమును ప్రతి ఒక్కరూ సంపాదించి తీరాలి. చెప్పడం తేలికే కాని ఆచరించడం మాత్రం బహుకష్టం. ఎంతో సాధన, ఏకాగ్రత, పట్టుదల వుంటే గాని యీ సద్గుణములు అబ్బవు, సాధించి సంపాదించిన వారికి యింకా ఎట్టిభయమూ వుండదు. కనుక ఈ సద్గుణములు సంపాదించడానికి ప్రతి ఒక్కరూ తీవ్ర కృషి సల్పాలి.

## అసూయ, ద్వేషం

ఈ అసూయా ద్వేషములు రెండూ తోడు దొంగలు. వేరు పురుగులాంటివి. నవనవ లాడుతూ పెరిగి పూత పూసి, కాయలు కాస్తున్న చెట్లను, ఏ విధముగా వేరు పురుగు కుదుట్లో చేరి, ఆ చెట్టును ఏ విధముగా సర్వనాశనం చేస్తుందో, అదే విధముగా ఈ 'అసూయా ద్వేషాలు' అనే తోడు దొంగలు మనిషిలో ప్రవేశిస్తే, అంతటితో ఆ వ్యక్తి పతనం కావడం ఖాయం. ఎన్నో సంవత్సరముల నుంచి సాధించి సంపాదించిన సద్గుణములన్ని తృటిలో బూడిదపాలై పోతాయి. ఈర్ష్య కంటే పరమ శత్రువు మరొకటి లేదు. వీటన్నిటి స్వరూపాలు కడు విచిత్రంగా వుంటాయి. ఎట్టి ప్రయోజనమును ఆశించకుండానే యివి తమ పనులను చేసు కుంటూ పోతుంటాయి. వాటికి లొంగిన మరుక్షణంలోనే మనిషి పతనమవుతాడు. తనకన్నా మంచి మార్కులు వచ్చే వాడిని చూచి ఓర్వ లేక పోవడం, తన కన్నా తెలివి గలవాడని చూచి ఈర్ష్య పడటం, సుఖంగా, హాయిగా ఎట్టి కలతలూ లేకుండా ఐకమత్యంగా బ్రతుకున్న పండంటి సంసారమును చూచి అసూయపడటం, తనకన్నా ఉన్నత స్థాయిలో నున్న వార్ని ద్వేషించడం లాంటి అవాంఛనీయ మైన దుర్గుణములకు ఏమాత్రం అవకాశ మివ్వరాదు. వాటికి అవకాశం యిచ్చినవారికి ఎప్పుడో ఒకప్పుడు పరాభవం తప్పదు. కనుక ప్రతివ్యక్తి వీటికి దూరంగావుండటం నేర్చుకో నాలి. విశాలభావమును అలవరచుకోనాలి. మనకన్నా తెలివి

గలవారిని చూచి సంతోషించాలి గాని అసూయ చెందరాదు. పట్టుదలతో, ఉత్సాహంతో యింకా ఎక్కువ మార్కులను తెచ్చుకోవాలనే కుతూహలం వుండాలి. ప్రతి వ్యక్తిలో ''Sportive Spirit'' వుండాలి. ''ఆత్మస్తుతి పరనింద'' కూడా ఈ కోవకు చెందినవే. ఎంతసేపటికీ తన గొప్పతనాన్ని తానే చాటుకోవడం, తనను తానే పొగడుకోవడం, ఇతరులను గురించి కించపరచే విధముగా మాట్లాడటం, ఎందుకూ పనికిరాని వారని నిందించడం లాంటివి కూడా చెడుగుణాలే. ఈ దుర్గుణాలు అభివృద్ధికి ఆటంకం. కనుక సాధకుడు ఈ దుర్గుణములను దరికి చేరనివ్వరాదు.

ఇంత వరకూ అనుభవజ్ఞులు, శాస్త్రజ్ఞులు ప్రబోధించిన అనేక సద్గుణములు వ్రాసాను, కాని ఒక్క దుర్గుణం (అసూయ ద్వేషం) గురించి మాత్రమే ప్రస్తావించాను. బండెడు కట్టెలు సహితం ఒక్క చిన్న నిప్పు రవ్వతో భస్మీపటలం కాగలవు. ఒక చిన్న విషపు బొట్టుతో కడివెడు పాలు ఎందుకూ పనికి రాకుండా పాడైపోతాయి. అదేవిధముగా మానవునిలో ఎన్ని సద్గుణములున్నా ఒక్క దుర్గుణం కనుక చేరితే చాలు, ఎందుకూ పనికిరాకుండా నాశనమై పోతాడు. కనుక ఈ జీవన రంగంలో బహుజాగ్రత్తగా మసలుకోవడం నేర్చుకోవాలి. 'సోమరితనం, అహంకారం, క్రోధం, స్వార్థం, లాంటి దుర్గుణములను కూడా దరికి చేరనీయరాదు. పిల్లలను అతి త్వరగా, సులువుగా వలలో వేసుకొనే దుర్గుణం కూడా మరొకటి వున్నది. 'చాడీలు, కొండెములు' చెప్పడం. ఇటు

వంటి చెడు అలవాట్లు సహజంగా చాలా మంది పిల్లలలో వుంటాయి. వీటిని కూడా దరికి చేరనీయరాదు. మంచి పేరు తెచ్చుకోవడం చాలా కష్టం. చెడ్డపేరు ఒక క్షణంలో వస్తుంది. కష్టం అయినప్పటికి ప్రతి ఒక్కరూ మంచి పేరును సంపాదించుకోవడానికే ప్రయత్నించాలి. "ఆత్మవిశ్వాసాన్ని పెంపొందించుకోవాలి, అహంకారాన్ని త్రుంచివేయాలి, స్వార్థ సంకుచితత్వాలకు స్వస్తి చెప్పాలి, విశాల భావాన్ని అలవరచుకోవాలి, క్రోధానికి వీడ్కోలు, శాంతికి స్వాగతం పలకాలి, దుర్బలత్వానికి త్రిలోదకాలిచ్చి ధైర్యానికి ఆహ్వానం చెప్పాలి, అసూయా ద్వేషములను దరికి చేరనీయరాదు, నిర్భయత్వాన్ని అలవరచుకోవాలి" ఇవే ఈ నాటి భావి భారత పౌరులు నేర్చుకోనవలసిన సద్గుణములు, విసర్జించవలసిన దుర్గుణములు.

మన శాస్త్ర ఇతిహాస పురాణములలో వున్న కొన్ని అత్యున్నతమైన, ఆదర్శవంతమైన, నీతి విషయములను ఈ అధ్యాయంలో ప్రస్తావించాను. వట్టి శాస్త్ర జ్ఞానం వల్లనే మానవుడు ఉద్ధరించబడడు. శాస్త్రముల నుండి నేర్చుకొనిన జ్ఞానమును ఆధారం చేసుకొని, స్వబుద్ధి నుపయోగించి, వాటి ననుభవంలోనికి తెచ్చుకొని మానవ కళ్యాణమునకు ఉపయోగించడం నేర్చుకోనాలి. అదియే నిజమైన విద్య. అట్టిదే నిజమైన జ్ఞానం, దానినే విజ్ఞాన మంటారు. అట్టి విజ్ఞాన స్వరూప స్వభావములను గురించి మూడవ అధ్యాయంలో వివరిస్తాను.

# వివేకవాణి

## తృతీయ భాగము

## "విజ్ఞానము"

# విజ్ఞానము

ద్వితీయ అధ్యాయంలో జ్ఞానం యొక్క స్వరూప స్వభావములు వివరించబడినవి. ఒక్క జ్ఞానం వల్లనే ప్రయోజనం లేదు. ఒక్క శాస్త్ర జన్యజ్ఞానం మాత్రమే మానవ పురోభివృద్ధికి సరిపోదు. ఈసందర్భమున కీ. శే. పండిత నెహ్రూ అభిప్రాయములు తెలుసుకోవడం ఎంతయినా అవసరం "Knowledge without action is Abortion, Action without knowledge is Foolishness". 'కార్యాన్ని సాధించలేని జ్ఞానం నిష్ప్రయోజనం, జ్ఞానరహితమైన కార్యం (పని) మూర్ఖమైనది' అని నెహ్రూజి చెప్పారు. కనుక చక్కని జ్ఞానంతో పాటు ప్రజోపకారము కొఱకు విజ్ఞానమును కూడా ప్రతి ఒక్కరూ సంపాదించి తీరాలి. శాస్త్రాధ్యయనం వల్ల లభించిన పరోక్ష జ్ఞానమగు పాండిత్యము పరులకు బోధించడానికి మాత్రమే ఉపయోగ పడుతుంది. కేవలం శాస్త్ర జన్య జ్ఞానము మాత్రమే మానవుని ఉద్ధరించదు. దీనికి తోడు విజ్ఞానమును కూడా సముపార్జించినప్పుడే మానవుని జీవితం సఫలమవుతుంది. విజ్ఞానము యొక్క స్వరూపం మూడు రకములుగా వుంటుంది. ACC NO - 3071

1. అనుభవ జ్ఞానం 170
2. వివేక జ్ఞానం KRI BM. 5200
3. లౌకిక జ్ఞానం (ప్రపంచ జ్ఞానం)

విజ్ఞానం లేని విద్య రాణించదు. అనుభవం లేని చదువు, వివేకము లేని విజ్ఞానం, లౌకికం లేని మనిషి, విచక్షణ లేని పని, విజ్ఞత లేని పాండిత్యం, అర్హత లేని అధికారం, స్వేచ్ఛ లేని స్వాతంత్ర్యం, సత్యము లేని వాక్కు, మాధుర్యం లేని సంగీతం, విశ్వాసం లేని యజమాని, కృతజ్ఞత లేని సోదరులు, చేసిన మేలును మరచిన మిత్రులు, విశ్వాసఘాతుకులైన బంధువులు, క్రమశిక్షణ లేని సమాజం, దేశభక్తి లేని రాజకీయాలు, శీలం లేని మనిషి, భక్తి లేని పూజ, వినయం లేని విద్యార్థి, విద్యా బోధన చేయలేని ఉపాధ్యాయుడు, సభ్యులను మెప్పించ లేని ఉపన్యాసకుడు, పరిపాలన చేయలేని ప్రభుత్వం వల్ల ఏమాత్రం ప్రయోజనం లేదు - శ్రమతప్ప ఫలితం శూన్యం.

విజ్ఞాన స్వరూపాలను మూడింటిని విడివిడిగా పరిశీలిద్దాం.

## అనుభవజ్ఞానం
## (Practical Knowledge)

శాస్త్ర జన్య జ్ఞానంతో పాటు ప్రతి ఒక్కరూ అనుభవ జ్ఞానమును కూడా సంపాదించి తీరాలి. అనుభవం లోనికి రాని విద్యా విజ్ఞానాదుల వల్ల ప్రయోజనం ఏమీ వుండదు. మనలో నిలకడగా నిల్వవున్న జ్ఞానం వృథా. అది వట్టి పాండిత్యంగా మాత్రమే నిలచిపోతుంది. దానిని

అనుభవంలోనికి తీసుకొని రావడంలోనే వున్నది గొప్పతనం. ధనమును సంపాదించి దాచి పెట్టినందువల్ల ప్రయోజనం లేదు. దానిని అనుభవించునప్పుడు, లోక కళ్యాణమునకు సద్వినియోగం చేసి నప్పుడే దాని సార్థకత. అట్లే వివిధ పుస్తకములలోని జ్ఞానమును సంపాదించినంత మాత్రమున ప్రయోజనం లేదు. దానిని అనుభవంలోనికి తెచ్చుకొని, లోక కళ్యాణమునకు వినియోగించి నప్పుడే దానికి కూడా సార్థకత వుంటుంది. అయితే ఇట్టి అనుభవమును పొందుట ఎట్లా ? ఇట్టి అనుభవ జ్ఞానమును పొందవలెనని మూడు దశలను దాటవలెను.

1. జ్ఞాతుం (తెలుసుకొనుట)

2. ద్రష్టుం (చూచుట)

3. ప్రవేష్టుం (ప్రవేశించుట)

ఒక్కొక్క దానిని వివరిస్తాను.

1. జ్ఞాతుం : మొట్టమొదట శాస్త్రములలో నున్న అమూల్యమైన విషయాలను గురించి, ప్రపంచ విశేషాలను గురించి గురువులు ద్వారా లేక అనుభవజ్ఞుల ద్వారా తెలుసుకొనవలెను. తెలుసుకొనుట వలన వాటియందు సహజంగా ఆసక్తి జనిస్తుంది, వాటిని ఏమైనా సరే చూచి తీరాలనే కోరిక ఉద్భవిస్తుంది.

2. ద్రష్టుం : రెండవ దశలో ఆటువంటి శాస్త్రి ములు, విశేషాలు ఎక్కడెక్కడ వున్నవో పరిశీలనచేసి

చూచి సేకరిస్తాం. ప్రత్యక్షంగా చూస్తాం, చదువుతాం, కంఠస్థం చేస్తాం, ఎంతో పట్టుదలతో ఆమూలాగ్రం చదువుతాం, అవగాహన చేసుకుంటాం, ఆనందిస్తాం. అంతటితో కొంతవరకు ఆత్మ సంతృప్తి కలుగుతుంది. కొన్ని అమూల్యమైన విషయాలను తెలుసుకున్నామనే సంతృప్తి కలుగుతుంది. శాస్త్రజ్ఞానం లభిస్తుంది.

3. ప్రవేష్టుం : పై రెండు దశలతో సంతృప్తి చెందుతే ప్రయోజనం లేదు. సాధకుడు తెలుసుకొనడంలో మాత్రమే సంతుష్టిపడక, చూచుట మాత్రముతో సంతృప్తి చెందక, ఇంకనూ ఒక మెట్టు పైకిపోయి, దానిలో ప్రవేశించి లీనమై తాదాత్మ్యం పొందవలెను. వాటిలో లీనమై వాటి ననుభవించాలి. శాస్త్ర రహస్యములను తెలుసుకొని అవగాహన చేసుకొని, ఆకళింపు చేసుకొని జీర్ణం చేసుకోనాలి. అన్నంతిని సోమరిలా ఏ పని చేయకుండా వూరికనే పడుకుంటే ఉపయోగం లేకపోగా అజీర్ణం చేస్తుంది. ప్రతి రోజు సరిపోను ఆహారం తీసుకొని శారీరక శ్రమ చేసినప్పుడే తిన్న తిండి జీర్ణమై, రక్త రూపమై మానవునికి శక్తినిస్తుంది. అదే విధంగా తెలుసుకుని, చూచిన విషయములను జీర్ణం చేసుకొని అనుభవంలోనికి తెచ్చుకొని మానవ కళ్యాణానికి, దేశ పురోభివృద్ధికి ఉపయోగించి నప్పుడే తెలుసుకొని, చూచినందువల్ల ప్రయోజనం వుంటుంది. పుస్తకములలో నున్న విషయములను కంఠస్థంచేసి ఉపన్యాస ధోరణిలో చెప్పడం కొంత వరకు తేలికే. సాధారణంగా పుస్తక పఠ

నము ద్వారా కలిగెడు జ్ఞానం పుస్తక జన్య జ్ఞానము (Bookish Knowledge) అందురు. ఇది సర్వ సామాన్యమైనది. వాటిని అనుభవించి, జీర్ణం చేసుకొని ఆచరణలో పెట్టడం బహు కష్టం. ఆచరణ లేని వారి పలుకులు గ్రామ ఫోన్ రికార్డు పలుకులు లాంటివి మాత్రమే. అటువంటి వాటిని చిలక పలుకులంటారు. అటువంటి రికార్డులకు, పలుకులకు ఎంత విలువ వుంటుందో, పుస్తక పాండిత్యం మాత్రమే వున్నవారికి కూడా అంతే విలువ వుంటుంది. కనుక కన్నవి, విన్నవి, తిన్నవి కొంత వరకైనా ఆచరణ రూపం జెందాలి. అనుభవంలోనికి తీసుకొనిరావాలి,

మన ప్రాచీన శాస్త్రములలో అనేక అమూల్య విషయాలున్నాయి. 'సైన్సు' అనే విజ్ఞాన సాంకేతిక అణు సిద్ధాంత రహస్యములు కూడా ఎన్నో వున్నాయి. అన్వేషణ ప్రారంభించాలి. శాస్త్ర జ్ఞానం వల్ల లభించిన దానితో వాటి నన్నింటిని పరిశోధించాలి, రహస్యాలను కనుగొనాలి. వాటిని మానవ వికాసానికి ఉపయోగ పడేట్లు చేయాలి. ప్రతి విద్యార్థిలో నూతన విషయాలను కనిపెట్టాలనే తాపత్రయం, పట్టుదల తప్పని సరిగా వుండాలి. మహోపన్యాసము లివ్వడంతో, చర్చావేదికల నలంకరించడంతో సంతృప్తి చెందరాదు. పరిశోధనలను జరిపి నూతన విషయాలను కనిపెట్టాలనే కుతూహలం వుండాలి. అటువంటివారు మాత్రమే విజ్ఞానమును లోకాని కందించ గల్గుతారు. పైపై జ్ఞానం (Superficial knowledge) వల్ల ప్రయోజనం

లేదు. అనుభవ జ్ఞానమునకు మించిన జ్ఞానం మరొకటిలేదు. కనుక అటువంటి అనుభవ జ్ఞానమును స్వశక్తితో, స్వ ప్రేరణతో, స్వయం కృషితో, పట్టుదల శ్రద్ధలతో సాధించి సాంకేతిక పురోభివృద్ధికి తోడ్పడి అధికోత్పత్తిని చేసి, దేశపురోభి వృద్ధికి ఉపయోగపడాలి

## వివేక జ్ఞానము
## (Discrimination Knowledge)

అనుభవ జ్ఞానమును సంపాదించడం ఎంత అవసరమో, దానిని మంచికి, దేశకళ్యాణమునకు మాత్రమే ఉపయోగించే 'వివేకజ్ఞానం' కూడా కలిగివుండటం అంత అవసరం. వివేకం లేని విద్య వల్ల, విచక్షణ చూపించ లేని 'జ్ఞానం' వల్ల ప్రయోజనం ఏమాత్రంలేదు. వివేకం వేరు విద్యవేరు. మంచికి చెడుకు మధ్య వ్యత్యాసము తెలుసుకొనుటే వివేక లక్షణం. అట్టి వ్యత్యాసమును తెలిసికొనిన పిదప, దేనికి, ఎంత, ఎప్పుడు, ఎటువంటి ప్రాముఖ్యము నివ్వాలో నిర్ణయించ గల శక్తి సామర్థ్యములనే "విచక్షణా జ్ఞానం" అని అంటారు. విచక్షణా జ్ఞానం, వివేకజ్ఞానంలోని అంతర్భాగం మాత్రమే. వివేకము లేని వారికి సన్మార్గం పట్టు పట్టదు. మనం చేయు ప్రతి పనిలోను వివేకాన్ని ప్రదర్శించడం విజ్ఞత లక్షణం.

అణుపరిశోధనలను జరిపి ఒక్క-క్షణంలో ప్రపంచాన్ని భస్మీపటలం చేయగల మారణాయుధాలను తయారు చేయవచ్చును, అదే అణుశక్తి ద్వారా కొన్ని కోట్ల కిలోవాట్ల శక్తి గల విద్యుచ్ఛక్తిని తయారు చేసి పరిశ్రమలను, వ్యవసాయమును అభివృద్ధి పరచి దేశమును సస్యశ్యామలంకూడా చేయవచ్చును. కోట్లాది ప్రజానీకానికి పని కల్పించవచ్చును. మానవుడు ఇటువంటి విషయములలోనే తన వివేక బుద్ధిని ప్రదర్శించాలి, విచక్షణా జ్ఞానాన్ని చూపించాలి. తాను కనిపెట్టిన గొప్ప విషయములు చెడుకు, సంక్షోభానికి, సర్వనాశనానికి కాక మంచికి, మానవ కళ్యాణమునకు, అధికోత్పత్తికి ఉపయోగపడే విధముగా చేయడమే ''వివేకజ్ఞానం'' అని అంటారు. వివేక విచారణచే విజ్ఞానమును సాధించాలి. మానవత్వ రహితమైన విజ్ఞానం వల్ల ప్రయోజనం లేదు. వివేకంతో సాధించిన విజ్ఞానమును, విచక్షణా యుతంగా సమాజాభివృద్ధికి ఉపయోగించాలి. ఇట్టి వివేక, విచక్షణా జ్ఞానం గలవాడు ఒక వేళ ధనహీనుడైననూ, అధికారం లేని వాడైననూ అందరిచేత గౌరవించ బడుతాడు. పూజించబడుతాడు. వివేక, విచక్షణా జ్ఞానం లేనివాడు విద్యావేత్త అయిననూ, మిక్కిలి ధనవంతుడైననూ ప్రముఖ శాస్త్రవేత్త (Scientist) అయిననూ ఏ మాత్రం ప్రకాశించడు. వివేక జ్ఞానం గల అనుభవజ్ఞుడు దూరం నుండే చూచి, ఎదుటి వ్యక్తి గుణగణాలను, మనోభిప్రాయాలను, మనస్తత్వాలను యిట్టే కనిపెట్టి వేస్తాడు, జ్ఞాన హీనులు అతి సమీపమున, సన్నిహితంగా వున్నవారి మనస్తత్వాలను కూడా కనిపెట్ట

లేదు. తుమ్మెద ఎంతో దూరం నుండే తామరపువ్వు వాసనను పసిగట్టి దాని మీదకు సరాసరి వచ్చి వాలుతుంది. కాని కప్ప మాత్రం దగ్గరే వుండికూడా ఆ వాసనను ఏ మాత్రం గ్రహించలేదు. వివేక విచక్షణా జ్ఞాన రహితుడు సామాన్య ధర్మమేదో, విశేష ధర్మ మేదో గుర్తించలేదు, గమనించలేదు. కొన్ని కొన్ని సందర్భములలో అసలు ధర్మమేదో, అధర్మమేదో కూడా కనుగొనలేడు. ఒక మనిషి, ఎదుటి మనిషిని క్రూరంగా, అక్రమంగా చంపడం అధర్మం. కాని తన ప్రాణానికే ముప్పు వాటిల్లే సందర్భంలో, ఆత్మ రక్షణార్థం. తప్పనిసర అయిన పరిస్థితులలో ఎదుటి వానిని తుదముట్టించ వలసివస్తుంది. కనుక ఆత్మ రక్షణకోసం ఎదుటి వానిని హింసించడం అధర్మం ఏమాత్రం కాదు, ధర్మమే. అదే విధముగా సైనికుడు యుద్ధ భూమిలో శత్రువులను నిర్దాక్షిణ్యంగా సంహరించడం అది అతని ధర్మం, మనుష్యులను చంపడం అధర్మమని భావించి అస్త్రసన్యాసం చేయడం సైనికుని ధర్మం కాదు. శత్రువుల మూకలను తుదముట్టించడమే 'సైనిక ధర్మం,' అదే విధముగా న్యాయమూర్తి హంతకులను, దుష్టులను దొంగలను శిక్షించడం ఆయన ధర్మం, అయ్యో పాపం! అది కరుణతో హంతకులను వదలి వేయడం అధర్మం. 'అసత్యమాడరాదు' ఇది సామాన్య ధర్మం. కొన్ని కొన్ని సందర్భములలో సత్యమాడుట వలన అసలు అత్యున్నతమైన ధర్మానికే ముప్పు వాటిల్లే ప్రమాదం గనుక సంభవించేట్లయితే అప్పుడు అసత్యమాడుటయూ ధర్మమే. సామాన్య, విశేష ధర్మముల

మధ్య విరోధం ఏర్పడినప్పుడు, సామాన్య ధర్మమును పరి త్యజించి విశేష ధర్మమును అనుసరించవలెను. ధర్మం చాలా సూక్ష్మమైనది. దీనిని నిర్ణయించడం అంత తేలిక గాదు. కనుక ప్రతివ్యక్తి ఏదైనా పనిచేయ వలసి వచ్చి నప్పుడు, ముఖ్యంగా సమాజ శ్రేయస్సును దృష్టియందుంచు కొనవలెను. వ్యక్తి. సమిష్టులమధ్య వైరుధ్యం ఏర్పడుతే సమిష్టికే ప్రాధాన్యము నివ్వాలి. ఇటువంటి వైరుధ్యాలు ఉత్పన్నమైనప్పుడు వివేకంతో వ్యవహరించి పదిమందికి ఉప యోగపడే విధముగా నిర్ణయాలను గైకొనాలి. అందు వలన ఒక్క శాస్త్రి జన్య జ్ఞానంతోనే సంతృప్తి జెందక వివేక విచక్షణా జ్ఞానములను మరియు అనుభవ జ్ఞానమును ప్రతి ఒక్కరూ సంపాదించి తీరవలెను. వివేకంతో కూడిన దూర దృష్టిని అభివృద్ధి పరచుకొనవలెను. వాటిని సమాజాభివృద్ధికి వినియోగించవలెను.

## లౌకిక జ్ఞానం
## (Worldly Knowledge)

అనుభవజ్ఞానము, వివేక జ్ఞానములతోనే సంతృప్తి జెందరాదు. ప్రతివానికి లౌకికజ్ఞానం కూడా కావాలి. దీనినే ప్రపంచ జ్ఞానం అని అంటారు కూడాను. ఇటువంటి జ్ఞానం ఎలా అబ్బుతుంది ? ఇట్టి జ్ఞానం కేవలం పుస్తకాలను చదవడం వల్ల లభ్యంకాదు. దీనిని పొందవలెననిన విస్తృతంగా దేశాటన చేయవలెను. వివిధ ప్రదేశములను సందర్శించు

పాలెను. ప్రపంచంలో అనేక వింతలున్నాయి. జ్ఞానమును ప్రబోధించే అమూల్యమైన విషయాలెన్నో వున్నాయి. ముఖ్యంగా మన దేశంలో ప్రాచీన సంస్కృతీ వైభవాలను ప్రతి బింబించే టటువంటి శిల్పకళ ఎంతో వున్నది. వాటన్ని టిని పరిశోధనా దృష్టితో పరిశీలించాలి. వాటి యొక్క పుట్టు పూర్వో త్తరాలను ఆసక్తితో తెలుసుకోనాలి. వాటి వెనుక నున్న చరిత్రను, నాగరికతను, సంస్కృతిని అవగాహన చేసుకొని ప్రచారంలోనికి తీసుకొనిరావాలి. ఆయా ప్రాంత ముల ప్రజల సామాజిక, ఆర్థిక, రాజకీయ పరిస్థితులను అవగాహన చేసుకోవాలి, అధ్యయనం చేయాలి, వారితో కొంత కాలం కలసిమెలిసి వుండి వారి జీవన విధానాన్ని, సాధక బాధకాలను అర్థం చేసుకొని వారి అవసరాలను గమ నించాలి. మేధాశక్తి నుపయోగించి వాటిని తీర్చేందుకు అవసరమైన పథకములను రూపొందించి ప్రభుత్వానికి, స్వచ్ఛంధ సంస్థలకు అవసరమైన సూచనలు చేయాలి. సహజ సిద్ధంగా లభించే పకృతి ఖనిజ సంపదలు ఏ విధ ముగా మానవ పురోభివృద్ధికి ఉపయోగపడుతాయో పరి శోధనలను జరపాలి. ఆ విధంగా చేస్తే ఊహించనటువంటి అభివృద్ధి మనలో కన్పడుతుంది. అసలు నేర్చు కోవాలనే కోరిక, తాపత్రయము, ఆసక్తి గనుక వుంటే కేవలం పుస్త కాలనే చదువ నవసరం లేదు, మన చుట్టూ కనుపించే చెట్లు చేమలూ, కొండలూ గుట్టలూ, నదీనదాలు, పురాతన శిల్ప సౌందర్యాలు-నేర్చుకోవడానికి ఎంతో ఉపకరిస్తాయి. వాటి నుండి ఎన్నో నూతన విషయాలను సేకరించ గల్గుతాం.

ఎన్నో గ్రంథములు చదివినా లభ్యం కాని విషయాలు ఈ దేశాటన వల్ల లభ్యమవు తాయి. అందుకోసమనే ప్రతి సంవత్సరం విద్యార్థులను వినోదయాత్రల (Excursions) కు తీసుకొని వెళ్ళుతుంటారు. వివిధ ప్రదేశములను సందర్శించి నప్పుడు అక్కడి భవన నిర్మాణంలో వారనుసరించిన 'వాస్తు విధానము' ను కూడా పరిశీలించాలి. ఆనాటి ప్రజల సాంఘిక స్థితిగతులను, సంస్కృతీ సంప్రదాయము లను కూడా పరిశీలించాలి. పర్యటనల వల్ల విశేషమైన ప్రపంచ జ్ఞానం అబ్బుతుంది. ఎవరితో ఏవిధంగా మెలగాలో ఏవిధంగా సంచరించాలో తెలుస్తుంది. కడు చాతుర్యంగా. లౌకికంగా మాట్లాడటము అలవాటౌతుంది. సందర్భోచి తంగా మాట్లాడటం, సమయస్ఫూర్తితో వ్యవహరించడం తెలుస్తుంది. ఈ సందర్భమున ఒక విషయం మరువరాదు. పెద్దలు అనుభవంతో చెప్పిన ఈ నీతి శ్లోకమును ప్రతి ఒక్కరు గుర్తుంచుకోవాలి,

"సత్యం బ్రూయాత్. ప్రియం బ్రూయాత్
నబ్రూయాత్ సత్య మప్రియం
ప్రియంచ నానృతం బ్రూయాత్
ఏషః ధర్మస్సనాతనః"

అనగా సత్యమును పలుకవలెను. ప్రియమైన దానిని చెప్పవలెను. సత్యమైనను అప్రియముగా చెప్ప రాదు. ప్రియము గదాయని అసత్యమైనచో చెప్పరాదు. ఇది సనాతనమైన ధర్మము. యథార్థమైనప్పటికి వాస్తవమైనప్ప

టికి. సత్యమే అయినప్పటికి కటువుగా కుండ బ్రద్దలుకొట్టి నట్లు నిర్మొఖమాటంగా మాట్లాడ రాదు. ఆ విధముగా వెళసరిగా మాట్లాడుతే ఎదుటి వాళ్ళకు కోపం (Offend) వచ్చే ప్రమాదం కూడా వుంటుంది. బాధ పడుతారు కూడాను. 'కాలుజారుతే తీసుకొనవచ్చును గాని నోరుజారితే సరుకోవటం కష్టం. కనుక లౌకికంగా ఎదుటివాని మనస్సు నొప్పించకుండా, మృదువుగా, నెమ్మదిగా సత్యం చెప్పడం నేర్చుకోవాలి. సత్యమును చెప్పడం వల్ల ఎదుటివాని మనస్సు దెబ్బతింటుందని అసలు సత్యాన్నే చెప్పరాదు. అనేస్థాయికి మాత్రం పోరాదు. మన మొగమాటం ఎందుకు చెడగొట్టుకోవాలవి. అసలు వాస్తవం చెప్పకుండా తప్పించు కొని తిరగడం కూడా మంచిది కాదు. ఏ విషయం లోను అతిగా (Extreme) పోరాదు. మధ్యేమార్గమును అవలం భించాలి. అట్టిది ప్రియముగా వుండాలి. ప్రియముగావుండా లని అసత్యం మాత్రం చెప్పరాదు. న్యాయసమ్మతంగా కూడా వుండాలి, ఇటువంటి లౌకికం కేవలం పుస్తకాలను చదివినందువల్లరాదు. అంతమాత్రమున పుస్తకములు చదవడం వృధాయనిభావించరాదు. ముఖ్యంగా ఈ అను భవం ప్రపంచ జ్ఞానం వల్ల లభిస్తుంది. పుస్తకములలో వ్రాసిన విషయాలు కూడా కొంతమంది పెద్దలు అనుభవం తోనే వ్రాశారు. వాటిని మననం చేసుకుంటూ, ప్రపంచాను భవమును దానికిజోడించి సాధనద్వారా సఫలీకృతులవ్వాలి. ఈ అనుభవాన్ని నిత్యజీవితంలో ఉపయోగించు కోవాలి. ఎంత చదువు వున్నప్పటికి సకల శాస్త్రముల నభ్యసించిన

గొప్ప పండితుడైనప్పటికి ప్రపంచజ్ఞానంలేని వ్యక్తి ఎందుకూ పనికిరాడు. తనను తాను పోషించుకొనలేడు; ఇతరులకు ఉపయోగపడలేడు. అందువలన ప్రతిఒక్కరూ దేశాటనానుభవమును పొంది, అమూల్యమైన 'లౌకికజ్ఞానము'ను సంపాదించి నిత్యజీవితంలో విజయాన్ని పొందాలి.

అనుభవం ద్వారా పొందిన జ్ఞానమును, వివేకజ్ఞానంతో దేశకళ్యాణానికి ఉపయోగించి, విచక్షణా జ్ఞానంతో సద్వినియోగపరచి లౌకిక జ్ఞానంతో తెలివితేటలుగా వ్యవహరించి, అనుభవ జ్ఞానమును తిరిగి పెంపొందించుకొనవలెను. అప్పుడే దానిని సంపూర్ణమైన "విజ్ఞానం" అని అంటారు. అట్టి విజ్ఞానమును సంపాదించినవ్యక్తి ఎక్కడికి వెళ్ళినా చెలామణి అవుతాడు. ఏపనినైనా సాధించగలుగుతాడు. దేశపురోభివృద్ధికి తోడ్పడగలుగుతాడు,

జ్ఞాన విజ్ఞానములతోపాటు 'ఆత్మజ్ఞానము' ను కూడా సంపాదించినవానికి దైవానుగ్రహంకూడా లభించును. అట్టి 'ఆత్మజ్ఞానమును గూర్చి వచ్చే అధ్యాయంలో వివరిస్తాను.

"విద్య యొక్క పరమార్థము స్వతంత్రంగా ఆలోచించుట. స్వతంత్రంగా జీవించుట."

—శ్రీ లాలా లజపతిరాయ్.

"ఏ విద్య వలన శాంతి సుఖములు లభించునో, ఏది అత్యంత దుఃఖ రాహిత్యమును కలుగ జేయగలదో, సంసారతాపములన్నియు దేనివలన అణగిపో గలవో అదియే ఉత్తమమైన విద్య, ఏది మోక్షమును గలుగజేయునో అట్టి విద్యయే విద్య. ఏది జనన మరణ ప్రవాహము నుండి జీవుని తప్పించగలదో అదియే విద్య లలో శిరోమణి యనదగును."

—శ్రీ విద్యా ప్రకాశానందస్వామి.

"శిష్యుడు ఏ ముఖ్య విషయాన్నీ గురువు వద్ద దాచరాదు. చేసిన తప్పులు గురువుతో చెప్పుకోడం వల్ల చేతన యందలి ప్రతిబంధకాలు తొలగి అంతరంగిక విశుద్ధి ఏర్పాడుతుంది."

—శ్రీ అరవిందులు

"విద్య యనగా అక్షరాస్యతకాదు, వివేకము, విజ్ఞానము కలిగి వర్తించుట. ఆధునికాంగ్ల విద్య కేవలము పరాధీనమైన బ్రతుకునకే మూలము. సాంకేతిక పరిశోధన విద్యలు అవసరం."

—శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి

# వివేకావాణి

## చతుర్థ భాగము

# "ఆత్మ జ్ఞానము"

# ఆత్మ జ్ఞానము

"జ్ఞానానాం జ్ఞానముత్తమం" జ్ఞానములలో కెల్లా 'ఆత్మజ్ఞానం' ఉత్తమమైనది. ఈ ప్రపంచంలో అనేక జ్ఞానములున్నాయి. భౌతిక శాస్త్ర విజ్ఞానం (Science) సంగీత, సాహిత్య, శిల్ప, గణితశాస్త్ర జ్ఞానములెన్నో వున్నాయి. ఎన్ని జ్ఞానములను సంపాదించినప్పటికి 'ఆత్మ జ్ఞానము' ను సంపాదించనివానికి శాంతి లేదు. సుఖమూ వుండదు. ప్రపంచదృష్టిలో కీర్తిప్రతిష్టలు సంపాదించుకొనినప్పటికీ ఆత్మజ్ఞానము' ను సంపాదించని వారు భగవంతునికి ప్రీతిపాత్రులు కాలేడ. "నహి నహి రక్షతిడుకృఞ్ కరణే" లౌకిక విద్యలు జననమరణముల నుండీ రక్షింపజాలవు. దైవ విద్య, ఆధ్యాత్మిక విద్యలవల్లనే మానవునికి మోక్షం సంప్రాప్తమవుతుంది. ఏ జ్ఞానమువలన మనుజుడు అనేకత్వంలో ఏకత్వమును, మృత్యువులో అమృతత్వమును గాంచగల్గునో అదియే అన్నిజ్ఞానములలోకెల్లా సర్వశ్రేష్టమైనది. ఆత్మజ్ఞానం అన్నా, పరమాత్మజ్ఞానం అన్నా, ఆధ్యాత్మికజ్ఞానం అన్నా అంతా ఒకటే. ఆత్మను పరమాత్మను చక్కగా తెలుసుకొనుటకు దోహదం చేసే జ్ఞానం అది. అట్టిజ్ఞానం ఎలా లభిస్తుంది? "యస్మిన్ జ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం భవతి" దేనిని తెలిసికొనినచో సమస్తమును తెలుసుకొనబడినదగునో, అట్టి పరమాత్మను ఎరిగినవాడగును. అదియే 'ఆత్మజ్ఞానము.'

అతడే ప్రపంచంలో సర్వజ్ఞుడుగా పేరు ప్రఖ్యాతులను పొందుతాడు. ప్రపంచంలో ఎన్ని భౌతిక విద్యలను సంపాదించినను, ఎంతటి పాండిత్యమును బడసినను, ఎన్ని కళలు సముపార్జించినను మనుజుడు 'సర్వవేత్త' కాలేడు. సర్వజ్ఞుడు అంతకన్నా కాలేడు. కారణం? లౌకిక విద్యలు పరిపూర్ణ శాంతిని కలుగజేయజాలవు. జన్మరాహిత్యమును కలుగజేయవు. "తరతి శోకమాత్మవిత్" ఆత్మజ్ఞాని ఒక్కడు మాత్రమే శోకమును దాటగలడు. కనుక ప్రతి ఒక్కరూ పరమాత్మను ఆశ్రయించవలసినదే. అప్పుడే 'ఆత్మజ్ఞానము' ను పొందగలడు. సమస్త విద్యలూ కరతలామలకములగును. ఎందువలననగా ఈ సమస్త బ్రహ్మాండములు, ఈ చరాచర సృష్టియావత్తూ, సమస్త శాస్త్రములు, కళలు– అన్నియూ భగవానుని యందే యిమిడివున్నాయి. కనుక సర్వజ్ఞుడయిన అట్టి పరమాత్మను బాగుగా తెలిసికొనినవాడినే "జ్ఞాని, సర్వవేత్త, సర్వజ్ఞుడు" అని అంటారు. అట్టి 'ఆత్మజ్ఞాని'కి మోక్షం సంప్రాప్తిస్తుంది. అట్టి 'ఆత్మజ్ఞానం' చిత్తశుద్ధి వలననే కలుగుతుంది. అట్టి 'చిత్తశుద్ధి' పవిత్ర కార్యములు, పుణ్యకార్యములు అనగా దానం, పరోపకారం, భూతదయ, మానవసేవ, దైవభక్తి, సత్కథాకాలక్షేపం, భగవద్గీత, రామాయణం, మహాభారతం, భాగవతములను అధ్యయనం చేయటంవల్ల మరియు నిష్కామ బుద్ధితో, ఎట్టి ఫలాపేక్ష లేకుండా, ఈశ్వరార్పణ బుద్ధితో కర్మల నాచరించడం వల్ల కలుగుతుంది. "అట్టి నిర్మల హృదయమున 'జ్ఞానభాస్కరుడు' ఉదయిస్తాడు. అట్టి జ్ఞానోదయంవల్ల

నరుడు నారాయణుడవుతాడు; జీవుడు శివుడవుతాడు; మానవుడు మాధవుడవుతాడు; పురుషుడు పురుషోత్తము డవుతాడు; పశువు పశుపతి అవుతాడు.''

అట్టి పరమోత్కృష్టమైన స్థాయికి చేరుకొనవలెననిన మొదటిది 'పురుషయత్నం' రెండవది 'దైవసహాయం' అత్యావసరం. నిష్కామబుద్ధితో కర్మల నాచరించిన యెడల సత్ఫలితములు చేకూరుతాయి.

అజ్ఞానం పటాపంచలై జ్ఞానోదయ మవుతుంది. నిజ ఆత్మస్వరూపమును సాక్షాత్కరించు కొనగలుగుతాడు. అదియే 'మోక్షము' అదియే 'జన్మరాహిత్యము' అదియే జీవుని అంతిమ లక్ష్యం. అట్టిజ్ఞానియే కృతార్థుడు. అట్టి మహనీయుడు ఎన్నడూ, ఎప్పుడూ, ఎవరికీ భయపడడు. ఇట్టి సంపూర్ణజ్ఞానం కలుగ నంతవరకు సంశయములు బాధించుచునే యుండును. అట్టి ప్రత్యక్షజ్ఞానం, అనుభూతి కలిగిన తక్షణమే అవిద్య అంధకారం తొలగిపోయి, సందేహములు మటుమాయమగును. అందువలననే 'ఆత్మజ్ఞానము'నకు మించిన 'జ్ఞానం' మరొకటి లేదన్నారు మహానుభావులు, కనుక ప్రతి ఒక్కరూ అట్టి మహత్తరమైన 'ఆత్మజ్ఞానము'ను సంపాదించి తీరవలెను.

---

''ఇతరులకు బోధించేవారు తరచు తమకు తాము బోధించుకోవాలి.''

—షేక్స్పియర్.

## ఏసుక్రీస్తుబోధ

ఒక పర్యాయం ఏసుక్రీస్తు వద్దకు ఒక భక్తుడువచ్చి "అయ్యా! నాకు మోక్షము ఎప్పుడు లభించును?" అని ప్రశ్నించెను. అంతట ఏసుప్రభువు తన సమీపమునున్న బాలునిచిత్తము ఎప్పుడునీచిత్తమువలెతయారగునో, అప్పుడే మోక్షము సంప్రాప్తమగును" అనిచెప్పెను. ఎందువలన? పసి బాలునియందు ఈర్ష్యాద్వేషములుగాని కామక్రోధములు గాని వుండవు. అతనిమనస్సు అతి నిర్మలంగా, స్వేచ్ఛగావుం టుంది. అట్టి నిర్మలమైన, విశుద్ధమైన చిత్తమును ఎవరు కలిగి వుందురో అట్టివారు మాత్రమే మోక్షమునకు అర్హులు, కనుక మంచి పట్టుదలతో నిరంతర సాధన ద్వారా ఆస్థాయికి చేరు కొనేందుకు ప్రతి ఒక్కరు తీవ్రకృషి సలపాలి.

## అర్హులెవరు?

ఆత్మజ్ఞానమును ఎవరైననూ ప్రయత్నించి సాధించ వచ్చును. స్త్రీలుగాని, పురుషులు గాని, బీదవారుగాని, ధనవంతులుగాని; అగ్రకులాలవారు గాని, తక్కువ కులాల వారుగాని—ఎవరయినా సరే ఈ 'జ్ఞానజ్యోతి'ని వెలిగించు కోవడానికి అర్హులే. జాతి, మత, కులవర్ణ వ్యవస్థలతో దీనికి ఎలాంటి సంబంధం లేదు. భౌతిక శాస్త్ర పరిజ్ఞానం లేక పోయినప్పటికి లౌకిక విద్యల నభ్యసించక పోయినప్పటికి

ఫరవాలేదు. ప్రాపంచిక మైన చదువు సంధ్యలు లేవని విచారపడి దిగులుతో కూర్చోనవసరం లేదు. కావలసినది నిశ్చలమైన, అనన్యమైన భక్తిమాత్రమే. "యోమద్భక్తః సమేప్రియః" 'ఎవడు నాయెడల భక్తికలిగి యుండునో వాడు నాకు ప్రియుడు అని భగవానుడు 'గీత' లో చెప్పాడు, కనుక దిగులు పడనవసరం లేదు. చింతించ నవసరం అంత కన్నా లేదు. మహనీయుల వలన ఆధ్యాత్మిక బోధనలు పరమార్థ తత్వములను తెలుసుకొని లేకవిని శ్రద్ధతో శ్రవణం చక్కగా చేయడం, నిరంతరం మననం చేసు కుంటూ, ఏకాగ్రనిష్టతో, భక్తి ప్రవృత్తులతో ఆచరించటం వల్ల తరించ వచ్చును. పరమాత్మను సాక్షాత్కరించు కొనవచ్చును. తద్వారా మోక్షమును బడయవచ్చును. అట్టి 'ఆత్మజాని' ముందు ఈసామాన్యమైన భౌతిక శాస్త్ర జ్ఞానాదులు ఒక లెక్క కాదు. ఇట్టిజ్ఞానం కొందరికి పూర్వ సంస్కారం వల్ల ఇట్టే అబ్బుతుంది. మరి కొందరికి నిరంతర చింతన ద్వారా అనన్య భ_ద్వారా నిదానంగా అబ్బుతుంది. శ్రీరామకృష్ణపరమ హంస మొదటి కోవకు చెందిన వారు. ఈయన ఎక్కువ లౌకిక ప్రాపంచక విద్యల నభ్యసించలేదు. ప్రాథమిక విద్య కూడా పూర్తిచేసి నట్లుగా కనుపించదు. నిరంతర నిష్టానుష్టానములతో, అచంచల భక్తి తో, ఆ పరమాత్మను ఆ కాళీమాతను సాక్షాత్కరించు కొనగలిగినాడు. జ్ఞాననేత్రం తెరువబడింది. సకల శాస్త్రములు కరతలా మలకములైనాయి. విశేష విజ్ఞానమును నముపార్జించి సర్వజ్ఞుడై ప్రపంచానికి జ్ఞానభిక్షను

ప్రసాదించాడు. మున్మిందివరం 'బాలయోగి' కూడా ఈ కోవకు చెందినవాడే. షుమారు ఇరువై అయిదు సంవత్సరములనుండి ఆహారపానీయాదులను ముట్టకుండా తపోనిష్ఠలో నిమగ్నుడై వున్నాడు. దారి దోపిడీగాడైన రత్నాకరుడు, సాధనవల్ల 'వాల్మీకి'గా మారిపోయాడు. అత్యున్నతమైన, ఆదర్శవంతమైన రామాయణ మహాకావ్యమును ప్రపంచానికి ప్రసాదించాడు. కటికి కసాయివాడైన 'ధర్మ వ్యాధుడు' నిష్కామకర్మాచరణ ద్వారా ప్రపంచానికి ఆదర్శపురుషుడై వెలుగొంది మోక్షమును పొందాడు. దానవ కులములో పుట్టిన 'ప్రహ్లాదుడు' భక్తితో మోక్షమును చేరుకున్నాడు. వానరుడైన హనుమంతుడు శ్రీరామ భక్తుడై తరించాడు. జటాయువు పక్షిఅయిననూ భక్తుడై మోక్షమును సంపాదించాడు. దీనివలన మనం గ్రహించవలసినది ఒకటున్నది "భగవంతునిదృష్టిలో మానవులైనా, దానవులైనా, జంతువులైనా, పక్షులైనా-అంతా సమానమే" అందరూ మోక్షానికి అర్హులే. భగవంతునికి కావలసినది అచంచలమైనభక్తి, చిత్తనైర్మల్యము, శ్రద్ధాసక్తులుగల సాధకుడు మాత్రమే వీటిని సాధించి 'ఆత్మజ్ఞానము' ను పొందగలుగుతాడు. కావున శాస్త్రములయందు, గురువుల యందు, దైవము నందు పరిపూర్ణవిశ్వాసం, అచంచలమైన భక్తిశ్రద్ధలు వుండి 'ఆత్మవిశ్వాసం' కూడా వుండాలి. స్వామీ వివేకానంద ఇదే బోధించాడు" Faith, Faith Faith in Ourselves; Faith Faith in God-This is the Secret of Greatness" అనగా నమ్మకం, తనయందు నమ్మకం, దేవునియందు

నమ్మకం ఇదే ఔన్నత్యమునకు విజయమునకు కీలకము''
అని వివేకనందుడు ఎలుగెత్తిచాటాడు. ప్రపంచంలో ఈనాడు
చాలా మందిలో ఈ విశ్వాసం, నమ్మకం లోపించి
నందువల్లనే లక్ష్యమును చేరుకో లేక పోతు న్నాయి,
''సంశయాత్మావినశ్చతి'' ''సందేహించు మనస్సుగలవాడు
పూర్తిగా నశించుచున్నాడు. అనిగీతబోధిస్తున్నది. సంశ
యంతో అపనమ్మకంతో ఏ పని ప్రారంభించినా అదిపూర్తి
కాదు. సఫలీకృతం అంత కన్నా కాదు. కనుక సాధకుడు
ముఖ్యముగా ''శ్రద్ధ, విశ్వాసం, నమ్మకం అనుమూడు సద్గు
ణములను అలవరచుకొని, అత్యున్నతమైన 'ఆత్మజ్ఞానమును'
సంపాదించి 'మోక్షము'ను బడయవలెను. కేవలం భౌతిక
శక్తిపై నాధారపడు వారికి ఎప్పటికైనా పతనం తప్పదు.
భౌతికమైన శక్తి మానసిక వ్యథను పోగొట్టజాలదు, పరమ
శాంతిని కలుగ జేయలేదు, కనుక ప్రతిఒక్కరూ భౌతిక
శక్తితోపాటు నైతిక ఆధ్యాత్మిక (Moral and Spiritual)
శక్తులను కూడా పెంపొందించు కోనాలి, పరమాత్మ
తత్వమునుకూడా బాగా తెలుసుకోనాలి. ''తత్వజ్ఞానమనగా
సత్యాన్వేషణ సత్యాన్వేషణ విద్యార్జన చేయువారి ప్రథమ
కర్తవ్యం.''

### లౌకిక విద్యలను విడనాడరాదు

ప్రస్తుత యుగంలో యిట్టి 'ఆత్మ జ్ఞానమును'
సంపాదించటం అంత తేలిక కాదు. ఇది అందరికి సాధ్యం
కూడా కాదు. అసాధ్యమని భావించి నిరాశ, నిస్పృహాలతో

ప్రయత్నం మాత్రం విడువ రాదు. భౌతిక, ప్రాపంచిక లౌకిక విద్యలు లేక పోయినప్పటికి ఆత్మజ్ఞానము సంపాదించ డానికి అవకాశం వున్న మాట వాస్తవమే. ఒక్కొక్క సమయంలో పరమాత్మను తెలుసు కోవాలనే తాపత్ర యంలో పడి లౌకిక విద్యలను విడనాడటం జరుగు తుంది. అటు పరమాత్మను తెలుసుకొనలేక, ఇటు భౌతిక విద్యల నభ్యసించక "రెంటికి చెడ్డరేవడివలె" ఉభయభ్రష్టులవు తుంటారుకొందరు. అది ఏ మాత్రం మంచిది కాదు. భౌతిక విద్యలను కూడా ఏ మాత్రం నిర్లక్ష్యం చేయ రాదు. లౌకిక విద్యలు లేకుండా వుండటం కంటే వాటిని కూడా కలిగివుండటం శ్రేష్టమూ, శ్రేయస్కరము. ఒక చెంప భౌతిక శాస్త్ర విజ్ఞానము సంపాదించుతూ ఆధ్యాత్మిక దృష్టి కూడా కలిగి వుండటం మంచిది. ప్రతిరోజు కొంత సమయమును భగవద్ధ్యానమునకు తప్పని సరిగా కేటా యించాలి.

## తపస్సు

'తపస్సు' అనగానే చాలామందిలో ఒక భయం వున్నది. అన్నాహారములను వర్జించి, ఆకులలములను తినుచూ, వాయుభక్షణ చేస్తూ, ఎండనక, వాననక, కీకారణ్యములలో తలక్రిందబెట్టి కాళ్ళుపైకిపెట్టి వత్సరముల తరబడి శరీరాన్ని కష్టపెట్టడం అనే అభిప్రాయం యింకా

చాలామందిలో వున్నది, ఈపద్ధతిని 'గీత'లో భగవానుడు చెప్పియుండలేదు. తనయం అంతర్భూతమైవున్న రజస్తమోగుణములను తపింపజేసి నిర్మూలన మొనర్చుటయు మరియు ఇంద్రియాదుల యందలి మాలిన్యమును తొలగించుటయే' "తపస్సు" అని గీతలో చెప్పబడినది. తపస్సు మూడు విధములు. 1. శారీరక తపస్సు 2. వాచిక తపస్సు 3. మానసిక తపస్సు.

## 1. శారీరక తపస్సు

శారీరక తపస్సు అనగా శరీర సంబంధమైన తపస్సు అని అర్థం. ఐదురకముల సాధనములద్వారా ఈ తపస్సు చేయవచ్చును. 1. 'దేవతలు, గురువులు, బ్రహ్మజ్ఞానులు ఐన మహనీయులను సేవించుట, పూజించుట.' దీనివల్ల వారి అనుగ్రహం లభిస్తుంది. వారి కరుణా కటాక్షములు మన మీద ప్రసరించి, మనకు మేలు కలుగుతుంది. మరియు మనలోనున్న అహంకారం, అభిమానం, గర్వములుశమించి వినయవిధేయతలు అబ్బుతాయి. 2. అంతర్బాహ్యాశుచిత్వం: అనగా మనశ్శుద్ధి, శరీరశుద్ధి, పరిసరశుద్ధి– ఈ మూడు ప్రతి వ్యక్తికి వుండాలి. దీనిని గురించి వివరంగా ద్వితీయ భాగంలో 'శుచిత్వం' అనే శీర్షికలో వివరించబడింది. 3. ఋజుత్వం: అనగా కుట్ర,కపటము, కుటిలత్వం, వక్రబుద్ధి లేకుండుట. తలచేది, చెప్పేది, చేసేది అంతా ఒకేవిధంగా

వుండాలి. మంచి ప్రవర్తన కలిగివుండాలి. 4. 'బ్రహ్మచర్యము': అనగా విషయదోషము, కామభావన, కామ వ్యవహారము లేకుండుట మరియు భగవంతుని గూర్చి నిరంతరం చింతించుట మొదలగునవి. 5. 'అహింస': యే ప్రాణికి అపకారం చేయకుండుట. అజ్ఞానము కలిగియున్నచో తన ఆత్మను తానే హింసించుకొనినట్లగును గావున అజ్ఞానమును తొలగించి, జ్ఞాన సముపార్జనము గావించుటద్వారా ఆత్మహింసనుత్యజించుటయే 'అహింస' అందురు. ఇది అహింసయొక్క మహోన్నతరూపం. మిగతా విషయములు ద్వితీయభాగంలో వివరించబడ్డాయి. ఈ ఐదు అంశములను శారీరక తపస్సు అందురు.

## 2. వాచిక తపస్సు

మనం మాట్లాడే మాటలతో పరుల మనస్సులని నొప్పికలుగ జేయరాదు. మరియు అది సత్యమైనదై వుండాలి; యధార్థమై వుండాలి: వాస్తవమై వుండాలి. సత్యవాక్కు అయినప్పటికి పరుషంగా, అప్రియంగా మాత్రం వుండరాదు. ప్రియముగాహితముగా వుండాలి. కటువుగా, పెడసరంగా ఎప్పుడూ మాట్లాడరాదు. మనమాట ప్రియంగా వుండటంతో పాటు, ఇతరులకు మేలు కలిగించేదై వుండాలి. ఈ విధముగా మాట్లాడటానికి చక్కటి ప్రయత్నం జరగాలి. నిత్యం అభ్యాసం చేయాలి. దీనితోపాటు శాస్త్రాభ్యాసం కూడా అవసరం. వేదములు, ఉపనిషత్తులు, భారత,

భాగవత రామాయణాదులను అధ్యయనం చేయాలి. పవిత్ర మైన బీజాక్షరములుగల మంత్రములను నిత్యమూ జపించాలి. దీనినే 'వాచిక తపస్సు' అంటారు.

## 3. మానసిక తపస్సు

మనస్సును కలత నొందనీయకుండా నిర్మలంగా, స్వచ్ఛంగా వుంచుకొనుట. "Face is the index of mind" 'మనస్సుయొక్క ప్రతిబింబం ముఖము' అని పెద్దలు చెప్పారు. మనస్సులో చెలరేగేఆందోళనలు మన ముఖంలో స్పష్టంగా ప్రతిబింబిస్తూవుంటాయి. మనస్సు నిర్మలంగా, సౌమ్యంగా నిశ్చలంగా వుంటే మనముఖంకూడా ఆనందంతో ప్రశాం తంగా కన్పడుతుంటుంది. మనస్సు తీవ్ర భయాందోళనలకు ఆలవాలమైతే మన ముఖంలో కూడా భయాందోళనలు ప్రస్ఫుటంగా కనుపిస్తాయి. కనుక మనస్సును బాగుగా నిగ్రహించుకోవాలి. మోసం, దగా ఆలోచనలకు తావివ్వ రాదు. కఠినత్వం, క్రూరత్వపు ఆలోచనలకు మన మనస్సులో చోటివ్వరాదు. పరిశుద్ధమగు భావములు కలిగి వుండాలి. ప్రశాంతంగా ఆలోచించడం నేర్చుకోవాలి. అప్పుడే ముఖం కూడా ప్రసన్నంగా వుంటుంది. మౌనం వహించడం కూడా 'మానసిక తపస్సు' లో భాగమే. అతిగా మాట్లాడరాదు. మితంగా మాట్లాడటం నేర్చు

కోవాలి. రోజుకు కొద్ది గంటలు మాట్లాడకుండా మౌనంగా వుండటం అభ్యసించడం మంచిది. దీనితోనే సంతృప్తి జెందరాదు. అన్నిటికన్నా ముఖ్యం 'మనోమౌనం' ఈ 'మనోమౌనం' వల్ల మానవునికి ఎక్కువ ప్రయోజనం. మనస్సును నిశ్చలంగా వుంచుకోవాలి. ఎటువంటి దృశ్య పదార్థముల మీదకు మనస్సును పోనివ్వకుండా కట్టుదిట్టం చేయాలి. మనస్సు బహు చంచలమైనది. అనవసరమైన విషయాల మీదికి మనస్సును పోనివ్వకుండా భగవంతుని గూర్చి సత్ప్రవర్తనను గురించిన విషయములనే నిత్యమూ మననము చేయుచుండవలెను. ఆత్మ ధ్యానాదులయందు మాత్రమే మనస్సును కేంద్రీకరించవలెను. దీనినే 'మానసిక తపస్సు' అని అంటారు.

---

''విద్యకు, విజ్ఞానానికి వ్యత్యాసం ఉంది. విద్యద్వారా విజ్ఞానం సంపాదించి నప్పుడు ఆ విద్యకు విలువ ఉంది. జీవిత దృక్పథాన్ని, ఇతర ప్రజలతో లేక ఇతర సంఘాలతో ఉండవలసిన సంబంధాలను నిర్ణయించేదే విజ్ఞానం.''

—శ్రీమతి సరోజనీ నాయుడు

# వివేకవాణి

## పంచమ భాగము

## “సచ్ఛీలము”

## సచ్ఛీలము

## (Good Character)

సచ్ఛీల మనగా మంచి సంస్కారం, మంచి గుణం, మంచి నడత అని చెప్పుకుంటే సరిపోతుంది. ఎన్ని జ్ఞానములను సంపాదించి నప్పటికి 'సచ్ఛీలము' లేని యెడల ఆవ్యక్తి ఎందుకూ పనికిరాడు. కోట్ల కొలది ప్రాపంచిక విభవములున్న ప్పటికి శీలము లేని మనుజునకు ఈషన్మాత్రము విలువ కూడా వుండదు. శీలము లేనివాడు పశువుతో సమానం. శీలమే జీవునికి అలంకారం. సామాన్యులు బాహ్య సౌందర్యములకు విలువ యిస్తుంటారు. భగవంతుడు మాత్రం 'సచ్ఛీలము' నకు ప్రాధాన్యతనిస్తాడు. భగవంతుని దృష్టిలో సచ్ఛీలమే ధనము. సదాచారమే సంపద. ఎంతటి జ్ఞానులైనప్పటికి, వారికి నిగ్రహం, వినయం, విధేయత, అణుకువ, మర్యాద, సంస్కారములు లేకపోతే నాశనమైపోతారు. వారు కష్టించి సముపార్జించిన జ్ఞాన తపస్సు 'బూడిదలో పోసిన పన్నీరు'వలె ఎందుకూ పనికిరాకుండా పోతుంది. మనుష్యుని విలువ అతని బాహ్య సౌందర్యము నందు లేదు. ఆస్థి పాస్తులయందు అంతకన్నా లేదు. సచ్ఛీలమందు మాత్రమే కలదు. ప్రతి వ్యక్తి శారీరక, మానసిక శక్తులను సంపాదించడంలోనే సంతృప్తి చెందక 'సచ్ఛీలము' ను కూడా సంపాదించి తీరవలెను. శీలం లేనివాడు ఏ రంగం

లోను ప్రకాశించదు, రాణించదు, అతని కష్టం అంతా వృధా అయిపోతుంది,

"Character is 3/4 Religion" 'సచ్ఛీలమే మూడు పాళ్ళు మతం' అని పెద్దలు చెప్పారు. అది లేనిచో మతము నకు నామ రూపాలే వుండవు. ఒక వేళ వుండినను కళా కాంతులుండవు. ప్రస్తుత సమాజంలో చాలామంది మతము నందలి బాహ్య ఆచారములకే ప్రాధాన్యము నిచ్చి అట్ట హాసం చేస్తుంటారు. పటాటోపంగా వ్యవహరిస్తుంటారు. తమ శీలమునకు, చరిత్రకు ప్రాధాన్యత నివ్వరు. అంతఃశుద్ధి కలిగి వుండరు. బాహ్య శుద్ధికే ప్రాధాన్యత నిస్తుంటారు, విభూతి రేఖలను ధరించి, రుద్రాక్ష మాలలను వేసుకొని, కాషాయంబరధారులై, ఆడంబరంగా పరులు మెచ్చుకోవా లనే తాపత్రయంతో యజ్ఞయాగాదులు, పూజలు అట్ట హాసంగా చేస్తుంటారు, ఇటువంటి పటాటోపం గలవారిని గురించి 'వేమన' చక్కగా వర్ణించాడు.

ఆ. "ఆత్మశుద్ధి లేని యాచార మదియేల ?
భాండ శుద్ధి లేని పాకమేల ?
చిత్త శుద్ధి లేని శివ పూజలేల రా
విశ్వదాభిరామ వినుర వేమ."

అనగా "మనసు నిర్మలంగా లేని యాచార మెందుకు ? కుండ కడుగకొనకుండా వంట చేసుకొనుట వలన ఏమి బాగుంటుంది ? అటులనే చిత్తశుద్ధి లేని శివ పూజ నిష్ఫలం" అని అర్థం.

ప్రతి ఒక్కరు మొదట తన హృదయమును నిర్మలంగాను, మనస్సును స్వచ్ఛంగాను వుంచుకోవాలి. అటుల చేసుకొనకుండా ఆడంబరంగా చేసే పూజలవల్ల ప్రయోజనం శూన్యం. పై పై ఆడంబరములకు, ఆర్భాటములకు ప్రాధాన్యత నిచ్చేమతం ఆట్టేకాలం నిలువజాలదు. నిర్వీర్యమై, నిస్తేజమై త్వరితంగా క్షీణించి పోగలదు. ఒకవేళ వున్నప్పటికి లోన చెదలు తొలచివేసి, బయటకు ఆకారమాత్రముగా కన్పించు కొయ్య స్తంభంలాగే వుండును. చేవ అంతరించి డొల్లమాత్రం ఆకారానికి మిగులును. వట్టి డొల్లవల్ల ప్రయోజనం లేదుగదా! అంతః కరుణ విశుద్ధత్వం లేకుండా బాహ్యాచారములకు మాత్రమే ప్రాధాన్యత నివ్వడం వల్ల ప్రయోజనం లేకపోగా, అతి త్వరలో పతనమైపోతారు. కనుక సాధకులు అతి జాగరూకులై మెలగవలెను.

## శీలత్రయం

ఆధ్యాత్మిక క్షేత్రమున విజయమును సాధించవలెనని మనుజుడు 'శీలత్రయము' ను తప్పని సరిగా కలిగి యుండవలెను. దీనినే ఆంగ్లమున 'P³' అందురు. అనగా P x P x P. అనగా 'Purity' (పవిత్రత), Patience (సహనం) 'Perseverance' (పట్టుదల). ఎవరి హృదయమునందు ఈ శీలత్రయం తిష్ఠ వేసుకొని కూర్చొని వుంటుందో, అతడు విజయమును గురించి ఏమాత్రం సంకోచించ నవసరంలేదు.

లక్ష్యమును నిరాటంకంగా చేరుకొనగలడు. ప్రతి ఒక్కరు పవిత్రమైన గ్రంథములను చదవాలి, పవిత్రమైన ఆలోచనలు చేయాలి, పవిత్రమైన భావములను కలిగి వుండాలి. ఎటువంటి కష్టతరమైన పనులను కూడా ఓర్పుతో సాధించవచ్చును, ఓర్మిని ప్రదర్శించి అసాధ్యమైన విషయాలనయినా పరిష్కరించ వచ్చును. సహనంతో ఎటువంటి విపత్కర పరిస్థితులనైనా సునాయసంగా దాటవచ్చును. పట్టుదలతో దుర్భేధ్యమైన లక్ష్యాన్ని చేరుకొన వచ్చును, పట్టుదలతో సాధించ లేనిదంటూ ఏమీ లేదు. ప్రగతిపథాన్ని చేరుకోవాలంటే పట్టుదల అత్యావసరం. వ్యక్తి ఏ రంగంలో విజయాన్ని సాధించవలెననినా 'పవిత్రత, సహనం, పట్టుదల' లు అత్యావశ్యకములు. ఈ 'శీలత్రయము' ను సంపాదించి జీవితాన్ని సార్థకం చేసుకొనాలి. ''నీతి లేనివాడు కోతితో సమానం. శీలం లేనివాడు రాక్షసునితో సమానం, హృదయం లేనివారు పాషాణంతో సమానం.''

### శీలమే ప్రాణాధారము

ఎన్ని భౌతిక శక్తులను సంపాదించి నప్పటికి శీలం లేని శక్తి నిష్ప్రయోజనం. ప్రతి జీవికి శీలం ప్రాణాధారం. జీవితంలో ఎంతటి ఉన్నత పదవులనైనా సంపాదించ వచ్చును, సకల భోగభాగ్యములను, సమస్తాధికారములను అరచేతిలో యిరికించుకొన వచ్చును. అతి ముఖ్యమైన శీలమే గనుక లేకపోతే వాటన్నింటిని తృటిలో కోల్పోతాం. మనలో

మంచి శీలం గనుక వుంటే మనం దేనినైనా సాధించగలము. అది లేకపోతే ప్రతిదాన్నీ కోల్పోతాం. శీలం యొక్క ప్రాముఖ్యమును వివరించే ఒక చక్కటి 'నీతి కథ' ను వివరిస్తాను.

దానవుడైన 'ప్రహ్లాదుడు' అకలంక దైవ భక్తుడు. నిష్కామ బుద్ధితో అనేక పుణ్య కర్మల నాచరించి, అత్యున్నతమైన ఇంద్ర పదవిని కూడా సంపాదించాడు. పదభ్రష్టుడైన ఇంద్రుడు విచారముతో దేవతలకు గురువైన బృహస్పతి వద్దకు వెళ్ళి. తన గోడును చెప్పుకొని తరుణోపాయాన్ని అర్థిస్తాడు. తిరిగి సింహాసనమును పొందడానికి ఉపాయం చెప్పమని వేడుకుంటాడు. అప్పుడు బృహస్పతి ఒక చక్కటి సలహా నిస్తాడు. ప్రహ్లాదుడు దానం యిచ్చే సమయంలో, బిక్షుక రూపంలో అతని కొలువు వద్దకు వెళ్ళి శీలాన్ని దానం అడుగమని చెబుతాడు. బృహస్పతి సలహా ప్రకారం, ఇంద్రుడు బిక్షుక రూపంలో వెళ్ళి శీలాన్ని దానం యివ్వమని ప్రహ్లాదుడ్ని అర్థిస్తాడు. ప్రహ్లాదుడు ఆశ్చర్యపోయి "వట్టి శీలం వల్ల ప్రయోజనం ఏమిటి? దానితోనే సంతృప్తి జెందుతావా?" "అని అడుగుతాడు. యాచక రూపంలో నున్న ఇంద్రుడు 'అది ఒకటి చాలు' అని అంటాడు. ప్రహ్లాదుడు ఎట్టి సంకోచం లేకుండా 'తీసుకో' అనీ అనడంతోనే ఒక 'తేజస్సు' అతని దేహము నుండి బయటకు వచ్చి భిక్షుకుని రూపంలో నున్న ఇంద్రునిలో ప్రవేశిస్తుంది. భిక్షుకునిలో ప్రవేశిస్తున్న ఆ 'తేజస్సు' ను

చూచి "నీ వెవ్వరవు" అని ప్రహ్లాదుడు ప్రశ్నిస్తాడు, "నేను శీలాన్ని, నీవు వన్నాతనికి దానం చేసావు గనుక, నిన్ను వదలి అతనిలో ప్రవేశిస్తున్నాను" అని ఆ తేజస్సు బదులు చెబుతుంది, మరల కొంత సేపటికి మరొక 'తేజస్సు' ప్రహ్లాదుడి శరీరం నుండి బయిటకు వస్తుంది. మళ్ళీ దానిని 'నీ వెవ్వరవు' అని ప్రహ్లాదుడు ప్రశ్నిస్తాడు, అప్పుడు ఆ తేజస్సు "నేను నీ శౌర్యమును, శీలము యొక్క సేవకుడ్ని, నీలో శీలం వున్నంత కాలం నిన్ను సేవించాను, ఇప్పుడు శీలం వెళ్ళిపోయింది. కనుక నేను కూడా శీలం వెంబడే పోతున్నాను" అని ఆ తేజస్సు జవాబు చెప్పి యాచకుని రూపంలో నున్న ఇంద్రునిలో ప్రవేశిస్తుంది, చివరకు 'స్త్రీ' ఆకారంలో ఒక తేజస్సు ప్రహ్లాదుని శరీరము నుండి బయటకు వచ్చి "నేను నీ యొక్క రాజ్యలక్ష్మిని, నేను కూడా శీలం సేవకురాలినే, శీలాన్ని వెంబడించి నేను కూడా పోతున్నాను" అని చెప్పి ఆ తేజస్సు కూడా బిచ్చగానిలో ప్రవేశిస్తుంది.

ప్రహ్లాదుడు తన శీలాన్ని దానం యివ్వడం వల్ల, తన శౌర్యాన్ని, రాజ్యలక్ష్మిని కోల్పోయాడు. తన అధికారాన్ని వైభవాన్ని కూడా కోల్పోయాడు, పదవీచ్యుతుడైనాడు. అసలు ఇంద్రుడు తిరిగి సింహాసనాన్ని పొందాడు. ఇక్కడ నేర్చుకోనవలసిన 'నీతి' ఒకటి వున్నది. "మనలో శీలం గనుక వుంటే మనం దేనినైనా సంపాదించవచ్చును. శీలమే గనుక లేకపోతే ప్రతి దానినీ మనం కోల్పోతాం."

ఇది వ్యక్తి విషయంలో ఎంత నిజమో, జాతి విషయంలో కూడా అంతే. మన జాతీయ జీవన రంగంలో శీలానికి అత్యంతమైన ప్రముఖ స్థానంవున్నది. శీలం రెండు రకములు 1. వ్యక్తిగత శీలం, 2. జాతీయ శీలం. ప్రతి వ్యక్తిలో ఈ రెండు శీలాలు సమానంగా వున్నప్పుడే వ్యష్టి, సమిష్టుల ప్రగతి సాధ్యమవుతుంది, ఏ ఒక్కటి లోపించినా వ్యక్తి ప్రయత్నం నిష్ప్రయోజన మవుతుంది. ఈ రెండు ఒకే నాణెమునకు వున్న బొమ్మ, బొరుసులాంటివి. ఒక ప్రక్క జాతీయ చిహ్నం, రెండవ ప్రక్క నాణెం విలువ వుంటుంది. ఈ రెంటిలో ఏది అరిగిపోయినా నాణెం చెల్లదు. అదే విధముగా ఈ రెండు శీలాలు ప్రతి వ్యక్తికి తప్పని సరిగా వుండి తీరాలి. ఏ ఒక్క శీలం లోపించినా అతను చెలామణి కాలేదు. ఒక్కొక్క దానిని గురించి వివరిస్తాను.

## వ్యక్తిగత శీలము
## (Personal Character)

మనసంస్కృతిలో 'వ్యక్తిగత సచ్ఛీలము'నకు అత్యున్నతమైన, గౌరవప్రదమైన ప్రముఖ స్థానం యివ్వబడింది. "పవిత్రత, సహనం, పట్టుదల" అను శీలత్రయం గల వ్యక్తులనే మన అనాది సమాజం గౌరవించింది. అట్టి ఉన్నత పురుషులనే తత్వ వేత్తలుగా మన సమాజం గుర్తించింది. స్వార్థపరుణ్ణి, త్రాగుబోతును, కాంతా కాంచనములకు

దాసుడైన వానిని, సంస్కార విహీనుణ్ని. వినయ విధేయతలు లేనివాడిని - మన ప్రాచీన సమాజం ఎప్పుడూ తత్వవేత్తలుగా పరిగణించలేదు. ఆచార్యులుగా భావించి పూజించలేదు. కాని దురదృష్టవశాత్తు రాను రాను అటువంటి ఉన్నత భావములకు, ఆచారములకు తిలోదకాలివ్వడం జరిగింది. వ్యక్తిగత శీలమునకు యివ్వవలసినంత ప్రాధాన్యం ప్రస్తుత సమాజంలో ఎవ్వరూ యివ్వడం లేదు. సామాజిక రాజకీయ రంగములలో పనిచేసే కార్యకర్తల వ్యక్తిగత సచ్ఛీలమును గురించి ఎవ్వరూ పట్టించుకోవడంలేదు. అతని వ్యక్తిగత సచ్ఛీలం ఎంత హీనమైనప్పటికీ జోక్యం చేసుకొని మందలించడం అసలు జరుగడం లేదు. నేడు ప్రజానీకానికి కావల్సింది చక్కటి గంభీరమైన మహోపన్యాసములు, ప్రసంగములు, ప్రవచనాలు ప్రకటనలు మరియు భూరి విరాళములు మాత్రమే. నాయకుల వ్యక్తిగత సచ్ఛీలమును గురించి గమనించక పోవడం వల్లనే, నేడు మన సమాజం అనేక యిక్కట్లకు, అనర్థాలకు లోనవుతున్నది, కాని మన ప్రాచీన సమాజం, సంస్కృతి ఇటువంటి పరిస్థితిని ఎన్నడూ అంగీకరించి యుండలేదు.

మనకు శ్రీరామచంద్రుడు, వీర శివాజీ ఆదర్శం. ఆ మహానుభావుల జీవితాలు మనకు స్ఫూర్తినిస్తున్నాయి. వారు నడచిన బాట పరమోత్కృష్టమైనది, ఆదర్శ ప్రాయమైనది. వారు నీతినిజాయితీలతో ఆదర్శవంతమైన పరిపాలన చేసారు. వారు జాతీయ జీవన రంగంలో సాధించిన విష

యాలు అమూల్యాలు. వారి పరిపాలన విషయంలోనేగాక, వ్యక్తిగత వ్యవహారములలో కూడా వేలెత్తి చూపలేము. శ్రీరాముడు ఏక పత్నీవ్రతుడు. శివాజీ పరాయి స్త్రీలను తల్లులతో సమానంగా భావించి, గౌరవించేవాడు. యుద్ధంలో పట్టుబడిన ముస్లీం స్త్రీలను అవమాన పరచకుండా, సురక్షితంగా వాళ్ళ బంధువుల దగ్గరకు పంపించినట్లుగా చరిత్రలో ఎన్నో ఉదంతాలున్నాయి. శివాజి కుమారుడు శంభాజీ. అతి పరాక్రమ సంపన్నుడు. యుద్ధ నీతి దురంధరుడు. అయినప్పటికి శివాజీకి వచ్చిన పేరుప్రతిష్ఠలు అతనికిరాలేదు. చాలామంది విద్యావంతులకు అతని పేరుకూడా తెలియదు. కారణం ? వ్యక్తిగత స్వచ్ఛీలం లేక పోవడంవల్ల శంభాజి రాణించలేక పోయాడు. కాలగర్భంలో కలసిపోయాడు. చరిత్రహీనుడయ్యాడు. సచ్ఛీల రహితునివల్ల జాతికి, దేశానికి తీరని ప్రమాదం సంభవిస్తుంది, మనలోని బలహీనతలను శత్రువులు చక్కగా ఉపయోగించు కుంటారు. ముఖ్యంగా రాజ్యాధిపతులు విషయలోలురైతే మరీ ప్రమాదం. వారి ఆ బలహీనతలను పసిగట్టి, మాంయోపాయంతో, శత్రువులు రాజ్యాలను సహితం మ్రింగివేసినట్లుగా చరిత్ర పుటలను తిరుగవేస్తే మన కవగతమవుతుంది. స్త్రీలోలురైన రాజ్యాధిపతుల వద్దకు, సైన్యాధిపతుల వద్దకు అందమైన స్త్రీ గూఢచారులను పంపి, వలలో వేసుకొని, వారి రహస్యములను సేకరించి సామ్రాజ్యములను స్వాహా చేసిన ఉదంతాలు ప్రపంచ చరిత్రల్లో అనేకమున్నాయి. మానవునిలో మరొక భయంకరమైన బలహీనత కూడా

మరొకటి వున్నది. అదియే "పొగడ్త." ఈ ప్రశంసలకు చాలామంది. ఉబ్బితబ్బిబ్బై కోరినవన్నీ చేసి పెడుతుంటారు. ఇంద్రుడవు, చంద్రుడవు అని పొగడగానే ఒళ్ళు మరచి ఏమి చేస్తారో వారికే తెలియదు. ఇది చేయవచ్చా, చేయకూడదా! అనే విచక్షణాజ్ఞానం కూడా నశిస్తుంది. పొగడ్తల వలలో పడి యివ్వరాని హామీలను కూడా యిస్తారు. చేయరాని పనులను చేసిపెడుతారు. జీవన సంగ్రామ రంగంలో దేనినైనా ఎదిరించ వచ్చునుగాని పొగడ్తలకు, ప్రశంసలకు తట్టుకోవడం మాత్రం చాలాకష్టం. రాజాధిరాజులను మహా మంత్రులను పదవీచ్యుతులను చేయడానికి యిటువంటి కుటిలపద్ధతులను అనుసరించడం పరిపాటే గనుక ప్రతి వ్యక్తి ఇటువంటి బలహీనతలను దరికి చేరనీయరాదు. వాటికి దాసులు కారాదు. కాంతా కాంచనములకు దూరంగా వుండాలి. వీటివల్ల తాత్కాలికంగా కొంత ప్రయోజనం వున్నట్లు కనుపిస్తుంది. తాత్కాలికమైన ఆనందాన్ని, సుఖాన్నియిస్తాయి. కాని శాశ్వతమైన కీర్తి ప్రతిష్ఠలకు భంగం కలుగజేస్తాయి. కనుక ప్రతి వ్యక్తి వ్యక్తిగత సచ్ఛీలమును పెంపొందించు కోనాలి. మంచి సంస్కారములను అలవరచుకోనాలి. సభ్యతా సంప్రదాయాలను నేర్చుకోనాలి. ఎవరిచేతా, వేలెత్తి చూపబడటానికి వీలులేనటువంటి 'సత్ ప్రవర్తన' కలిగి వుండాలి. మచ్చలేని శీలము (Spotless Character) ను కలిగి వుండాలి. అటువంటి ఉత్కృష్టమైన ఆదర్శవంతమైన, పవిత్రమైన సచ్ఛీల సంపద కలిగియున్న వ్యక్తినే

పరిపూర్ణుడు'' అని అంటారు. కనుక అటువంటి పరిపూర్ణత్వమును ప్రతి వ్యక్తి తన జీవిత కాలంలో సంపాదించితీరాలి,

## జాతీయశీలం

## (National Character)

జాతీయ శీలమనగా 'దేశభక్తి' అని కూడా చెప్పకొనవచ్చును. మన దేశంలో పూర్వం నుంచి వ్యక్తిగతశీలం గలవారు పవిత్రులు ఎంతోమంది వుండేవారు. దేశభక్తులకు కూడా కొరతవుండేదికాదు. అతిబలపరాక్రమ సంపన్నులైన శౌర్యసాహసములు గల వీరాధివీరులు ఎందరో వుండేవారు. శక్తిమంతమైన సైన్యంతో పాటు అభేద్యమైన కోటలు, బురుజులు కూడా చాలా వుండేవి. ఇన్ని వున్నప్పటికి విదేశీయురాక్రమణలకు మన దేశం గురి అయింది. మన రాజాధిరాజులు ఓడించ బడ్డారు. మన సిరిసంపదలు కొల్లగొట్టబడ్డాయి. మన సంస్కృతీ చిహ్నములు చిందరవందరం చేయబడ్డాయి మన నాగరికత నాశనం చేయబడింది. మనపవిత్ర దేవాలయములు, కళాఖండము లెన్నో నేలమట్టం చేయబడ్డాయి. దీనికి కారణం? మన వారిలో, శక్తిసామర్థ్యములు లేకపోవడం వల్ల మనం ఓడించబడలేదు స్వార్థపరులు పెరగటం వల్ల మనం పతన మైనాం. వ్యక్తిశీలంతో పాటు వుండవలసిన 'జాతీయశీలం' లోపించడంవల్ల మనం ఓడిపోయాం. కొంతమంది రాజ్యాధినేతలలో 'దేశ

భక్తి భావం లుప్తం కావడం వల్ల మనకు పరాజయం లభించింది. ఈ విశాలభారతదేశం నాది అనే విశాలభావం తరిగిపోయి, ఎవరికివారు తమ సంస్థానపు సరిహద్దుల వరకే పరిమితమై, సంకుచితత్వంతో ఆలోచన చేయడం వల్ల ఎవరికివారు బలహీనులైనారు. జాతీయ దృక్పథం లేక పోవడంవల్ల విదేశీయుడైన అక్బర్ కు దాసుడై, తన సోదర భారతీయ వీరుడైన, 'రాణా ప్రతాప్ కు' తీరని ద్రోహం చేసాడు మానసింగ్. వీరాధివీరుడైన 'జయసింహుడు, స్వార్థంతో, ఔరంగజేబుకు పాదాక్రాంతుడై దేశభక్తుడైన శివాజీపై దండెత్తాడు. జయచంద్రుడు స్వలాభా పేక్షతో ఘోరీమహమ్మదుకు సహాయంచేసి వీరాధివీరుడైన 'పృథ్వీరాజ్'ను ఓడించడానికి కారణభూతుడైనాడు. శివ భక్తిపరాయణులమని చెప్పుకొనే కొంతమందిపూజారులు స్వార్థంతో, విదేశీయుడైన 'గజనీ మహమ్మద్'కు సహాయం చేసి పవిత్రమైన 'సోమనాథ దేవాలయ' పతనానికి ద్రోహంచేసారు, వీరందరూ వ్యక్తిగతంగా చాలా మంచి వారు, గొప్పవారే. కాని వీరిలో జాతీయ దృష్టి లేక పోవటంవల్ల, దేశభక్తి లుప్తం కావడంవల్ల, సమగ్రసమాజభావన మృగ్యంకావడం వల్ల, స్వార్థం పెచ్చు పెరిగి, స్వలాభాపేక్షతో శతృవులకు సహాయంచేసి, దేశ విచ్ఛిత్తికి కారణభూతులయ్యారు, ప్రతివ్యక్తికి దైవ భక్తివుండటం ఎంత అవసరమో, దేశభక్తికూడా అంతే అవసరం. వ్యక్తిభవిష్యత్తుకు నిజాయితీ ఎంత అవసరమో సమాజ శ్రేయస్సుకు 'జాతీయశీలం' కూడా అంత అవసరం. ఈ

రెండు ఒకే వ్యక్తిలో మూర్తీభవించినప్పుడే వ్యష్టికి, సమిష్టికి ప్రయోజనం వుంటుంది. తాను సంపాదించిన మంచితనం, పవిత్రశీలసంపద సమాజాభివృద్ధికి వినియోగించాలి. ప్రతి ఫలాన్ని కోరకుండా కీర్తిప్రతిష్టలను ఆశించ కుండా నిస్వార్థబుద్ధితో తనశక్తిసామర్థ్యములన్నింటిని దేశకళ్యాణ మునకు ఉపయోగించాలి, అహంకార, అహంభావములను దరికి చేర నీయరాదు' స్వార్థం సంకుచితత్వాలను విడ నాడాలి. తనసర్వస్వాన్ని భరతమాత పాద పద్మముల కర్పించి లోకోపకారమే తనకర్తవ్యంగా బావించి జాతీయ సమైక్యతను సంరక్షించడానికి, మాతృభూమి సమగ్రతను పరిరక్షించడానికి కార్యోన్ముఖు లవ్వాలి, మాతృదేశం యెడల ఎనలేని భక్తి ప్రవృత్తులు కలిగివుండాలి, ఈ మాతృభూమి మనకు అత్యంత పవిత్రమైనది, ఈ పుణ్య భూమిపట్ల మనహృదయాంత రాళములలో సతతమూ వీరోచిత భక్తిభావం ప్రజ్వరిల్లుతూవుండాలి. ఈ తపోభూమి లోని ప్రతిఅణువు పవిత్రమైనది. ఈ పవిత్రభారత భూమి గౌరవ ప్రపత్తులను యినుమడింపజేసేందుకు శక్తివంచన లేకుండా కృషిచేయాలి. దేశం సంస్కృతీ ధర్మపరంపరలను ప్రపంచానికిచాటాలి. భారత దేశస్వాతంత్ర్యాన్ని పరిరక్షించు కుంటూ. మన దేశం ప్రపంచంలో ఒక అగ్రరాజ్యంగా రూపొందడానికి అవసరమైన శక్తిని సముపార్జించడానికి ప్రతిపౌరుడు కృషిచేయాలి. స్వాతంత్ర్య సంగ్రామంలోసర్వ స్వాన్ని సమర్పించిన త్యాగధనుల నాదర్శంగా గైకొని, అమరవీరులస్ఫూర్తిని పొంది కార్యోన్ముఖులై నవభారత

నిర్మాణానికి శక్తివంచన లేకుండా కృషి చేయాలి. అధికార వ్యామోహం, బంధు పక్షపాతం విడనాడాలి. అవినీతిని పారద్రోలాలి. కష్టించి పని చేయాలనే భావం ప్రతివ్యక్తిలో జనించాలి. భారత దేశ భవిష్యత్తు మన మీద ఆధారపడి వున్నది. భరతమాత మనకోసం ఎదురు తెన్నులుచూస్తున్నది. తల్లిని సంతృప్తి పరచటం, సేవించటం, పూజించడం కుమారుల కర్తవ్యం. ఈ దేశమాత సౌభాగ్యమును మన కళ్లారా చూడాలి. ఈ పవిత్ర ఆశయం కోసం మనం జీవించాలి. ఇదే మన ధర్మం, మనకర్తవ్యం— దీనినే 'జాతీయ శీలం' అంటారు.

కనుక ప్రతి ఒక్కరూ వ్యక్తిగత సచ్ఛీలతతో పాటు 'జాతీయ సచ్ఛీలత' కూడా కలిగివుండాలి. శీలరాహిత్యం అత్యంత ప్రమాదకరమైనది. సచ్ఛీలంలేని వ్యక్తి తనను తాను ఉద్ధరించుకోన లేడు. దేశానికి ఏ మాత్రం ఉపయోగ పడలేడు. కనుక ప్రతి ఒక్కరూ ఈ రెండు శీలములను సంపాదించి జీవితమును సార్థకం చేసుకోవాలి.

## త్యాగము
## (Sacrifice)

త్యాగం కూడా ఒకరకమైన శీలమే. ప్రతివ్యక్తి అలవరచుకోనవలసిన సద్గుణములలో యిదికూడా ఒకటి. త్యాగం అంటే కొంతమంది దానం చేయడం, ధర్మం

చేయడం అని భావిస్తుంటారు. త్యాగానికి దానానికి ఎంతో తేడా వున్నది. దానం అంటే తనకున్న సంపదలో ఎంతో కొంత యితరులకు యివ్వడం. 'భూదానం, గోదానం, అన్న దానం, శ్రమదానం, విద్యాదానం, జ్ఞానదానం' మొదలగు నవి 'దానం' క్రిందకు వస్తాయి. దానం చేయడంవల్ల ఏ మానవుడూ, ఎప్పుడూ తన సర్వస్వాన్ని కోల్పోడు. "అదానదోషేణ భవేద్దరిద్రః' 'దానం చేయకపోవడం వల్లనే జీవుడు దరిద్రుడై జన్మించును.' ఇంకా ఒక మెట్టు పైకిపోయి తన న్యాయమైన అవసరములకు మాత్రమే వుంచుకొని మిగతాదంతా దానం చేయువాడు సమాజంచేత ఉత్తమోత్తముడుగా పరిగణించబడతాడు. అట్టివానికి భగవదనుగ్రహం కూడా ప్రాప్తిస్తుంది. "దేయం దీన జనాయచవిత్తం" దీనులకు, దరిద్రులకు తనకున్న దానిలో కొంత యిచ్చి సాయము చేయవలెనని శాస్త్రములు ఘోషిస్తున్నాయి. అటుల చేయక, స్వార్థంతో, కర్కశంగా, అన్యాయంగా, అక్రమంగా లక్షలు గడించి, కోటికి పడగ ఎత్తి కూర్చున్న దురాశాపరునికి, పిసినిగొట్టు (పిసినారి) వానికి, లోభికి ఎప్పుడో ఒకప్పుడు అధోగతి దాపురించక తప్పదు. అట్టి స్వార్థపరుడ్ని భగవంతుడు కూడా క్షమించడు. ఇతరులకు యివ్వక తానుతినక యావత్ సంపదను కూడబెట్టు 'లోభి'కి ఏ మాత్రం మనశ్శాంతి వుండదు. ఏదో ఒక విధంగా, ఎప్పుడో ఒకప్పుడు ఆ సంపద హరించుకొని పోతుంది. ఇదే వాస్తవము. ఈ శ్లోకంలో చక్కగా వర్ణించబడింది.

"చత్వారో విత్తదాయాదాః ధర్మభూపాగ్ని తస్కరాః
జ్యేష్ఠ క్రమవమానేవత్రయః కుప్యన్తి సోదరాః"

అనగా డబ్బుకు నలుగురు వారసులు కలరు. 1. ధర్మము 2. రాజు 3. అగ్ని 4. దొంగ. ఇందులో పెద్ద వారసుడు ధర్మము. పెద్దవారసునికి పెద్దవాటా రావలెను. అనగా ధర్మమునకు ఎక్కువ డబ్బు వినియోగించవలెనని అర్థం. పెద్దవారసుడైన 'ధర్మము' నకు, ఆస్తిలో పెద్ద భాగముకుగాని, చిన్నభాగమునుగాని, అసలు ఏభాగమును గాని యివ్వకుండా అవమాన పరచినచో, తక్కిన ముగ్గురు సోదరులైన రాజు, అగ్ని, దొంగలు అది భరించలేక కోపోద్రిక్తులై చెలరేగెదరు. అనగా ధర్మకార్యములకు తన సంపదను న్యాయసమ్మతంగా వినియోగించని పక్షంలో పన్నులరూపమున రాజు (ప్రభుత్వం) ఆ సంపదను కొంత స్వాధీనం చేసుకొనును. అగ్ని ప్రమాదములు సంభవించి ఆస్తికి నష్టమగును. దొంగలుపడి దానిని దోచుకొందురు. కాబట్టి ప్రతివ్యక్తి తన సంపదలో కొంత భాగమును దానధర్మములకు కేటాయించవలెను. పశుపక్ష్యాదులకు పెట్టవలెను. దాన ధర్మములకు వినియోగించు ద్రవ్యము ఇహమునందును, పరమునందును కూడా తిరిగివచ్చును. స్నేహితులకు వినియోగించు ద్రవ్యము ఇహమునందు మాత్ర మే తిరిగివచ్చును. భోగములకొరకు దుర్వినియోగము చేయు ద్రవ్యము ఇహమునందుగాని, పరమునందుగాని తిరిగిరాదు.

మేడమెట్లలో అత్యున్నతమైన ఆఖరిమెట్టు త్యాగం. సర్వోత్కృష్టమైన, అమితప్రియమైన వస్తువులను సహితం నవ్వుతూ, నవ్వుతూ ఏ మాత్రం సంకోచించకుండా యితరులకు యివ్వగలిగినవాడే నిజమైన 'త్యాగి' అని అంటారు. కర్మఫలమునను ఈశ్వరార్పణగా వదులుటయే త్యాగం. తనకు నిర్దేశించిన శాస్త్ర బద్ధమైన కర్మలను నిరంతరమూ చేయుచూ, ఫలితమును (మాత్రమే) త్యజించుటయే త్యాగ లక్షణం. దేనిని దానం చేయడంవల్ల, తనకు సర్వనాశనం తప్పదని తెలిసినప్పటికీ, ఏ మాత్రం సంకోచించకుండా, తన అస్తిత్వానికే మూలాధారమైన ఈ భౌతిక శరీరమును సహితం, తృణప్రాయంగా నెంచి, భావించి త్యజించడానికి సిద్ధమవుతాడో-అట్టివాడే నిజమైన 'త్యాగి'. అట్టివాడేమహా దాతలలో అత్యున్నతమైన స్థానాన్ని అందుకోగలుగుతాడు. సత్యమే జీవిత పరమావధిగా భావించి, పరోపకారమే ధర్మముగా నెంచి, మృత్యువునకుకూడా ఏ మాత్రం భయపడక, ధర్మసంస్థాపనార్థంతన జీవిత సర్వస్వాన్ని సమర్పించుకొనువారే నిజమైన 'త్యాగశీలురు.' "దుస్త్యజంకిం ధృతాత్మనాం." ధైర్యవంతులకు త్యాగము చేయలేని వస్తువేముంటుంది? అట్టి మహనీయులు తాత్కాలికమైన తుచ్ఛమైన ఆనందమును కోరుకోనరు. భౌతికమైన సౌఖ్యమును అసలే ఆశించరు. వారికి కావలసినది నిర్మలమైన, శాశ్వతమైన, ఆధ్యాత్మికానుభూతి మాత్రమే. మన ప్రాచీనపురాణ ఇతిహాసములను పరిశీలిస్తే అట్టి త్యాగశీలురు కోకొల్లలుగా కనిపిస్తారు. శిబిచక్రవర్తి, బలిచక్రవర్తి, దధీచి, కర్ణుడు

మొదలైన త్యాగశీలురు ఎందరో వున్నారు. మన భారతీయ చరిత్రను పరికిస్తే 'తానాజి' లాంటి త్యాగమూర్తులు యింకా ఎంతో మంది త్యాగధనులు కనుపిస్తారు.

## శిబిచక్రవర్తి

శిబిచక్రవర్తి పరిపాలనను, త్యాగనిరతిని పరీక్షించాలనే అభిలాష ఒక పర్యాయం ఇంద్రాగ్నులకు కల్గుతుంది. డేగ, పావురాల రూపంలో బయలుదేరి శిబి చక్రవర్తి విహరిస్తున్న ఉద్యానవనంలోనికి వస్తారు. డేగ చేత తరుమబడుతున్న పావురం, ఆత్మ సంరక్షణార్థం శిబి చక్రవర్తి ఒడిలోపడి రక్షించుమని వేడుకుంటుంది. భూతదయాపరాయణుడైన శిబిచక్రవర్తి పావురానికి అభయమిస్తాడు. ఇంతలో 'డేగ' వచ్చి తనకు ప్రియమైన, ఆహారమైన పావురాన్ని యిచ్చివేయుమని శిబిచక్రవర్తిని కోరుతుంది. తన చేత అభయాన్ని పొందబడిన పావురాన్ని ఎటువంటి పరిస్థితులలోను వదలనని కచ్చితంగా చెబుతాడు. కాని డేగ తన మొండి పట్టుదలను వదలదు. తన ఆహారాన్ని దాచడం ధర్మం కాదని కచ్చితంగా డేగ వాదిస్తుంది. అప్పుడు శిబిచక్రవర్తి ఆ పావురం ఎత్తు మాంసమును తన శరీరమునుండి యివ్వనన్నా యిస్తాను గాని పావురాన్ని మాత్రం వదలనని కచ్చితంగా చెబుతాడు. డేగ దానికంగీకరిస్తుంది. ఒక త్రాసులో ఒక ప్రక్క పావురాన్నివుంచి, రెండవప్రక్క తన శరీరాన్ని కోసి కొంత మాంసమును వుంచుతాడు. కాని

పావురంతో సరితూగదు. తన శరీరాన్ని కోసి ఎన్ని మాంసపు ముక్కలుంచి నప్పటికి పావురంతో సరి సమానంగా సరితూగదు. చివరికి తాను యిచ్చిన వాగ్దానమును నిలబెట్టుకొనడాని కోసం, తన శరీరమును యావత్తూ డేగకు సమర్పించు కుంటాడు. ఈ సంఘటన మనకు పరమోత్కృష్ట మైనను ఒక నీతిని బోధిస్తున్నది. ఆడిన మాటను నిలబెట్టు కొనడానికోసం, యిచ్చిన వాగ్దానమును నెరవేర్చుకొనడాని కోసం, అభయమిచ్చిన పావురాన్ని రక్షించడానికోసం 'శిబి' లాంటి మహా చక్రవర్తి ఏమాత్రం వెనుకాడకుండా, సంకోచించకుండా తన శరీరాన్నే సమర్పించుకొని ప్రపంచానికి త్యాగం యొక్క విలువను చాటాడు, గొప్పతనాన్ని చూపించాడు.

అదే విధముగా 'దధీచి' మహర్షి, వృత్రాసురుని చంపడానికి, ఇంద్రుడు మొదలగు దేవతలు వచ్చి కోరగానే ఏమాత్రం వెనుకాడక తా నాహుతియై. తన వెన్నెముకను వజ్రాయుధముగా తయారు చేసుకోవడానికి యిచ్చిన 'త్యాగశీలి' దధీచి. శుక్రాచార్యుడు వద్దని చెబుతున్నప్పటికి వినకుండా వామనునికి మూడడుగులు దానం యిచ్చి ఆత్మార్పణ చేసుకున్న మహాత్యాగి 'బలి చక్రవర్తి.' సూర్యుడు ఎంతవద్దని బలవంతం చేస్తున్నప్పటికి, తన శక్తికి మూలమైన కవచకుండలాలను సునాయాసంగా ఇంద్రునికి దానం చేసిన త్యాగ పురుషుడు ''దాన కర్ణుడు''. పసుపు బట్టలతో వివాహ వేదిక నుండి బయటకు వచ్చి కొడమ

సింహంలా రణరంగంలోనికి దుమికి వీరవిహారంచేసి "సింహఘడ్" ను ఆక్రమించి విజయలక్ష్మిని చేబట్టి కన్నుమూసిన వీరాధివీరుడు "తానాజి". నవ్వుతూ నవ్వుతూ ఉరికంబాని కెక్కి ఉరిత్రాడును తలకు తగిలించుకొని అమర వీరుడైనాడు 'భగత్సింగ్'. భారత పురాణ, ఇతిహాస, చరిత్రలు త్యాగాలకు నిలయాలు. ఈ దేశం త్యాగధనులకు పుట్టినిల్లు. ఇక్కడి చరిత్రలో ఏ పుటలు త్రిప్పినా కనుపించేది త్యాగం, బలిదానం, ఆత్మార్పణలు. ఇవే భారత దేశానికి పట్టుకొమ్మలు.

కాని దురదృష్టవశాత్తు రాను రాను శబ్దాలకు అర్థాలు మారిపోతున్నాయి. త్యాగం, దానం, ధర్మం ఒక వ్యాపారంగా మారిపోతున్నవి. స్వార్థం, సంకుచితత్వం విలయతాండవం చేస్తున్నాయి. అధికార వ్యామోహం, పదవీ కాంక్ష పెచ్చు పెరిగిపోయింది. ఒకప్పుడు త్యాగభూమిగా పేరుగాంచిన ఈ పవిత్ర తపోభూమి నేడు భోగభూమిగా మారిపోతున్నది. ఇది మారాలి. చరిత్ర పునరావృత్తం కావాలి. త్యాగశీలురు తిరిగి ఉద్భవించాలి. ప్రతి భారతీయ యువకుడు తిరిగి త్యాగమూర్తిగా మారాలి. దేశ సౌభాగ్యం కోసం, పరిరక్షణకోసం, సర్వస్వాన్ని అర్పించిన త్యాగమూర్తుల అడుగుజాడలలో మనం నడవాలి. మన మాతృదేవి ఔన్నత్యాన్ని ప్రపంచానికి చాటాలి. ప్రపంచానికి తిరిగి జ్ఞాన భిక్ష పెట్టాలి. ఈ మహత్తర ఆశయం సాధించేందుకు ప్రతి భారతీయ యువకుడు శక్తి

వంచన లేకుండా త్యాగం చేయడానికి సిద్ధపడాలి. భోగం కంటే త్యాగమే ఎక్కువ మధురమైనది. త్యాగమే జీవిత పరమావధి కావాలి. "త్యాగాత్ శాంతిః" త్యాగము వలననే శాంతి చేకూరగలదు. మనస్సుకు శాంతి లేకపోతే దుఃఖాలు మనల్ని వదలిపెట్టవు. శాశ్వతంగా మనలోనే కాపురం చేస్తుంటాయి. ఆత్మ శాంతి లేనివానికి ఎంత సంపద వున్నప్పటికీ ప్రయోజనం శూన్యం. కర్మ ఫలమును నిష్కామ బుద్ధితో త్యజించుటయే 'త్యాగం.' అట్టిత్యాగము వలననే చిత్తశుద్ధి కలుగుతుంది. చిత్తశుద్ధి వలన శాంతి ఉదయిస్తుంది. "త్యాగేనైకే అమృతత్వ మానశుః" 'త్యాగము చేయుట వలననే మోక్షము సిద్ధించును' అని ఉపనిషత్తులు చెప్పుతున్నాయి. త్యాగమే శిష్టుల ప్రధాన లక్షణం. కనుక ప్రతి వ్యక్తి తన జీవితాన్ని త్యాగమయం చేసుకోవాలి. కీర్తి ప్రతిష్ఠలు కాంక్షించక పోయినప్పటికీ, అట్టి త్యాగము వలన, వాటంతట అవేవస్తాయి. పేరు ప్రతిష్ఠలు పొందాలనే స్వార్థంతో, ప్రత్యుపకారం ఆశించి మాత్రం త్యాగం చేయరాదు. నిస్వార్థ బుద్ధితో ఎట్టి ఫలాన్ని ఆశించకుండా, తనవిధ్యుక్త ధర్మమని భావించి త్యాగం చేయాలి; అన్ని రకముల ధనముకన్నా 'త్యాగ ధనం' చాలా గొప్పది. అట్టి త్యాగధనమును సంపాదించిన వాడే ధన్యుడు. అతనే ఇహ పరలోకములందు శాశ్వతమైన కీర్తి ప్రతిష్ఠలను పొందగలుగుతాడు. కనుక ప్రతి ఒక్కరూ త్యాగనిరతిని శ్రద్ధతో అలవరచుకోవాలి.

''శీలం, ప్రవర్తన పెంపొందించడం ప్రథమ కర్తవ్యం. పిల్లలకి ధైర్యం, బలం, నీతి, ఉన్నతాశయాలు అలవర్చడం అవసరం. ఇది అక్షరాస్యత కన్నా ముఖ్యం. చదువు యొక్క ప్రధాన లక్ష్యం అదే.''

—శ్రీ మహాత్మా గాంధీజీ.

''జీతమునకు మాత్రమే కాదు. జీవితమునకే విద్య అవసరము. అట్టి విద్య వలన సత్య ధర్మ శాంతి ప్రేమ దయాది సద్గుణములు బాలల హృదయములయందు ప్రతిష్ఠించుటచేత రాబోవు అన్యాయ, అక్రమ, అసత్య రూపములు నశించి పోగలవు. ఇట్టి విద్య వలన పవిత్ర హృదయములైన బాలల జీవితములు ఉత్తమోత్తములగును.

—శ్రీ సత్య సాయిబాబా

''నీ గురువును గూర్చి ఇతరులాడు నిందావాక్యములను విని సహింపకుము, అతడు నీ తల్లి దండ్రులకన్నా ఉత్తముడు. నీ తల్లి దండ్రుల నెవ్వడేని నీ ఎదుట దూషించుచో విని ఊరుకుందువా? అవసరమగుచో పోరాడియైనను నీ గురువు ప్రతిష్ఠను కాపాడుము.''

—శ్రీ రామకృష్ణపరమహంస.

# వివేకవాణి

## షష్ఠమ భాగము

## "ఇతర విశేషాంశములు"

# ఐకమత్యము

"ఐకమత్యమే మహాబలం." వ్యష్టిగా సాధించలేని కార్యము, సమష్టిగా సాధించవచ్చును. కుటుంబం అభివృద్ధి జెందవలెననిన, గ్రామం పురోభివృద్ధిగాంచవలెననిన దేశం సస్యశ్యామలం కావలె నననిన ఐకమత్యం, సంఘీభావం అత్యావసరములు. అనైక్యత అనర్థానికి దారితీస్తుంది. సమైక్యత సంరక్షిస్తుంది. గడ్డిపోచ 'ఉఫ్' అంటే గాలికి లేచి పోతుంది. అతిబలహీనమైన ఆగడ్డిపోచలను ఒకచోట చేర్చి, వెంటిగా (త్రాడుగా) తయారు చేసి, ఆ వెంటితో మదించిన మదపుటేనుగనుసహితం బంధించ వచ్చును. విడివిడిగానున్న గడ్డిపోచలలో ఏ శక్తి లేదు. చిన్నగాలికి కూడా తట్టుకోలేవు. అటువంటి బలహీనమైన గడ్డిపోచలు ఒకచోట చేరటంతోనే అజేయమైన శక్తిని సంపాదించ గలిగాయి. కనుక ఎవరికి వారు విడిగా ఏ కార్యమును సఫలీకృతం చేయలేరు. అదే పదిమంది ఒక సంఘముగా ఏర్పడినయెడల సాధించ లేనిదంటూవుండనే వుండదు. అందుకోసమనే మన పెద్దలు "సంఘే శక్తిః కలౌయుగే" 'కలియుగమున సంఘము నందే శక్తి కలదు,' అని చెప్పారు. సంఘశక్తికి మించినది ఇహము నందు వేరొకటి లేదు. శక్తివంతుడిదే రాజ్యం. శక్తివిహీనుడైన బలహీనుడు సమాజాభివృద్ధికి ఏమాత్రం ఉపయోగ పడలేడు. శక్తిలేని వానిని

ఎవ్వరూ ఖాతరు చేయరు, సంఘటిత శక్తి వల్లనే దేశ సమైక్యత సమగ్రత నిలబడుతుంది. శక్తిమంతమైన బలవంతమైన దేశమును మాత్రమే ప్రపంచం గౌరవిస్తుంది. అట్టి శక్తి ఐకమత్యం వల్లనే ఉద్భవిస్తుంది.

ఐకమత్యమునకు, అన్యోన్యతకు చక్కటి ఉదాహరణ మానవ శరీరము. అనేక విధములైన అవయవములతో మానవశరీర నిర్మాణం జరిగింది. వేటికి ఏపని కేటాయించబడిందో, ఆ పనిని చక్కగా, ఐకమత్యంగా అవి చేస్తుంటాయి. మనిషి ఎక్కడికి వెళ్ళాలని మనస్సు సంకల్పించుకున్న మరుక్షణంలో అక్కడికి కాళ్ళు తీసుకొని వెళ్ళుతాయి. ఏపనిని చేయాలని కోరుకుంటే ఆ పనిని చేతులు చేస్తాయి. దేనిని చూడదలుచుకుంటే దానిని కండ్లు చూస్తాయి. దేనిని విన దలుచుకుంటే దానిని చెవులు వింటాయి. దేనిని వాసన చూడ దలుచుకుంటే దానిని ముక్కు వాసనచూస్తుంది. దేనిని తిన దలచుకుంటే దానిని నోరు తింటుంది. కడుపు నిండి మనస్సు శాంతిస్తుంది అది జీర్ణమై, రక్తరూపంలో తిరిగి శరీరంలోని అన్ని భాగములకు తారతమ్యం లేకుండా గుండె రక్తమును సరఫరా చేస్తుంది. తిరిగివచ్చిన రక్తమును ఊపిరితిత్తులు పరిశుభ్రం చేస్తాయి. ఈ విధంగా ప్రతి నిత్యం ఆగకుండా వేటి పనిని అవి సంఘీభావంతో చేస్తూనేవుంటాయి. ఒక వేళ దురదృష్టవశాత్తు శరీరంలోని ఈ అవయవముల మధ్య పేచీవస్తే అంతటితో ఆటకడుతుంది. మేము రోజంతా ఎంతో శ్రమపడి సంపాదించి తీసుకొనివచ్చి మంచిగా, రుచిగా వండిన ఆహార

పదార్థములను ఏమీ పనిచేయకుండా నోరు ఒక్కటే అంతా తినివేస్తున్నదనే భావం, మిగతా అవయవములలో కలిగి ఏ పనీ చేయకుండా సమ్మెను ప్రారంభిస్తే, బహుకొద్ది కాలంలోనే ఆ శరీరం నీరసించి, చిక్కిశల్యమై నశించిపోతుంది. అసలు మొదలుకే మోసం వస్తుంది. కనుక శరీరం పుష్టంగా, బలంగా వుండాలంటే అవయవములమధ్య అన్యోన్య సహకారం ఐకమత్యం, సంఘీభావం తప్పనిసరిగా వుండాలి. శరీరంలోని ఏ అవయవమునకు జబ్బు చేసినా, దెబ్బ తగిలినా శరీరం అంతా బాధ పడుతుంది. దేనికి వుండే ప్రాముఖ్యత దానికున్నది. ఒకటి తక్కువ, మరొకటి ఎక్కువ అనే అభిమానం మనలో రాకూడదు. అన్నీ కలిసి పనిచేసినప్పుడే శరీరం ఆరోగ్యంగావుంటుంది. అదేవిధముగా కుటుంబాభివృద్ధికిగాని, గ్రామాభివృద్ధికిగాని, దేశాభివృద్ధికి గాని—అందరూ కలసి, మెలసి సమైక్యంగా, సంఘీభావంతో తమ బాధ్యతలను నిర్వర్తించినప్పుడే జరుగుతుంది.

మన దేశచరిత్రను ఒక్క పర్యాయం పరిశీలిస్తే, ఈ సమష్టి సమైక్యతాభావం లోపించడం వల్లనే మనం పతనమైనాం. మన దేశంలో శక్తిసంపన్నులైన రాజాధిరాజులు లేకపోవడంవల్ల మనం ఓడిపోలేదు. వారిమధ్య సహకారం, అన్యోన్యమైన ప్రేమ, ఐకమత్యం, సమాజదృష్టి లేకపోవడం వల్లనే మనం విదేశీ దురాక్రమణలకు గురైనాం. మన వారి మధ్య ఈర్ష్య, అసూయ, ద్వేషములు పెచ్చుపెరిగి పోవడం వల్లనే మన దేశం విదేశీయులచేత కొల్లగొట్టబడింది.

ప్రాంతీయ దురభిమానం, కులతత్వం, వర్గవైషమ్యాలు విజృంభించడంవల్లనే మన జాతి బలహీనమైంది. మన బలహీనతలను ఆసరాగాగైకొని విదేశీయులు తమ విషకబంధ హస్తములను మనదేశం మీద చాపగలిగారు. మనలోనున్న ఈ బలహీనతలను బ్రిటిషువారు చక్కగా ఉపయోగించుకొని సుస్థిరమైన సామ్రాజ్యమునుమనదేశంలో నెలకొల్పగలిగారు. (Divide and Rule) 'విభజించిపాలించు' అనే రాజనీతిని ప్రయోగించి మనజాతిని సంస్కృతిని సర్వనాశనంచేసారు. భాషలు వేరైనా ఆచారవ్యవహారాలు భిన్నముగా వున్నా, యావత్ భారతదేశంలోని ప్రజలందరూ ఒకే జాతికి, ఒకే సంస్కృతికి, ఒకే ధర్మానికి చెందిన వారనే భావం, మనలో లోపించడం వల్లనే, విదేశీయులు మరికొన్ని విషబీజాలను మనలో నాటకలిగారు. స్వాతంత్ర్యం వచ్చి 31 సంవత్సరములు దాటినప్పటికి ఈ విచిత్ర స్వార్థ పూరిత భావములకు స్వస్తి చెప్పలేక పోయాం. కొందరు స్వార్థపరులు యిప్పటికీ తమ రాజకీయ స్వప్రయోజనములకోసం కులాన్ని, వర్గాన్ని, మతాన్ని వాడుకుంటూ వుండటం కడు శోచనీయం. ఈ స్వార్థదుష్ట కుటిల భావముల వల్లనే దేశానికి తీరని నష్టం వాటిల్లుతున్నది. కనుక ప్రతి భారతీయుడు దేశసమగ్రతను, సమైక్యతను పరిరక్షించడానికి ప్రతిజ్ఞ పూనాలి. మనలో మనకున్న విభేదాలను విస్మరించాలి. జాతీయ దృష్టిని అలవరచుకోవాలి. నవసమాజ నిర్మాణానికి సమైక్యతా సంఘీభావములు అత్యావసరములు. ''వయం పంచాధికశతం'' అని చెప్పిన ధర్మ

రాజు నీతిని ఆచరణలో పెట్టాలి. 'మేము నూట ఐదుగురము అన్నదమ్ములము' అని ధర్మరాజు చెప్పాడు. వారి మధ్య తగాదా వచ్చినప్పుడు మాత్రం పాండవులు ఐదుగురు, కౌరవులు నూరుగురు. వారిమీదకు మరెవరైనాయితరులు దండెత్తివస్తే అప్పుడు వాళ్లు నూటఐదుగురు సోదరులు. ఈ నీతిని మనంకూడా అనుసరించాలి. మనలో వుండే భేదాలను బాహ్యప్రపంచానికి చూపరాదు. వ్యక్తిభేదా లుండవచ్చును. సిద్ధాంత పరమైన భేదా లుండవచ్చును. మతాలు వేరు కావచ్చును, భాషలు భిన్నంగా వుండవచ్చును. అయినప్పటికీ మన మంతా ఒకే కుటుంబీకులం. ఈపవిత్ర భూమిలో జన్మించిన భరతమాతపుత్రులం. ''మనదిఒకేజాతి, ఒకే సంస్కృతి, ఒకేధర్మం''— ఈ యథార్థమును మాత్రం విస్మరించరాదు. ''సమత, సమగ్రత, సమైక్యత, సౌభ్రాత్రం'' సమాజాభివృద్ధికి మూలస్తంభాలు. ఈ నాలుగు స్తంభాలు పటిష్టంగా వున్నప్పుడే సౌధం నిలబడ గలుగుతుంది. ఏ ఒక్కదానికి అపాయం వాటిల్లినామొత్తం సౌధం కుప్పగా కూలిపోతుంది. నేలమట్టం అవుతుంది. అందవిహీనమై కళాకాంతులు లేకుండా పోతాయి. కనుక ఐకమత్యమనే మహాశక్తిని సముపార్జించాలి. జీవితంలో అనుభవం లోనికి తెచ్చుకోవాలి. దేశకళ్యాణం కోసం సమైక్యంగా సమష్టిగా కృషిచేయడం నేర్చుకోవాలి. వ్యక్తి స్వేచ్ఛా స్వాతంత్ర్య ములను పరిరక్షించడానికి కంకణ ధారులవ్వాలి. ప్రజాస్వామ్య వ్యవస్థను పటిష్టం చేయడానికి శక్తివంచనలేకుండా శ్రమించాలి. ప్రపంచంలో ఒక

ప్రముఖ అగ్రరాజ్యంగా మన దేశం విలసిల్లేట్లుగా చేయాలి. ఈ మహా ప్రయత్నములో ప్రతిఒక్కరూ భాగస్వాములవ్వాలి. ఈ భరతమాత కరుణాకటాక్షముల వల్ల మనకు తిండి, గుడ్డ, విద్యలభిస్తున్నది. ఆమె ఋణం తీర్చుకోవడం మన విద్యుక్త ధర్మం, కర్తవ్యం కూడాను. ఆమెగౌరవమే మన గౌరవం. ఆమె సౌభాగ్యమే మన సౌభాగ్యం. ఆమె శ్రేయస్సే, మన శ్రేయస్సు. ఈ మహోత్కృష్టమైన భావనను, సమాజదృష్టిని ప్రతి ఒక్కరూ కలిగి వుండాలి. సమైక్యతను పెంపొందించుకోవాలి. ఐకమత్యంతో, సంఘీభావంతో, సమైక్యంగా పోరాటానికి సంసిద్ధం కావాలి. వ్యక్తిగతమైన కోరికలకు ప్రాధాన్యమివ్వరాదు. సమాజ శ్రేయస్సునకే అత్యున్నత మైన ప్రాధాన్యత నివ్వాలి. అప్పుడే గాంధీజీ కనిన కలలు సఫలీకృత మవుతాయి. అమరవీరుల ఆశయాలు నెరవేరుతాయి.

---

''ఉత్తమ శీల స్వభావాలు కలవాడు సర్వులనూ జయిస్తాడు. వ్యక్తికి ప్రధానమైన శీలం నశిస్తే వాని జీవితం వ్యర్థమే.''

—విదుర నీతి

''అనుకరణ నాగరికత గాదు. అనుకరణ అభ్యున్నతికి లక్షణం కాదు. మానవుని యొక్క ఘోరమైన పతనానికి అది చిహ్నం.''

—శ్రీ స్వామి వివేకానంద

# దూరదృష్టి

జీవితంలో విజయాన్ని సాధించవలెనన్న 'దూరదృష్టి' ప్రతిఒక్కరికి ఉండితీరాలి. రానున్న ఆపదలను ముందుగానే పసిగట్టి తరుణోపాయమును కనుగొనుటనే "దూరదృష్టి" అందురు. విజ్ఞతతో కూడిన 'దూరదృష్టి' కావాలి. దూర దృష్టితో ఆలోచించకుండా, తొందరపడి ఏపనీ చేయరాదు. దూరదృష్టి కలవారు మాత్రమే ఆపదలను బహు తేలికగా దాటకలుగుతారు. అట్టి దూరదృష్టి లేనివారు ఆపదలకు లోనవుతారు. దీర్ఘాలోచన లేకుండా చేసే పనులు అనర్థానికి దారితీస్తాయి. తొందరపాటుతనంవల్ల కార్యం చెడిపోతుంది. ఈ విషయమున మహాభారతంలో ఒక చక్కటి కథ కలదు. దీనిని భీష్ముడు ధర్మరాజుకు చెబుతాడు.

చిన్నకథ

ఒక కొలనులో మూడు చేపలుండేవి. వాటి పేరు 1. దీర్ఘదర్శి. 2. ప్రాప్తకాలజ్ఞుడు 3. దీర్ఘసూత్రి. వీటిలో మొదటిదైన 'దీర్ఘదర్శి' దూరదృష్టి కలది. రానున్న ఆపద లను ముందుగానే పసిగట్టి తరుణోపాయాన్ని ఆలోచించి, ముందు జాగ్రత్తపడగల సామర్థ్యంకలది. రెండవ చేప అయిన 'ప్రాప్త కాలజ్ఞుడికి' అటువంటి దూరదృష్టి లేదు. కొంత ప్రయత్నలోపంకూడా ఉంది. కాని ఆపదలు ముంచు కొని వచ్చినప్పుడు మాత్రం సమయస్ఫూర్తితో వ్యవహరించి, తప్పించుకొనగల సామర్థ్యం మాత్రం కలదు. మూడవ చేప

అయిన 'దీర్ఘసూత్రి' కి మాత్రం దూరదృష్టి అసలేలేదు. సమయస్ఫూర్తి అంతకన్నా లేదు. ఏ ప్రయత్నమూ చేయని సోమరి. స్వల్పకాలంలో చేయవలసిన చిన్నపనిని కూడా గంటలు తరబడి చేయు స్వభావం కలది,

ఈ మూడుచేపలూ నివసిస్తున్న ఆ కొలనును చూడటానికి ఒకరోజు సాయంత్రం బెస్తవారు వచ్చారు. బాగా బలిసియున్న చేపలను చూచి మురిసిపోయారు. రేపు ఉదయం వలలు తీసుకొనివచ్చి పట్టుకుందామని వాళ్ళలో వారు సంప్రదించుకొని ఇండ్లకు తిరిగివెళ్ళారు. ఆ బెస్తవారి మాటలు ఆమూడుచేపలు విన్నాయి. అందులో మొదటి చేప అయిన 'దీర్ఘదర్శి' రానున్న ఆపదను గ్రహించి మిగతా రెండు చేపలను హెచ్చరిస్తుంది. ఆ బెస్తవారు రాకమునుపే ఆ కొలనును వదలి మరొక కొలనును జేరడం మంచిదని హితవు చెబుతుంది. కాని మిగతా రెండు చేపలూ 'దీర్ఘదర్శి' మాటలను ఖాతరుచేయవు. రెండవ చేప అయిన 'ప్రాప్తకాలజ్ఞుడు' ఎప్పుడో రానున్న ఆపదలను గురించి యిప్పడినుంచే అనవసరంగా బుర్ర చెడగొట్టుకోవడం అనుచితమని చెబుతుంది. మూడవచేప అయిన 'దీర్ఘసూత్రి' మాత్రం వేదాంతం వల్లెవేస్తుంది. మరణించే కాలంవస్తే ఎక్కడున్నా తప్పించుకోలేమని శ్రీరంగనీతులు చెబుతుంది. రెండవ, మూడవచేపలు చెప్పినమాటలను విని మొదటిచేప అయిన 'దీర్ఘదర్శి' వాళ్ళ అవివేకమునకు చింతించి, ఆ కొలనును మరుక్షణంలో వదలి మరొక కొలనుకు చేరి

సురక్షితంగా వుంటుంది. మరునాడు ఉదయమే జాలరులు వలలు తీసుకొనివచ్చి ఆ కొలనులో వేస్తారు. రెండవ, మూడవ చేపలైన ప్రాప్తకాలజ్ఞుడు, దీర్ఘసూత్రి ఆ వలలో చిక్కుకుంటారు. జాలరులు పైకితీసి ఆ రెండుచేపలను ఒడ్డున పడవేస్తారు. రెండవచేప అయిన 'ప్రాప్తకాలజ్ఞుడు' వచ్చిన ఆపదను గ్రహించి, సమయస్ఫూర్తితో చచ్చిన దానిలా పడివుంటుంది. ఆ జాలరులు చచ్చిన చేప దేనికని తిరిగి ఆకొలనులో విసిరిపారేస్తారు. బ్రతికానుకదాయని కొలను లోపలికి వెళ్ళిప్రాణములను రక్షించుకొంటుంది. మూడవ చేప అయిన 'దీర్ఘసూత్రి' మాత్రం, ఏమాత్రం స్వబుద్ధి నుపయోగించక ఒడ్డునపడి గిలగిలా కొట్టుకుంటూ వుంటుంది. బాగా బలసినచేప దొరికిందనే సంతోషంతో, జాలరులు ఆ చేపను బుట్టలో వేసుకుని, ఇంటికి తీసుకొనివెళ్ళి కోసి చక్కగా కూరచేసుకొని తిని హాయిగా పడుకుంటారు.

ఈ కథవల్ల మనం ఒక నీతిని నేర్చుకోవాలి. ప్రతి ఒక్కరు మొదటి చేపఅయిన 'దీర్ఘదర్శి' యొక్క దూర దృష్టిని కలిగి వుండాలి. అటువంటి వివేకం గలవారు, ముందు చూపు గలవారు మాత్రమే జీవితంలో విజయమును పొందగలుగుతారు. రెండవ చేపఅయిన 'ప్రాప్తకాలజ్ఞుడు' లాగే కష్టములొచ్చి మీదపడేదాకా మెదలకుండా కూర్చొనకూడదు. ఒక వేళ అనుకోకుండా దురదృష్టవశాత్తూ హటాత్తుగా ఆపదలు మీద వచ్చిపడుతే మాత్రం ప్రాప్తకాలజ్ఞుడు, చూపిన సమయస్ఫూర్తిని చూపి

ఆపదల నుండి కడు చాతుర్యంగా బయట పడటం నేర్చుకోవాలి. మూడవ చేప అయిన 'దీర్ఘసూత్రి' లాగ మాత్రం ఎవ్వరూ వుండ కూడదు. అది వర్ణించినట్లుగా వొట్టి వేదాంతం చెప్పినందువల్ల ఏమాత్రం ప్రయోజనం వుండదు. పురుష ప్రయత్నం ఏమాత్రం లేకుండా, అంతా భగవంతుని మీదనే భారం మోపి కాళ్ళు చాచి కూర్చునే వానిని సాక్షాత్ ఆ భగవంతుడుకూడా రక్షించ లేడు. "గాలిలో దీపంపెట్టి దేవుడా నీ దయ" అంటే దేవుడు కూడా ఏమీ చేయలేడు. దీపం ఆరడం ఖాయం. దీపానికి చుట్టూ గ్లాసునమర్చి, పైనటోపీపెట్టి రక్షణకల్పించి నప్పుడే 'దీపం' గాలికి తట్టుకొని నిలబడగలుగు తుంది. రైతు ఏదో ఒకరకమైన విత్తనములను తెచ్చి భూమిలో చల్లినంత మాత్రమున పంట పండదు. విత్తనాలు మంచివి సేకరించాలి. భూమిబాగా దున్ని పదును చేయాలి. ఎరువులు వేయాలి, చక్కగా నీరుపెట్టాలి. పురుగుపడ కుండా మందు చల్లుతుండాలి. కలుపు తీస్తుండాలి. పశు పక్ష్యాదులు తినకుండా దొంగలు దొంగిలించ కుండా మంచి కాపలా పెట్టాలి. మానవుడు చేయవలసిన పనులన్నీ చక్కగా చేయకుండా ఫలితం కోసం దేవుని మీద భారం వేయుడం అవివేకం. మానవుడు చేయ వలసిన పనులన్నీ సక్రమంగా నిర్వర్తించి వర్షం కోసం వరుణదేవుని ప్రార్థించాలి. ఏరంగంలో విజయమును సాధించ వలెననినా పురుష ప్రయత్నం ముఖ్యం. విధి కృతం అని తల ఒగ్గి కూర్చోవడం పురుష లక్షణం కాదు. మన కర్తవ్యాన్ని

మనం నిర్వర్తించాలి. పిదప దైవ సహాయం కోసం అర్థించాలి.

వీరులు విధికితలఒగ్గి చేతులుముడుచుకొని కూర్చోరు. దుర్బలులు మాత్రమే విధికి తలవంచుతారు. ఒకవేళ కష్టాలు వచ్చినప్పటికి, ధీరులు ధైర్యంగా వాటి నెదుర్కొని విజయలక్ష్మిని చేబట్ట గలుగుతారు. ధైర్యమును విడనాడిన భీరువులు ఏ ప్రయత్నమూ చేయలేరు. పురుష ప్రయత్నంతో విధిని జయించాలి గాని మన భవిష్యత్తు ఏవిధంగా వుంటే ఆ విధముగానే జరిగితీరుతుందని, నిరుత్సాహంతో కాళ్ళు బారజాపి, నిస్పృహతో మూలకూర్చొన రాదు. ఏపనిని సాధించవలెననినా ధైర్యంవుండాలి. ఏ ప్రయత్నానికైనా ధైర్యమే మూలము. అధైర్యం అన్ని ప్రయత్నములకు అవరోధం. కనుక ప్రతిఒక్కరూ ధైర్యంగా ముందుకు సాగిపోవడం నేర్చుకోవాలి. వివేకవంతమయిన దూరదృష్టిని కలిగివుండాలి. ఎటువంటి పరిస్థితులలోను పురుషప్రయత్నాన్ని విస్మరించరాదు. సందర్భోచితమైన సమయస్ఫూర్తిని ప్రదర్శించాలి. విజ్ఞతతో కూడిన ఆలోచనలు చేయాలి. అట్టి సాటిలేని సామర్థ్యం, కార్యశూరత, దూరదృష్టి కలిగిన ధీమంతులకు మాత్రమే భగవత్సాహాయ్యం తప్పనిసరిగా లభిస్తుంది. వారే విజయాన్ని పొందగలుగుతారు.

ఇకపోతే ఏ విషయంలోనయినా తొందరపడి, అనాలోచితంగా నిర్ణయాలను గైకొనరాదు. తొందర పడటం వల్ల, సఫలీకృతం కాబోతున్న పనులు కూడా చెడి-

పోతాయి. దూరదృష్టితో ఆలోచించకుండా, తొందరపాటుతో నిర్ణయాలను గైకొంటే, ఒక్కొక్కప్పుడు ఊహించనటువంటి ప్రమాదములకు గురికావలసి వస్తుంది. ఏదైనా ఒక విషయమై నిర్ణయాన్ని గైకొనే ముందు కొంచెంసేపు ముందు వెనుక ఆలోచించాలి. పూర్వాపరములను దృష్టియందుంచుకొని విజ్ఞతతో నిర్ణయాలను గైకొనాలి. ఏదైనా ఒక సంఘటన చూడటంతోనే వినడంతోనే వొక నిర్ణయానికి వెంటనే రాకూడదు. అట్టి సంఘటన జరగడానికి కారణాలేమిటో ముందు క్షుణ్ణంగా తెలుసుకోవాలి. అటువంటి కారణాలుత్పన్నం కావడానికి దోహదం చేసే పరిస్థితులను ఓపికగా పరిశీలించాలి. చక్కగా విచారించిన మీదటనే వొక నిర్ణయానికి రావాలి, అటులకాకుండా ఫలితాన్ని చూచిన వెంటనే తీవ్రచర్యలను గైకొంటే అనేక అనర్థములకు దారి తీస్తాయి. ఈ క్రింది చిన్నకథ యిదే వాస్తవాన్ని రుజువు చేస్తున్నది.

## చిన్నకథ

పూర్వం ఒక చదువుకున్న బ్రాహ్మణ దంపతుల కుటుంబం ఒక గ్రామంలో వుండేది. ఎంతో కాలానికి వారికి ఒక చిన్నారి కలిగింది. ఎంతో ప్రేమగా పెంచుకుంటున్నారు. ఆ పిల్లతోపాటు ఒక ముంగిసను కూడా ఎంతో ప్రేమతో పెంచుకుంటున్నారు ఆ దంపతులు. ఒకరోజు మంచినీళ్ళకు ఆ బ్రాహ్మణుని భార్యనదికి వెళ్ళుతుంది. అదే సమయంలో

ఆ బ్రాహ్మణునికి రాజుగారినుండి ఆహ్వానం వస్తుంది. ఎంతో కాలంనుంచి రాజుగారి ఆహ్వానంకోసం ఎదురు తెన్నులు చూస్తున్న ఆ బ్రాహ్మణునికి ఏమీతోచక 'ముంగిస' ను ఆ పసిపాపకు కాపలావుంచి రాజుగారు కొలువుకు వెళ్ళుతాడు. ఇంతలో ఒక 'సర్పం' ఆ ఇంటికివచ్చి ఆ పసిపాపను కాటు వేయబోతుంది. అప్పుడు 'ముంగిస' దానితో పోరాడి ఆ పామును చంపివేస్తుంది. విజయగర్వంతో, ఆ నెత్తురుమూతి తోనే బ్రాహ్మణునికి ఎదురుగా పోతుంది. అప్పుడు ఆ బ్రాహ్మణుడు, తన పసిపాపను చంపి 'ముంగిస' వస్తున్న దని భావించి, కోపంతో ఆ ముంగిసను కర్రతో కొడతాడు. ముంగిస చచ్చిపోతుంది. లోపలికి వెళ్ళి చూడగా పసిపాప కేరింతలు కొడుతూ ఆడుకుంటూ వుంటుంది. పాము చచ్చి ప్రక్కనే పడి వుంటుంది. కోపంతో తాను చేసిన పనికి బ్రాహ్మణుడు ఎంతగానో చింతిస్తాడు. ప్రేమతో పెంచిన 'ముంగిస' ను తన చేతులతో తానేచంపినందుకు విచారిస్తాడు కాని ప్రయోజనం వుండదుగదా! ఈ కథవల్ల మనము వొక నీతిని నేర్చుకోవాలి. అసలు జరిగిన దేమిటో తెలుసు కొనకుండా తొందరపడి నిర్ణయాలను గైకొనరాదు. చక్కగా విచారించినమీదటనే వొక నిర్ణయానికి రావాలి. అటుల చేయకుండా సంఘటన చూచిన తక్షణమే ఏ మాత్రం ఆలో చించకుండా నిర్ణయాలనుగైకొంటే ఆపదలకు గురికావలసి వస్తుంది. కనుక ప్రతివొక్కరు తొందరపాటును విడనాడాలి. దూరదృష్టిని కలిగివుండాలి. అనాలోచితంగా ఉద్రేకంతో ఏ పనులు చేయరాదు.

# ప్రేమ

ప్రేమలక్ష్యము త్యాగము. ప్రేమ ఎప్పుడు, ఎన్నడూ ఎవరినీ దూషించదు; అదెన్నడూ దేనినీ స్వీకరించదు; ఎవరినీ ఏమీ అడుగదు; ఎల్లవేళలా యిచ్చి వేయడమే ప్రేమ పరమావధి. ప్రేమవల్ల పరులుకూడా ఆత్మీయులైపోతారు. బహు దూరంగా వున్నవారు కూడా ప్రేమవల్ల అత్యంత సన్నిహితులవుతారు. వియోగులను సంయోగ పరచేది ప్రేమ. అక్రమ పంథాలో చరించేవారిని సక్రమ మార్గాన పెట్టేది ప్రేమ, ద్వేషపూరితమైన ప్రపంచాన్ని స్వర్గధామం చేయగలిగేది ప్రేమ. మానవుని పశుత్వము నుండి పశుపతిగా చేయగలిగేది ప్రేమ. ప్రపంచ శాంతికి ఆధారం ప్రేమ.

దేవునియందు చూపే 'ప్రేమ' పూజ్య భావమిళితమైనది. తల్లి దండ్రులయందు చూపే 'ప్రేమ' లో ఆదరాభిమానములుంటాయి, మాతృభావన, పితృభావన వుంటుంది. పిల్లల యెడ తల్లిచూపే 'ప్రేమ' లో అనురాగం మేళవిస్తుంది. మాతృత్వం ప్రతిబింబిస్తుంది. మాతృ దేశంయెడల చూపించే 'ప్రేమ' లో దేశభక్తి యిమిడి వుంటుంది. ప్రేమ సంపూర్ణంగా స్వార్థ రహితమైనది. ప్రతి ఫలాన్ని ఆశించక పోవడమే నిజమైన ప్రేమ లక్ష్యం. ప్రేమ సూత్రమంటే సత్యసిద్ధాంతం. సత్యం లేకపోతే ప్రేమ లేదు. ప్రేమ పశుత్వానికి అతీతమైనది, నిష్పాక్షికమైనది.

''ప్రేమ లేని శరీరం శ్మశానంలోని శవంతో సమానం. కంచరివాని తోలుతిత్తి ప్రాణం లేకపోయినా శ్వాస తీసుకుంటూనే వుంటుంది.'' అని కబీరు మహాశయుడు ఎంతో అనుభవంతో చెప్పాడు. ప్రేమ, కరుణ మానవునికి వుండవలసిన ప్రధానమైన సుగుణములలో అతి ముఖ్యమైనవి. ఇతరులను కరుణతో ప్రేమించడం, సమస్తజీవరాసుల యెడల దయ, ప్రేమ కలిగి వుండటంచేత కాని మనిషి బ్రతికి వున్నప్పటికి చనిపోయిన వానితో సమానమే. అదే విధముగా కంచరివాని తోలుతిత్తికి గాలిని పూరించడం, వదలడం చేతనైనంత మాత్రమున, జీవం వున్న ప్రాణికిందకు రాదు గదా! ప్రేమ, దయ, కరుణ లేని వ్యక్తి ''జీవన్మృతుడు'' మాత్రమే.

''నిన్ను నీవెట్లు ప్రేమించుకొను చున్నావో, అట్లే యితరులను కూడా ప్రేమించుము. సుఖస్థితి యందును, దుఃఖస్థితి యందును నీతో సమానముగా సమస్త ప్రాణులను పోల్చుకొనుము'' (తన ఆత్మవంటిదే తక్కినవారి ఆత్మ యనెడి భావముతో) అని 'గీత' బోధిస్తున్నది. అనగా ఒక్క మానవుల పైనే గాక సమస్త జంతు జాలముల మీద కూడా ప్రేమ చూపవలెననే విశాలత్వాన్ని 'గీత' బోధిస్తున్నది. సామాన్యముగా ప్రపంచంలో 'సౌభ్రాత్రం లేక సోదరత్వం' (Brotherhood) ఒక గొప్ప సుగుణంగా పరిగణించ బడుతున్నది. 'నీవు నీ సోదరునివలె ఇతరులను ప్రేమించుము'' అని పెద్దలు సహజంగా చెబుతుంటారు. ఇదే

మంచిదే. కాని ఇది చాలదు. సోదరులలో కూడా ఒక్కొక్క ప్పుడు స్వార్థంతో పరస్పర వైషమ్యములు, అభిప్రాయ భేదములు, వైరములు జనిస్తునే వుంటాయి, కావున 'సోద రత్వం' పరిపూర్ణమైన ప్రేమకు చిహ్నం కాదు. ఇంక ఒక మెట్టు పైకి 'విశ్వమానవ సౌభ్రాతృం (Fraternity) కావల ననే నినాదం నేడు ప్రముఖంగా వినవస్తున్నది. ఇదీ అసం పూర్ణమైనదే. గీతాది గ్రంథములు, ఉపనిషత్తులు ప్రేమ యొక్క చరమస్థాయిని బోధిస్తున్నాయి. 'సర్వాత్మ దృష్టి'ని కూడా అలవరచు కోవాలని చెబుతున్నాయి. దానినే 'ఆత్మౌపమ్య భావము' అని అందురు, అనగా తన ఆత్మ వంటిదే తక్కిన వారి (టి) ఆత్మయనెడు భావము. తన యందునలె ఇతరుల యెడల కూడా దయకలిగి యుండవలెనని బోధించుట సర్వోత్తమ ధర్మము. ఎందువల్లననగా సోదరులు ఎప్పుడైనా కలహించుకొన వచ్చును గాని, తమ్ము తాము ఎప్పుడూ ద్వేషించుకొనలేరు గదా ! ప్రపంచంలోని ఇతర మతములు 'విశ్వమానవ సౌభ్రాతృము' వరకేపోగలిగాయి, 'నీ తోటి వానిని ప్రేమించుము' అని మాత్రమే చెప్పగలి గాయి. కాని ఎందుకు ప్రేమించాలో, దేనికి ప్రేమించాలో మాత్రం వివరించలేక పోయాయి. కాని మన 'భగవద్గీత'లో మాత్రం దానికి చక్కటి సమాధానం చెప్పబడింది. సర్వత్రా ఒకే ఆత్మ (నీలో, నాలో సమస్త ప్రాణికోటిలో వున్న ఆత్మ ఒక్కటే) వున్నదనే ''సర్వాత్మ దృష్టి'' ని వెలుగులోనికి తీసుకొని రాబడింది. ప్రేమ యొక్క అంతిమ స్థితి ఇది.

మనిషిలో కామ వికారాదులు వున్నంత కాలం ప్రేమ అక్కడ వుండనే వుండదు. అసలైన ప్రేమను ఒక "త్రిభుజాకారము" గా పోల్చుకొన వచ్చును. త్రిభుజానికి మూడు కోణములుంటాయి. అదే విధముగా ప్రేమకు మూడు సూత్రములున్నాయి. 1. ప్రేమ ఎన్నడును అడుగదు, 2. ప్రేమకు భయము లేదు, 3. ప్రేమయే ప్రేమ లక్ష్యం.

1. ప్రేమ ఎన్నడునూ, ఎవర్ని ఏమీ అడుగదు. ఏమియూ అడుగకుండానే సర్వమును సమర్పించును, సమస్త మును అర్పించును. ప్రేమ బిచ్చమెత్తదు. బిచ్చగాని ప్రేమ ప్రేమయే కాదు - ఇది దాని తొలిచిహ్నం. ఇదే నీతిని బోధించే చిన్న కథ ను వివరిస్తాను.

చిన్న కథ

ఒకప్పుడు వృద్ధుడైన ఒక భారత చక్రవర్తి వేటకు వెళ్ళుతాడు. అక్కడ ఒక సన్యాసిని చూచి తన రాజధానికి వచ్చి అతిథ్యమును స్వీకరించమని ఎంతో వినయంగా వేడుకొనగా, ఆ సన్యాసి మన్నించి ఆ చక్రవర్తి రాజధానికి వస్తాడు. ఆ చక్రవర్తి పూజా గృహమునకు వెళ్ళుతూ సన్యాసితో "పూజను ముగించిన తక్షణమే ప్రసాదమును సమర్పించుకుంటానని" వేడుకుంటాడు. స్వామీజీ అక్కడనే కూర్చొని చక్రవర్తి పూజా విధానములను శ్రద్ధతో పరికిస్తుండాడు. అప్పుడు సార్వభౌముడు "ప్రభువా నా ఐశ్వర్యమును అధికము జేయుము, భూ సంపదను ఎక్కువ జేయుము, మంచి ఆరోగ్యమును ప్రసాదించి సంతానాభివృద్ధి కలుగునట్లు వరమొసగుము" అని దైవమును

ప్రార్థించు చుండగా, అప్పుడు ఆ సన్యాసి లేచి వెడలి పోవు టకు సన్నద్ధుడవు తుండగా చక్రవర్తి చూచి 'స్వామీ' ప్రసాదమును ఆరగించకుండా వెళ్ళిపోతున్నారేమి? అని ప్రశ్నించుతాడు. అప్పుడు ఆ 'యోగి' "నేను బిచ్చగాండ్ర వద్ద బిచ్చమెత్తను. ఇంతవరకు భూమి కావలెనని, సంపద నభివృద్ధి పరచమని, అది కావలెనని, ఇది కావలెనని నీవు దేవుని ప్రార్థిస్తున్నావు. నీవు నాకేమి యివ్వగలవు? ముందు నీ కోరికలను తీర్చుకొనుము" అని పలికి యోగి నిష్క్రమించెను. ఈ కథవల్ల మనకు అర్ధమవుతున్న నీతి "ప్రేమలక్షణం సమర్పిచడమే గాని యాచించడం కాదు. దేవుని ప్రేమతో పూజించడమే మనవంతు, అది కావాలి, ఇది కావాలి అని ప్రాధేయపడటం మంచిది కాదు. యువకుడు తన ప్రియురాలి కడకు వెళ్ళినప్పుడు వారిరువురి నడుమ వ్యవహార సంబంధమేమియూ వుండదు. వారిది అనురాగ బంధుర బాంధవ్యం మాత్రమే. అనురాగం బిచ్చకత్తెకాదు. బిచ్చమెత్తడం ప్రేమ లక్షణం కాదు.

2. ప్రేమ భయమెఱుగదు. ఇది రెండవ కోణము లోని అంశం. తల్లి తన పసిపాపను అనురాగంతో ప్రేమిస్తుంది. ఆ బిడ్డకు ఎంతటి ప్రమాదం వాటిల్లినా, ఆ తల్లి ధైర్యంగా ఎదుర్కొంటుంది. ఒక వేళ అడవిలో చంటి పిల్లను ఎత్తుకొని పయనిస్తున్న తల్లికి ఎదురుగా 'పెద్దపులి' వస్తే బిడ్డను వదలి ఆ తల్లి పారిపోదు. పెద్దపులి ఎంత

భయంకరమైనది అయినప్పటికి, క్రూరమైనది అయినప్పటికి సర్వ శక్తులను కేంద్రీకరించి ఆ పులితో పోరాడి తన బిడ్డను రక్షించుకోవడానికి ప్రయత్నిస్తుంది, ఆ పోరాటంలో అవసరమైతే తన ప్రాణాన్నయినా పోగొట్టుకొని తన బిడ్డను రక్షించుకుంటుంది, పులిని చూచి ఏమాత్రం భయపడదు. నదిలో స్నానం చేస్తుండగా, పొరపాటున బిడ్డ నదిలో పడిపోతే తల్లి చూస్తూ ఊరుకోలేదు. లోతు బాగా వున్నదని తెలిసినప్పటికి, తన ప్రాణం పోతుందని ఏమాత్రం భయపడక, తన బిడ్డను రక్షించుకోవడాని కోసం, అమాంతంగా నిండు నదిలో ఏ మాత్రం సంకోచించకుండా దుముకుతుంది ఆ తల్లి. అదే విధముగా తన ప్రియురాలిని ఎవరైనా రౌడీలు ఎత్తుకొని పోతుంటే ప్రియుడు చేతకాని వాడైనప్పటికి, బలహీనుడైనప్పటికి చూస్తూ ఊరుకోలేడు. తన శక్తిని ఉపయోగించి పోరాడి అసువులనైనా బాస్తాడు గాని మెదలకుండా ఊరుకోలేడు. అటువంటివారు మామూలు సమయంలో ఒక సామాన్యమైన కుక్కను కూడా ఎదిరించలేని బలహీనులు ఏవిధముగా ధైర్యం చేయగలుగుతున్నారు దీనికి కారణం ఏమిటి? అనురాగంతో, ఆప్యాయతతో, నిష్కల్మషమైన హృదయంతో, పవిత్రమైన భావనతో హృదయ పూర్వకంగా ప్రేమిస్తున్న వారు తన ఎదురుగానే సర్వనాశనం అయిపోతుంటే చూస్తూ వూరుకోలేక పోవడమే. అందువల్లనే ప్రేమ భయమెరుగదన్నారు,

3. ప్రేమయే ప్రేమ లక్ష్యం : ఇది మూడవ కోణం

లోని అంశం, ఇది అత్యున్నతమైన స్థాయి. ప్రేమకు ప్రయోజనం ప్రేమయే. ప్రేమ పరాకాష్ఠనందుకున్నప్పుడు కోరికలన్నియూ వాటంతట అవే మటుమాయమై పోతాయి. పరిపక్వమొందిన ప్రేమయందు తరతమ భేదములుండవు. ఆ స్థాయికి చేరుకున్న మానవుడు పరమోత్కృష్టమైన ఆదర్శములనే ప్రేమించును. అటువంటి గొప్ప ఆదర్శములు స్వార్థరహితమైనవి. భగవంతుడు కూడా స్వార్థరహితుడు, ప్రేమ స్వరూపుడు. కనుక భగవంతుని ప్రేమించడం నిస్వార్థం. మానవ ప్రేమ చాలా వరకు పరస్పరాశ్రయమైనది, పరస్పరాధారమైనది. ఇచ్చి పుచ్చుకునే ధోరణిలో నడుస్తుంది. కాని భగవంతుని ప్రేమ అటువంటిది గాదు. భగవంతుని ప్రేమించటం యాచించటానికి కాదు. దేనినికోరక, ఫలాన్ని ఆశించకుండా, నిస్వార్థ బుద్ధితో భగవంతుని ప్రేమించినప్పుడే 'ప్రేమ' యొక్క చరమ స్థాయిని చక్కగా అవగాహన చేసుకొన్నట్లవుతుంది. ఈ స్థాయికి చేరుకోవడం అనగా 'ప్రేమాను భవమును పొందుటకే ప్రేమించుట' అనే భావము కలుగుటకు నిరంతర కృషి ఎంతయినా అవసరం. అదే నిజమైన ప్రేమ లక్ష్యం. ప్రేమించుటయే ప్రేమ లక్ష్యం.

కనుక ప్రేమ, దయ, కరుణ మొదలైన దైవ గుణములు కలిగిన మానవుడు మాత్రమే మోక్షానికి అర్హుడు. అటువంటి శక్తి వంతులకే ఇహపరములందు కోరకుండానే సిద్ధి ప్రతిభలు చేకూరుతాయి.

# క్రమ శిక్షణ

క్రమశిక్షణ అనగా మంచి శిక్షణ అని అర్థం. ఈ క్రమశిక్షణను ముఖ్యంగా బాల బాలికలు నేర్చుకోవలసిన అవసరం ఎంతయినా వున్నది. ఎంతటి తెలివి గలవాడైనప్పటికీ, మంచి మార్కులను శ్రద్ధతో తెచ్చుకుంటున్నప్పటికి 'క్రమశిక్షణ' చక్కగా అబ్బని యెడల ఏ మాత్రం రాణించరు. ఒక క్రమ పద్ధతిలో జీవిత యాత్రను కొనసాగించడం నేర్చుకొననివాడు ఎందుకూ పనికిరాకుండా పోతాడు. శిక్షణ ఒక్క బాల బాలికలకే కాదు, పౌరులందరికి వుండాలి, సంస్థలలో పార్టీలలో వుండాలి. సైన్యంలో తప్పనిసరిగా వుండాలి. సమాజంలో వుండాలి, జాతిలో వుండాలి. క్రమశిక్షణ గల జాతి మాత్రమే పురోభివృద్ధి జెందుతుంది. ఈ క్రమశిక్షణను చిన్నప్పటి నుంచే సాధన చేయాలి. క్రమశిక్షణను గురించి పుస్తకములు చదువుతే రాదు. ఉపన్యాసాలు వింటే అంతకన్నా రాదు. నిరంతర సాధన ద్వారానే యిది అబ్బుతుంది. ఆటపాటల ద్వారా మనకు తెలియకుండానే మనం 'క్రమశిక్షణ'ను నేర్చుకుంటాం. ఆటలాడేటప్పుడు మన మనస్సు మన అధీనంలో వుంచుకోవాలి. నాయకుడు యిచ్చే ఆజ్ఞలను తూ. చా. తప్పకుండా పాటించాలి. ఎంత ఉత్సాహంగా ఆడుతున్నప్పటికీ ఒళ్ళు మరచి ఆటలో నిమగ్నమై పోయినప్పటికి

నాయకుడు 'విజిల్' ఊదడంతోనే ఎక్కడి వారక్కడ నిశ్శబ్దంగా నిలబడిపోవాలి. 'కోరస్' పాడేటప్పుడు పదిగొంతులు ఒకే గొంతుగా వినపడేట్లుగా పాడటం నేర్చుకోవాలి. అదే విధముగా సైన్యాధికారి యిచ్చే సూచనలను క్రమబద్ధంగా పాటించాలి. ఉత్తర్వులను, ఆజ్ఞలను క్రమశిక్షణతో శిరసావహించాలి. సంస్థలలో, పార్టీలలో కూడా క్రమశిక్షణ అత్యావసరం. క్రమశిక్షణ లేని పార్టీగాని సంస్థగాని ఏమాత్రం పురోభివృద్ధి జెందదు. వాటిల్లో నిర్దేశించబడి వున్న నియమ నిబంధనలను తూచా తప్పకుండా పాటించడం, శిరసావహించడం నేర్చుకోవాలి. ఎవరిష్టం వచ్చినట్లు వారు మాట్లాడరాదు, ప్రకటనలు చేయరాదు. క్రమశిక్షణ అనేది జీవితంలో భాగమైపోవాలి. ఇది జీవితానికి సంబంధించిన మంచిగుణం. ఇంటిలోగాని, పాఠశాలలోగాని ప్రభుత్వ కార్యాలయాలలోగాని, సమాజంలో గాని నల్గురితో చక్కగా వ్యవహరించడం, సభ్యతగా మాట్లాడటం, సక్రమ పద్ధతిలో నడచుకోనడం ఒక అలవాటుగా మారాలి. ప్రతిదినం ఉదయం లేచిన దగ్గర నుంచి రాత్రి పడుకోబోయే వరకు చేసే కార్యక్రమాలలో ఒక క్రమపద్ధతి వుండాలి. అదే పద్ధతిని నిత్యమూ పాటించాలి. అప్పుడే సమాజం అభివృద్ధి జెందుతుంది. సమాజ జీవననిర్మాణం క్రమశిక్షణ మీదనే ఆధారపడి వున్నది. క్రమశిక్షణాభివృద్ధికి పాఠశాలలలో శారీరకశిక్షణ అత్యావసరం, కాలేజీలలో 'నిర్బంధ సైనిక శిక్షణ' కూడా గరపాలి. గణవేషణ (Uni Form) క్రమశిక్షణకు చిహ్నం. ప్రతి పాఠశాలలో గణవేషణ

(Uni Form) వుండాలి. "ఒకే నడక, ఒకే పాట, ఒకే మాట" క్రమశిక్షణకు మూలాధారం. దురదృష్ట వశాత్తు సమాజంలోని అన్ని స్థాయిలలో క్రమశిక్షణ రాహిత్యం పెచ్చు పెరిగిపోతున్నది. విద్యార్థుల నుంచి రాజకీయ నాయకుల వరకు వుండవలసినంత క్రమశిక్షణ వున్నట్లుగా గోచరించడం లేదు. క్రమశిక్షణ రాహిత్యం వల్ల విద్యాలయాలు మూత పడుతున్నాయి. సమ్మెలు ఘోరావోలు పెచ్చుపెరిగి అవాంఛనీయమైన దుస్సంఘటనలు వివిధ రంగాలలో జరుగుతున్నాయి. దేశంలోసంక్షోభం చెలరేగుతున్నది. తద్వారా దేశ ఆర్థిక పురోభివృద్ధికి తీరనినష్టం వాటిల్లుతున్నది. కనుక 'క్రమశిక్షణను' అన్ని స్థాయిలలో నెలకొల్పాలి. విద్యార్థికి క్రమశిక్షణ ఎంత అవసరమో, ప్రతి పౌరునికి అంతే అవసరం. దీనిని ప్రతి వక్కరు పాటించినప్పుడు దేశం పురోభివృద్ధి జెందుతుంది.

---

"త్యాగం చేయడం చేతనే తేజం ఆవిర్భవిస్తుంది. స్వార్థం ప్రవేశించిన క్షణంతోనే తేజం ఆరిపోతుంది. మహావృక్షంలా మారడానికి విత్తనం మొదట భూమిలో తన శరీరమును దంహిపజేస్తుంది. అట్లే స్వార్థ పరిత్యాగం చేతనే మన కార్యంకు విజయం చేకూరుతుంది."

—స్వామి రామతీర్థ

"క్రమ శిక్షణ, గురుభక్తి అంతరంగం నుండి రావాలి. బాహ్యంగా భయపెట్టివాటిని రప్పించ ప్రయత్నించరాదు."

—శ్రీ రాజారామమోహన్‌రాయ్

# సంస్కృతి—సంస్కృతం

మన వేదాలు, వేదాంగములు, (ఉపనిషత్తులు, స్మృతులు, పురాణములు, ఇతిహాసములు మహావిజ్ఞానానికి నిలయాలు. అవిమహా సాగరాలు లాంటివి. ఈ మహా సాగరంలోని నీటిని ఎన్ని పంపుసెట్లు పెట్టితోడినా ఈషణ్మాత్రం కూడా తరిగిపోదు. ఎంతో నీరు ప్రతిదినం సూర్యుని వేడికి కరిగి, ఆవిరిఅయి మేఘరూపమును ధరించి మనకు వర్షరూపంలో నీటిని తిరిగి ఇస్తున్నాయి. తద్వారా పంటలు పండి దేశం సస్యశ్యామల మవుతున్నది. ఎంత జలం ఆవిరౌతున్నప్పటికీ సముద్రం ఒక్క అంగుళమైనా తరిగినట్లు కనుపించదు. అల్లే అనేక నదుల ద్వారా ఎంతో నీరు సముద్రమును చేరుచున్నది. అయినప్పటికి సముద్రం లవలేశమైనా పెరగడంలేదు. యథా తథంగానే వుంటు న్నది. అల్లేజ్ఞానికూడా మహా సాగరంలాంటి వాడే. అట్టి జ్ఞానమునకు నిలయమైన పవిత్ర గ్రంథములుకూడా "జ్ఞాన సముద్రాలే." ఎవరి ఓపికనుబట్టి, సామర్థ్యమును బట్టి వారు ఆ 'జ్ఞానము'ను ఆస్వాదించవచ్చు. అర్థంచేసుకొని ఆకళింపు చేసుకోవచ్చును. నేర్చుకొని మళ్ళీ తిరిగి ప్రపంచానికి విజ్ఞానమును వెదజల్ల వచ్చును. అటువంటి గొప్పతనం, విజ్ఞానఖని ఒక్క మన శాస్త్రములలోనే వున్నది. దానిని పూర్తిగా అవగాహన చేసుకొనవలెననిన అర్థంచేసుకొన

వలెననిన 'సంస్కృతం' తప్పని సరిగా వచ్చితీరాలి. సంస్కృతం అనగానే మనలో చాలామందికి ఒక దురభి ప్రాయమున్నది. మృతభాషయని, అనాగరికులు, సనాతనులు వాడే ఛాందసభాషయనే అభిప్రాయంకూడా వున్నది. అవి ఏవో అర్థంకాని మంత్రాలని, యజ్ఞయాగాదులకు, పెండ్లిండ్లకు, కర్మకాండలకు ఉపయోగపడే మృత భాషయని, ఛాంధసులైన పురాణ పండితులు వల్లెవేసే క్లిష్టతరమైన భాషయని చాలా మందిలో నాటుకొని పోయింది. ఈ దురభిప్రాయమును ముందు మన మనస్సుల నుండి తీసివేయాలి. సంస్కృతం అమృతభాష. భారతీయ భాషలన్నిటికి తల్లిలాంటిది. దానిలో విజ్ఞానసర్వస్వం యిమిడియున్నది. మన సంస్కృతికి నిలయం సంస్కృతం. అమరవాణి దానిలో వున్నది. సమస్త భారతీయ భాషలకు స్ఫూర్తి కేంద్రం సంస్కృతం. ఈనాడు ప్రపంచంలో అనేక దేశాలలో సంస్కృతం ప్రత్యేకంగా అధ్యాయనం చేయబడుచున్నది. కాని మనం మాత్రం మన మాతృభాషలకు మాతృభాష అయిన 'సంస్కృతము' ను నిర్లక్ష్యం చేస్తున్నాం. మన వేదాలలో ఉపనిషత్తులలో, శాస్త్రములలోనున్న అమృతాన్ని తనివితీరా త్రాగాలంటే సంస్కృతమును నేర్చుకోనాలి. అమృతమును వెదజల్లె టటువంటి అమృతభాషను అధ్యయనం చేసి అమృతాన్ని ఆస్వాదించాలి.

వ్యాకరణం, చంధస్సు, జ్యోతిష్యం మొదలైన

వెన్నో అమూల్యమైన విషయములను మహర్షులు ఎన్నడో వ్రాసివుంచారు. ఖగోళశాస్త్రం, ధర్మశాస్త్రం, నీతిశాస్త్రం, తర్కశాస్త్రం, సంగీత శిల్పశాస్త్రములు యింకా ఎన్నో వున్నాయి. ప్రముఖ ప్రాశ్చాత్య ఖగోళ శాస్త్రవేత్త, "కౌంట్‌స్జర్నా" మన ఖగోళశాస్త్రీయ విజ్ఞానం. జ్యోతిశ్శాస్త్ర పరిజ్ఞానంచూచి ఆశ్చర్యపోయాడు. సర్. డబ్ల్యు. హంటర్ "భారతీయ ఖగోళశాస్త్రం గ్రీకుల కన్నా ఎన్నో రెట్లుమిన్న" అని పేర్కొన్నాడు. మన ప్రాచీన వేదశాస్త్రములలో ఆధ్యాత్మిక సత్యములే కాక ఈనాటి "సైన్సు" అనే విజ్ఞాన సాంకేతిక అణుసిద్ధాంత రహస్యములు కూడా ఎన్నోవున్నాయి. జర్మన్ పండితులు అటువంటి భాగములను అధర్వణ వేదమునుండి సంగ్రహించి, పరిశోధనలను జరిపి సరిక్రొత్త విషయములను కనిపెడుతున్నారు. మన ఋషులు వ్రాసిన 'నాడీ' జాతక గ్రంథములు. జ్యోతిష. ఆయుర్వేద, రసాయనక, విషవైద్య, పాశుపత ( Veterinary ) ఖగోళ, భూగోళ, గణిత శాస్త్రములు గలతాటియాకు గ్రంథములను మణుగుల కొద్ది ఏనాడో విదేశీయులు తరలించు కొనిపోయారు. మన శాస్త్రములలో నున్న విజ్ఞానమును తెలుసుకొనడాని కోసం జర్మనీలో కొన్ని విశ్వ విద్యాలయములలో సంస్కృతం నిర్బంధంగా నేర్ప బడుతున్నది, అమెరికారష్యా శాబూలులలోని కొన్ని విశ్వవిద్యాలయాలలోకూడాసంస్కృత అధ్యయనం పై ఆసక్తి చూపుతుంటే మన ప్రభుత్వం సంస్కృతాభివృద్ధికి ప్రోత్సాహం యివ్వక పోవటం శోచనీయం. ఈ భాష యందు ప్రజలు కూడా అవసరమైన

ఆసక్తిని కనపరచక పోవడం విచారకరం, ఇప్పటికైనా మించిపోయింది లేదు. మన సంస్కృతీ సభ్యత సాంప్రదాయములకు మూలమైన సంస్కృతమును ప్రతి ఒక్కరూ అధ్యయనం చేయాలి. భారత దేశ భౌగోళిక సరిహద్దులు కన్నా సంస్కృతికి సంబంధించిన సరిహద్దులు అతివిస్తృతమైనవి. ఎన్నో శతాబ్దములకు పూర్వమే వివిధ దేశములకు భారతీయ సంస్కృతి ప్రభావం వ్యాపించింది. రష్యాలో వోల్గానదికి ఉత్తరంగా మాస్కో నగరానికి 1200 మైళ్ళ దూరాన "కాజాన్" అనే స్థలం వున్నది. అక్కడ బ్రహ్మాండమైన గ్రంధాలయం వున్నది.

అచట సేకరించబడిన ఆ ప్రాచీనపుస్తకములన్నియూ భారతీయ సంస్కృతిని వివరించే గొప్ప గ్రంథములే. 'కాజాన్' నుండి తూర్పుకు 5000 మైళ్లు వస్తే అక్కడ "వ్లాడీ వాస్టాక్" అనే స్థలంవున్నది. దానికి పై భాగంలో అత్యంత ప్రాధాన్యమైన గనులున్నాయి. అక్కడ ఒక నది కూడా వున్నది. దానిపేరు "సుఖావతి" దానినే 'అనూ' అని ఇప్పుడు అంటున్నారు. దానికి ఉత్తరంగా 'కామచట్టి' అనే అత్యంత భాగ్యవంతమైన ప్రాంతం వున్నది. దానిని "మహాధన" అంటారు. అక్కడ 65 బంగారుగనులున్నాయి. అమెరికా ఖండంలోని అలాస్కా నుండి 4000 మైళ్ళు ఉత్తరకెనడా గ్రీన్‌లాండ్‌ల వరకు వెళ్ళితే ఆ ప్రాంతమంతా ఎస్కిమోలు కనబడుతారు. వీరిని గూర్చి ఆధునిక పరిశోధనలు జరుపుచున్న ఒక స్విట్జర్‌లాండ్ విద్వాంసుడు

డా. రఘువీరకు వారి భాషలోని పదాలను పంపాడు. అందులో నాల్గు వేలు సంస్కృత పదాలున్నాయి. ఇండో నేషియాలో మన సంస్కృతీ ప్రభావం యిప్పటికీ కన్పడు తుంది. అక్కడి ప్రభుత్వ బ్యాంకు పేరు 'బ్యాంకు ఆఫ్ కుబేరా.' కుబేరుడు మనకు ధనాధిపతి. అక్కడి 'ఎయిర్ లైన్సు' పేరు "గరుడా ఎయిర్ లైన్సు" అని అంటారు. మన పురాణము లలో 'గరుత్మంతుడు' పక్షిరాజు పేరు వినే వుంటారు. అక్కడి ప్రముఖుల పేర్లు 'సుకర్ణో (మాజి ప్రధాని)' 'సువార్తో' లు. ఈ పేరు మన భారతంలో కనుపిస్తాయి. ప్రపంచ రామాయణ మహాసభ ఈ మధ్య ఇండోనేషియాలో జరిపారు. ఈ విధంగా చాల దేశాలలో మన సంస్కృతీ ప్రభావం వ్యాపించింది. నేటి 'ఆఫ్ఘనిస్తాన్' ఒకనాటి మన ఉపగణస్థానము. మహాభారతంలో శల్యుని స్థానం అదే. నేటి కాబూలు కాందహార్ ఒకనాటి గాంధార దేశం. అక్కడ కౌరవులతల్లి గాంధారి జన్మించింది. నేటి బర్మా ఒకనాటి బ్రహ్మదేశం. నేటి అస్సాము "ప్రాగ్జ్యోతిష" మను పేరున మహాభారతంలో కన్పడుతుంది. సింగపూర్‌ను పూర్వం శృంగపురం అనేవారు. మన ఉజ్జ్వలమైన భారతీయ సంస్కృతి ఒకప్పుడు దేశదేశాల వ్యాపించి భారతీయుల నాగరికత ఔన్నత్యాలను చాటింది. కనుక మన సంస్కృతి ఔన్నత్యాలను చక్కగా అర్థంచేసుకోవాలంటే సంస్కృతం తప్పని సరిగా అధ్యయనం చేయాలి.

# యోగశాస్త్రము

మన పూర్వీకులు "యోగశాస్త్రము" నకు మంచి ప్రాముఖ్యమిచ్చారు. పతంజలి మహర్షి ప్రవచించిన 'యోగశాస్త్రం' నేడు ప్రపంచంలోని అనేక దేశములలో అధ్యయనం చేయబడుతున్నది. 'యోగాసనము'లు నేర్పే విద్యాలయాలు నేడు అమెరికా, రష్యాలలో ఎన్నో వెలిశాయి. యోగాభ్యాసం, ధ్యానయోగం అనగానే చాలామంది ఇదేదో వేదాంతపరమైన ప్రక్రియయని భావిస్తున్నారు. ఈవిషయం చెప్పగానే సహజంగా చాలా మందికి అరణ్యములలో పూర్వం ఒంటరిగా కాలంగడిపే యోగులు గుర్తుకువస్తుంటారు. కాషాయాంబరములను ధరించిన సన్యాసులు ఊహాపథం లోనికి వస్తారు. 'యోగ శాస్త్రం' అటువంటి బైరాగులు అభ్యసించే సనాతన విద్య యనే అభిప్రాయం యింకా చాలమంది అధునాతనులలో పేరుకొని వుంది. ఇది ఏ మాత్రం వాస్తవం కాదు. నేడు ఈ 'యోగశాస్త్రము' ను భౌతికశాస్త్ర విజ్ఞానదృష్టితో పరిశీలించి పరిశోధిస్తున్నారు. దీని అవసరమును ప్రముఖ శాస్త్రజ్ఞులు సహితం నేడు గుర్తించారు. ఈనాటి యాంత్రిక యుగంలో ప్రశాంత జీవితం కొనసాగించడం రాను రాను కష్టసాధ్య మవుతున్నది. రకరకములైన మానసిక వ్యాధులకు గురి అవుతున్నారు. అమెరికాలాంటి

నాగరిక దేశములలోని ప్రజలు రాత్రిళ్లు నిద్రపట్టక నిద్ర మాత్రలు మ్రింగుతున్నారు. మత్తుపదార్థములను సేవిస్తున్నారు. గుండె జబ్బులతో, రక్తపుపోటు వ్యాధులతో బాధపడేవారిసంఖ్య నానాటికి పెరిగిపోతున్నది. ఆధునిక వైద్యులమందులు పనిచేయడం లేదు. అందుకోసమనే ఈనాడు అమెరికా, రష్యా, బ్రిటన్, జర్మనీ మొదలైన దేశములలో మనశ్శాంతికి మార్గముల నన్వేషిస్తున్నారు. తీవ్రపరిశోధనలను జరిపి మనశ్శాంతి- ధ్యానం, యోగాసనముల వల్లనే కలుగుతుందని అనేక మంది శాస్త్రజ్ఞులు (Scientists) నేడు భావిస్తున్నారు. శారీరక, మానసిక వికాసమునకు దీనికిమించిన సాధనం మరొకటి లేదని రూఢి అయింది. ధనవ్యయము లేకుండా, డాక్టర్లతో నిమిత్తము లేకుండా మన శరీరమును మంచిగా, పుష్టిగా, ఆరోగ్యముగా వుంచుకోడానికి ఈ 'యోగాభ్యాసం' ఎంతగానో ఉపకరిస్తుంది. మానవునిలో అంతర్యాభతమైన అనంతశక్తిని, బయటకులాగి ఉపయోగించగలశక్తి ఈ యోగశాస్త్రంలోనే వున్నది.

"రెండురాత్రుల నిద్రవల్ల కలిగే విశ్రాంతి ఎంతో అది ఇరువైనిముషములపాటు ఆచరించే ధ్యానంవల్ల లభ్యం కాగలదు." అని ఫెయిర్ ఫీల్డుకు చెందిన శాస్త్రజ్ఞుడు, ఇంటర్ నేషనల్ యూనివర్సిటీ, ప్రెశిడెంట్, ఫిజీయోలజి ప్రొఫెసర్ అయిన డా. రాబర్టు కేన్ వెలెస్ మరియు 'హార్వర్డునెన్సన్' లు తీవ్రపరిశోధనలు జరిపి తమ అభి

ప్రాయములను తెలిపారు. ఈ విషయమును మన అనాది ఋషులు ఏనాడో చెప్పారు. అనుభవంగా చేసి చూపించారు. మనం ధ్యానసముద్రంలో నిమగ్నమై వున్నప్పుడు ప్రాణ వాయువు అవసరం చాలా వరకు తగ్గిపోతుంది. శరీరంలోని అవయవాలు పనిచేయ నవసరం అంతగావుండదు. రక్త నాళములన్ని క్రియాశూన్యమైపోతాయి. ధ్యానసమయంలో శ్వాస అవసరంకూడా చాలా వరకు తగ్గిపోతుంది. మామూలు స్థితిలోవున్న మనిషి మెదడులోని ఆలోచనా తరంగములకు ధ్యానసముద్రములో మునిగివున్నప్పటి మనిషి ఆలోచనా తరంగములకు ఎంతో వ్యత్యాసముంటుంది. ధ్యానంవల్ల మనిషిలో పరిశుద్ధ భావములు కలగడంతోపాటు నిశ్చలత, ప్రశాంతతకూడా ఏర్పడుతుంది. శరీరానికవసరమైన విశ్రాంతి లభిస్తుంది. అప్పుడు మనశ్శాంతి చేకూరుతుంది. హవాయి యూనివర్సిటీలో పనిచేస్తున్న 'కాలియర్, షీటన్ జాన్సన్' అను ముగ్గురు శాస్త్రజ్ఞులు ధ్యానయోగమును గురించి పరిశోధనలు జరిపి "ఈ ధ్యానయోగం అవలంబించే విద్యార్థులలో స్మరణశక్తి, జిజ్ఞాసా ప్రవృత్తి పెరుగుతుంది; మత్తుపదార్థం సేవించడం మానుకుంటారు" అనిచెప్పారు. 1963 సం నుండి 1972 వరకు పాశ్చాత్య దేశములలో రెండులక్షలమంది విద్యార్థులు ఈ ధ్యానయోగము నేర్చుకొని అమలు జరపడం ప్రారంభించారని ఒక్క అమెరికాలోనే ప్రతిమాసం 14 వేలమంది విద్యార్థులు సాధన చేస్తున్నారనీ పైముగ్గురు శాస్త్రజ్ఞులు వెల్లడించారు.

ఇటీవల ఢిల్లీలో జరిగిన ఇంటర్ నేషనల్ ఫిజి

మోలజీ కాంగ్రెసు 26వ మహాసభలో డా. కేన్ వెలెస్ మాట్లాడుతూ "మానసిక వికాసంతో పాటు వ్యక్తిత్వాన్ని సహితం ధ్యాన యోగం పెంపొందింప జేస్తుంది. వినమ్రత వస్తుంది, ఆత్మ విశ్వాసం పెరుగుతుంది. కార్యదీక్షత అభివృద్ధి జెందుతుంది. ఉద్రేక భావాలు హింసాత్మక ప్రకృతి అంతరిస్తుంది. నిద్రపట్టక పోవడం అంటూ వుండనే వుండదు. మద్యం, సిగరెట్లు మరియు యితర మత్తుపదార్థముల పట్ల హేయభావం కలుగుతుంది" అని చెప్పారు. న్యూ మెక్సికోలో ఖైదీలకు ధ్యాన యోగం నేర్పిపరిశోధనలు చేయగా రెండు మాసములలోనే వాళ్ళ మానసిక పరిస్థితిలో ఎంతో మార్పువచ్చినట్లు వెల్లడయింది. హార్డుఫోర్డు ఇన్స్టిట్యూట్ ఆఫ్ లివింగ్ డైరక్టరు ధ్యానయోగం మెంటల్ ట్రీట్మెంటుకు ఎంతో ఉపయోగకరమైనదని చెప్పారు. హార్వర్డుయూనివర్సిటీకి చెందిన డా. శ్వార్టోజ్ ధ్యానయోగమనేది అత్యంత సహజమైనదని, లాభదాయకమైనదని, ఆటవిక జాతికి చెందిన వారు రోజూ కొంత సేపు ప్రశాంతంగా వొకచోట కూర్చొంటారని అంటూ బహుశా వాళ్ళు ధ్యానయోగమును అవలంబిస్తూండవచ్చునని అంటాడు. కోతులు కూడా రోజూ కొంతసేపు మౌనంగా కూర్చుంటాయని కూడా చెప్పాడు. ఈ విధముగా ధ్యానయోగము, యోగశాస్త్రములను గురించి పరిశీలించి, పరిశోధించి, ఆధునిక విజ్ఞాన శాస్త్రవేత్తలు తమ అభిప్రాయములను వెలిబుస్తున్నారు. వీటికి పుట్టినిల్లయిన మన దేశంలో మాత్రం ఆదరణ తగ్గిపోతున్నది. విదేశాలలో రాను రాను

ఈ శాస్త్రముయెడల మోజు పెరుగుతున్నది. కొత్త కొత్త విద్యాలయాలు విదేశాలలో వెలుస్తున్నాయి. కాని యిక్కడ మాత్రం ప్రభుత్వం వైపునుంచి కూడా ప్రోత్సాహం లభించుటలేదు. ఈ అమూల్యమైన శాస్త్రమును కనిపెట్టిన ఘనత మాత్రం మన పూర్వీకులకే దక్కింది. అట్టి మహత్తర మైన శాస్త్రమును బయటకు తీసి పరిశీలించి ఆధునికీకరణ గావించి, సామాన్య ప్రజానీకమునకు అందుబాటులో వుండే విధంగా సంస్కరించి, బహుళ ప్రచారంలోనికి తీసుకొని రావడానికి మన శాస్త్రజ్ఞులు తీవ్రకృషి సల్పాలి.

---

"ఆధ్యాత్మిక లక్షణం బొత్తిగా లేనివాడు గురువే కాజాలడు. అట్టివానిని విద్యాచారి అనవలసి వుంటుంది. తన ద్వారా శిష్యుడు ఈశ్వరసంస్పర్శ పొందడానికి వీలు కల్పించే ఒకానొక ఆధ్యాత్మిక లక్షణమేదో గురువులో వుండటం అవసరం."

—శ్రీ అరవిందుడు.

''తప్పు చేయడం మానవ స్వభావం. తిరిగి ఆ తప్పును చేయకుండా వుండటం దైవ స్వభావం. తప్పును క్షమించటం కూడా మానవ స్వభావమే. దుర్బలులు ఎప్పుడూ క్షమించలేరు. క్షమించడం సబలుల లక్షణం.''

—శ్రీ మహాత్మా గాంధీజీ

# మన ప్రాచీన వైభవము

ఈ నాడు ప్రపంచంలో కెల్లా విజ్ఞాన పథంలో అగ్రగాములని చెప్పుకొని విర్రవీగుతున్న అమెరికా, రష్యాలలో నేడు అభివృద్ధిలో నున్న విజ్ఞాన శాస్త్రం కన్నా ఎన్నో రెట్లు మిన్నగా మన వేదకాలం నాడే మన దేశం అభివృద్ధి చెంది వున్నదని చెప్పడంలో ఏ మాత్రం అతిశయోక్తి లేదు. అథర్వణ వేదంలో యంత్రాలు, అస్త్రాలు, వైజ్ఞానిక పరికరాలు మారణహోమాలు ఇత్యాది క్రియా కలాపమంతా వున్నది. జర్మని ఈ అథర్వణ వేదం మీద ప్రత్యేకమైన పరిశోధనలు జరిపి అనేక వైజ్ఞానిక విశేషాలు కనుగొన్నట్లుగా జర్మనీ చరిత్ర చాటుచున్నది. ఈ నాడు రష్యాలో రామాయణ కాలంనాటి పుష్పక విమానం (Space Ship) అది ఒక గుండ్రని ఆకారం గల Flying Saucer లాంటిది అని శాస్త్రజ్ఞులు భావిస్తున్నారు. వీటినిగురించి పరిశోధనలు విశేషంగా జరుగుతున్నాయి.

భారత దేశచరిత్ర వేదకాలంతోనే ప్రారంభమైంది. వేదాలు ప్రపంచ వాఙ్మయంలోనే అత్యంత ప్రాచీనమైన సాహిత్యం. సాహిత్యమంటే ఈనాడు ప్రొద్దుపోక వ్రాస్తున్న అర్థంలేని కవిత్వం కాదు. భారతీయ ఆధ్యాత్మిక జీవితంలో వేదసాహిత్యం ఆత్మలాంటిది. గ్రిఫిత్ మహాశయుడు మన ప్రాచీన ఋగ్వేదముఅనువాదం చేస్తూ " Veda is the first

word spoken by Man " వేదము మానవుడు తొలిసారిగా మాట్లాడిన మొదటి వాక్కు" అని ప్రశంసించాడు. వేదాలలో అద్భుతమైన మంత్రశక్తి ఉన్నది. విజ్ఞానవంతమైనతంత్ర శక్తి ఉన్నది. పవిత్రమైన దివ్యశక్తికూడావున్నది దైవీశక్తితో ఆత్మబలంతో ఉచ్చరించే మంత్రంలో మహాశక్తియిమిడి వుంటుంది. ఆ మహాశక్తి నుపయోగించి కార్యసాధన చేసేదే 'తంత్రం.' 'మంత్రాన్ని తంత్రాన్ని ఉపయోగించి మానవ భౌతిక విజ్ఞాన శక్తితో నడిపించేవే యంత్రాలు.' ఈ కర్మకాండంతా ఈ పవిత్రమైన నాలుగు వేదాలలో మన మహర్షులుఇమిడ్చారు. ఈవాస్తవాలు గ్రహించ లేక 'వేదాలు' అనగానే సనాతనులైన చాంధసులు వల్లించే అర్థంగాని వ్యర్థమైన మంత్రాలని చాలా మంది అధునాతనులు భావిస్తున్నారు. అర్థం అయినా కాక పోయినా తప్పులతో కొంతమంది చాంధసంగా బజాయన నడుస్తూ వర్తె వేస్తున్న వారు కూడా వున్నారు. ముఖ్యంగా జర్మన్ శాస్త్రవేత్తలు ఈ మంత్రాలలో నున్న మహాశక్తిని గుర్తించారు. వేదాలలోని కొన్ని భాగాలను తీసుకొనివెళ్ళి పరిశోధనలు జరిపి అత్యంత అద్భుత విషయాలను కనిపెట్టారు. మానవాభ్యున్నతికి అవసరమైన అన్ని కళలూ వేదాలలో వున్నాయి. వేదాల నుండి ఉపవేదాలు బయలుదేరాయి. ధనుర్వేదం, ఆయుర్వేదం, జ్యోతిర్వేదం ముదలైన వెన్నో వున్నాయి.

విశ్వామిత్ర మహర్షి 'గాయత్రి' మంత్రాన్ని కనిపెట్టాడు. ఇది సూర్యశక్తికి సంబంధించిన మహత్తరమైన

దైవీశక్తిగల మహామంత్రం. దీనిలో అత్యద్భుతమైనశక్తి యిమిడివున్నది. 'ఆదిత్య హృదయం' అన్న విద్య ద్వారా విశ్వామిత్రుడు శ్రీరామచంద్రునికి అత్యద్భుతమైన సూర్యశక్తిరహస్యాలను వివరించాడు. ఆ మంత్రాన్ని భక్తి శ్రద్ధలతో ఉచ్చరించి అపూర్వమైన అస్త్రాలను సంపాదించి మహాశక్తి సంపన్నుడయినాడు శ్రీరామచంద్రుడు. విశ్వామిత్ర మహర్షి సృష్టికి ప్రతిసృష్టి చేసిన గొప్ప వైజ్ఞానికుడు. (Scientist).

విమాన నిర్మాణ విషయంలో 1903 సంవత్సరం డిశంబరు 17 న విమానమును ఆకాశంలోనికి ఎగురవేసిన ఘనత అమెరికాలో రైటు సోదరులకు దక్కినట్లుగా చరిత్రలో మనం చదువు తుంటున్నాం. అంతకు పూర్వం 1896 సంవత్సరం ఆగష్టు నెలలో లిలిన్థర్ అనే జర్మన్ శాస్త్రవేత్త ఈ మహా ప్రయత్నంలో ఆకాశంలోనికి లేచి క్రిందపడి మెడవిరిగి మరణించినట్లు తెలుస్తున్నది. వీటన్నిటకన్నా పూర్వమే భారతదేశంలో విమాన ప్రయోగాలు జరిగాయనే విషయం ప్రపంచ దృష్టికి రాకపోవడం నిజంగా దురదృష్టకరం. 1895 సంవత్సరంలోనే బొంబాయిలో చౌపాతీ సముద్ర తీరంలో శివరాం బాపూజీ తల్పాడే అను భారతీయ పండితుడు ఒక విమానమును నిర్మించి గాలిలో ఎగురవేసాడు. అది 1500 అడుగుల ఎత్తు లేచింది. ఆ ప్రదర్శనను చూచిన వారిలో అప్పటి బరోడా మహారాజు, మహదేవ గోవింద రనడే వంటి ప్రముఖులుకూడా వున్నారు. ఆవిమాననిర్మాణం

భరద్వాజ మహర్షిచే వ్రాయబడిన మానిక శాస్త్రాధారంగా జరిగిందని ఆ పండితుడు చెప్పాడు. తరువాత ఆ విమానాన్ని ఒక ఆంగ్ల కంపెనీకి అమ్మివేయడం జరిగింది.

వైద్య శాస్త్రం కూడా యిక్కడ ఎప్పుడో అభివృద్ధి చెందింది. మొట్టమొదట భరద్వాజ మహర్షి ఈ విద్యను ఇంద్రుని అనుగ్రహంతో మానవజాతికి ఉపదేశించాడు. ఆత్రేయసుడనే ముని, అగ్ని వేశునికి ఉపదేశించినట్లుగా ఈ ఆయుర్వేదమంతా ఒక గ్రంథముగా వ్రాయబడి "చరక సంహిత" అను పేర లభ్యమవు తున్నది. దీనిలో రోగ లక్షణములు, చికిత్సా విధానం, పిండోత్పత్తి, గర్భిణీస్త్రీకి చేసే ఉపచార చికిత్సలు మొదలగునవి ఎన్నో వున్నాయి. ఈనాడు 'ఆపరేషన్' గా పేరుపొందిన విధానమును లోగడ శస్త్రచికిత్స అనేవారు. మూలికలతో రోగం గనుక నయం కాని యెడల 'శస్త్రచికిత్స చేసేవారు. శస్త్రాలు ఎట్లా ఉపయోగించాలో, శరీరంలో ఏ ఏ భాగములలో ఏ ఏ అవయవాలుంటాయో మొదలైన విషయాలను తెలిపే గ్రంథం 'శుశ్రుతము'. దీనిని శుశ్రుతుడను మహర్షి రచించాడు. ధన్వంతరి, నాగార్జునుడు మొదలగు మహానుభావులు ఆయుర్వేదమును వెలుగులోనికి తెచ్చారు.

నీతి శాస్త్రములను ధర్మశాస్త్రమును మనకు మహర్షులు యిచ్చివెళ్ళారు. మనుధర్మశాస్త్రం, గౌతముని న్యాయశాస్త్రం, యాజ్ఞవల్క్య, పరాశర స్మృతులులాంటివి ఎన్నో వున్నాయి. సమాజాభివృద్ధికి అవసరమైన హద్దులను

పేరొన్నారు. కట్టుబాట్లను ఏర్పాటు చేశారు. అవసరమైన అమూల్యమైన సూచనలను చేసారు. నైతికమైన విలువలను పెంపొందించేందుకు అవసరమైన నీతిబోధనలను గావించారు. మనువు వ్రాసిన 'మనుస్మృతి' అను న్యాయ శాస్త్రమును 'సర్ విలియంజోన్సు' సంస్కృతము నుండి ఇంగ్లీషులోనికి "Manu's Laws" అను పేరున అనువదించారు. "పరాశరముని" వ్రాసిన "విష్ణుపురాణం" ఇంగ్లీషులోనికి "విల్సన్" అనువదించాడు. ప్రపంచ భవిష్యత్తు (World-Predictions) అన్న విషయం విస్తారంగా ఒక పురాణంగా వర్ణించిన గ్రంథంయిది. ఇందులో యింతవరకూ జరిగిన చరిత్ర విక్టోరియారాణీదాకా కూడా ఆయారాజుల పేర్లతో సహా యివ్వబడింది. రానున్న అవతారమైన "కల్కి" ఏ ఊళ్ళో ఎవరింట, ఎప్పుడు జన్మించబోతున్నాడో, అప్పటి తిథివార నక్షత్రములు కూడా యివ్వబడ్డాయి. నూతన యుగమైన 'కృతయుగం' ఏరోజునుంచి ప్రారంభమవుతుందో కూడా చెప్పబడింది. ఇది జరుగబోయే భవిషత్తును గురించి చక్కగా వర్ణించిన గ్రంథం. మునులు వ్రాసిన "నాడీ గ్రంథములు' తాటాకుల మీద ఈనాటికీ వున్నాయి. శ్రీ రామకృష్ణ పరమహంస, వివేకానంద, లాల్ బహదూర్ శాస్త్రి, కే. యం. మున్షీ మొదలైన వారి జాతకములు అందులో నుంచి సేకరించి పత్రికలో ప్రకటించబడినాయి. చాణుక్యుని "అర్థశాస్త్రం" ను చూచి ఈ నాటి మహామేధావులు, ఆర్థికశాస్త్రవేత్తలు సహితం నోరు మెదపలేకపోతున్నారు. జర్మన్ పండితుడు

"మాక్సుముల్లర్" భారతీయ సంస్కృతి, విశిష్టతనుగురించి ఆక్సుఫర్డు విశ్వవిద్యాలయంలో తరిఫీదు పొందుతున్న I. C. S. ఆఫీసర్లకు చక్కటి ఉపన్యాసము లిచ్చారు. "India What it can Teach Us" (భారత దేశం మన కేం నేర్పగలదు?) అన్న గ్రంథంగా ముద్రించబడింది. ఈమాక్సు ముల్లర్ సంస్కృతం నేర్చుకొని శ్లోకములుకూడా వ్రాసాడు. ఈయన ఆక్సుఫర్డ్ దగ్గర ఒక ఆశ్రమమును కట్టుకొని, భారతీయ ఋషులలాగే "మోక్షమూలర్ భట్టు" అను పేరు పెటుకొని, భార్యతో సహా తన అవశేష జీవితమును గడిపారు.

గణిత శాస్త్రిమును కూడా ప్రపంచానికి మనమే ప్రసాదించాం. ఋగ్వేదంలో 'బిబింధు' (అంక గణితం) అనే ఈశాస్త్రిమును (Arithmetic) 1 నుంచి 18స్థానముల వరకు సంఖ్యలో యివ్వబడింది. దీనిని బట్టిగణిత శాస్త్రమంతా వేదాలనుండి ఈనాటి ప్రపంచంపొందగలిగిందనే విషయం స్పష్టమవుతున్నది. రాజరాజ నరేంద్రుడు పరిపాలించిన నాటితాటాకు గ్రంథములలో క్షేత్రగణితం (Geometry), బీజగణితం (Algebra) ఇత్యాది గ్రంథము లున్నాయి. పావులూరి మల్లన్న వ్రాసిన "క్షేత్రబీజగణితం" (తాటాకు గ్రంథములమీద) లో వృత్తములు, త్రిభుజములు ఈనాడు "పైథాగరస్" పేరన అనుకునే సూత్రమూ మొదలగునవీ వున్నాయి. ఈ తాళపత్ర గ్రంథములు రాళ్ళబండి సుబ్బారావు స్మారక పురావస్తు గ్రింథాలయంలో నేటికీవున్నాయి.

"లీలావతి" గణితం చాలామందికి తెలిసియే వుండవచ్చు. ఈనాటి క్షేత్రగణితం, భూమి కొలతలు మొదలైన శాస్త్రమంతా వేదాంగ కల్పశాస్త్రమైన "శుల్బసూత్రములు" మొదలైన వాటినుంచి వచ్చాయి. వాస్తు శాస్త్రము (Architecture or Town Planning) నకు కూడా భారత దేశమేపుట్టినిల్లు. ఇందులోనగర నిర్మాణం; వీధులువవిధంగా వుండాలో, ఇండ్లకట్టడాలు ప్లానులు అన్నీవున్నాయి.

మహాభారత కాలంలో "మయుడనే" విశ్వకర్మ అద్భుతమైన 'మయసభను' (పార్లమెంటుహాల్) ఇంద్రప్రస్థంలో నిర్మించి ధర్మరాజునకిచ్చినట్లు మనకు స్పష్టంగా తెలుస్తున్నది. ఈ నిర్మాణంలో అతననుసరించిన శాస్త్రం ఈనాటిశాస్త్రకర్తలకు అంతుపట్టకుండా వున్నదంటే ఏ మాత్రం అతిశయోక్తి లేదు.

పాణిని మహర్షి చక్కటి శాస్త్రబద్ధమైన వ్యాకరణ సూత్రములను మనకు ప్రసాదించాడు. అమరసింహుడను కవిసార్వభౌముడు చక్కటిశాస్త్రబద్ధమైన "రామలింగానుశాసనము" అను నిఘంటువును ప్రసాదించాడు. వాల్మీకి, వ్యాసుడు, భాసుడు, కాళిదాసు మొదలగువారు సంస్కృత వాఙ్మయమును అభివృద్ధి పరిచారు. నన్నయ్య, తిక్కన, బమ్మెరపోతన, శ్రీనాధుడు మొదలగు కవులు తెలుగుతల్లికి శోభను తెచ్చి పెట్టారు.

"ప్రపంచంలో నున్న భాషలలో ఒక్క సంస్కృత మునకు మాత్రమే చక్కటి శాస్త్రీయవ్యాకరణ బద్ధమైన

నిర్దుష్టమైన పదజాలంవున్నది'' అని మాక్సు ముల్లర్ లాంటి జర్మన్ పండితుడు మరియు యితర పాశ్చాత్యపండితులు కూడా అంగీకరించారు. ఇక్కడ అష్టాదశకళలు అభివృద్ధి జెందాయి, అందులో శిల్ప, సంగీత శాస్త్రములు తారా స్థాయినందు కున్నాయి. కటిక రాళ్ళమీద సరిగమలు పలికించారు శిల్ప కళా నైపుణ్యాలు. బ్రిటిష్ కాలంలో కూడా అతి నైపుణ్యం గల ''డక్కా-మజలీస్'' అనే నేతగాండ్రు వుండేవారు. వారు నేసిన 9 గజముల చీరె అగ్గిపెట్టెలో సరిపోయేదిట. అటువంటి చేతి వృత్తుల వారందరూ హత మార్చబడ్డారు.

క్రీస్తుపూర్వమే మనదేశానికి సముద్రం అవతలి దేశాలతో సంబంధాలు వున్నట్లుగా ఎన్నో ఆధారాలున్నాయి. 'సుదాసు' డనే భారతచక్రవర్తి సముద్రాలు దాటి విదేశాలతో యుద్ధాలు జరిపి అనేక దేశాలను జయించాడు. మహాభారతంలో 'పురూరవసు' అనే చక్రవర్తికి నౌకాబలంతో పాటు పదమూడు ద్వీపాలపైన రాజ్యాధిపత్యం వున్నట్లుగా తెలుస్తున్నది. 'కర్నల్ టాడ్' అనే ఇంగ్లీషు చరిత్రకారుడు 'సగరుడు' అనే హిందూరాజు సముద్రయానం చేయగల 60 వేలమంది నావికులకు తండ్రిగా చెప్పబడుతున్న "సముద్రపురాజు" అని వ్రాసాడు. అనగా 'సగరుని' క్రింద 60 వేలమంది నావికులుండేవారని అర్థం చేసుకొనవచ్చు.

భారతీయుల ప్రతిభ అనేక రంగాలలో ఏనాడో విస్తరించింది. భారతీయ సంస్కృతీ నాగరికతలు దేశదేశాల

వ్యాపించాయి. దురదృష్టవశాత్తు విదేశీపాలనలో మన సంస్కృతీ నాగరికతలు, కళలు సమూలంగా సర్వనాశనం చేయడానికి ప్రయత్నాలు జరిగాయి. ముఖ్యంగా మహమ్మదీయుల పరిపాలనా కాలంలో మన విజ్ఞానసర్వస్వం దాదాపు నాశనం చేయబడింది. తరువాత వచ్చిన బ్రిటిషుపాలనలో కూడా అదే ఘోరం జరిగింది. అంతటితో వారు సంతృప్తి జెందలేదు. చరిత్రనే తారుమారు చేశారు. తప్పుడు చరిత్రను సృష్టించి మన పిల్లలచేతనే చదివించారు. వందలాది సంవత్సరాల విదేశీపాలన క్రింద మన పవిత్ర భారతభూమి నలిగిపోయినప్పటికి మన సంస్కృతీ నాగరికతలు ఛిన్నాభిన్నమైనప్పటికి, ఇంకా ఎన్నో అమూల్యమైన విషయములను తెలిపేటటువంటి శాస్త్రములు జీర్ణావస్థలో, తాటాకు గ్రంథములలో యింకా మిగిలివున్నాయి. అపూర్వమైన గతవైభవమును నిరూపించేటటువంటి స్మృతి చిహ్నములు, శిల్పసౌందర్యాలు పాక్షికంగానయినా యింకా కొంత అజంతా, ఎల్లోరా, హంపి, మహాబలిపురం, ఓరుగల్లు, అమరావతులలో నేటికి మనకు కనపడతాయి. కాని వాటిని పరిశోధించి, వానిలోని ఔన్నత్యాన్ని, గొప్పతనాన్ని విజ్ఞానాన్ని ప్రజాబాహుళ్యానికి ఎఱుక పరచేవారే కరువైనారు. అట్టి ప్రయత్నమూ కనుపించడంలేదు. ఒకవేళ ఎవరైనా వారంతట వారే ముందుకు వస్తే ప్రభుత్వ ప్రోత్సాహం లభించడంలేదు. మన పురాతన గ్రంథములలో సర్వోత్కృష్టమైన సాహిత్యం వున్నప్పటికి మానసికాభివృద్ధికి అవసరమైన తత్వశాస్త్రం వున్నప్పటికి, విజ్ఞానాభివృద్ధి

(Scientific Development) కి అవసరమైన విజ్ఞాన సర్వస్వం వున్నప్పటికీ- దానిని బయటకుతీసి పరిశోధించేందుకు అవసరమైన వనరులు (Resources) లేకపోవడం విచారకరం. పైపెచ్చు నేటి మనయువకులలో అట్టి ఆసక్తిగాని, పట్టుదలగాని లేకపోవడం మిక్కిలి దురదృష్టకరం.

రాను రాను మన విద్యావంతులకు విదేశాలమీద మోజు ఎక్కువైంది. స్వదేశం మీద దురభిమానం, విదేశం మీద అభిమానం పెచ్చు పెరిగిపోతున్నది. "పొరుగింటి పుల్లకూర రుచి" అన్నట్లుగా ప్రతి చిన్న విషయానికి విదేశాలవైపు చూడటం అలవాటయింది. రోజు రోజుకు విదేశీ వ్యామోహం పెరిగిపోతున్నది. ప్రతి చిన్న విషయంలో విదేశాలను అనుకరించడం అలవాటయింది. ఈ పద్ధతి మారాలి. మన యువకుల మనస్తత్వంలో, భావాలలో కూడా మార్పురావాలి. స్వాభిమానం పెరగాలి. స్వయం పోషకత్వాన్ని సాధించాలి.

వైద్య, సాంకేతిక విద్యలలో ఉత్తీర్ణులైన అనేక మంది భారతీయ యువకులు ధన సంపాదన మోజులోపడి విదేశాలకు పరుగిడుతున్నారు. వారికి స్వదేశంలో తగిన ప్రోత్సాహం లభించక పోవడం కూడా ఒక కారణం కావచ్చును. అట్టి విద్యావంతులకు తగిన వేతనం యిచ్చి తగిన ఉద్యోగము (Suitable Jobs) లను ప్రభుత్వం చూపించలేక పోతున్నది. సాంకేతిక సహాయం పేరుతో

అనేక పెద్ద పెద్ద ప్రాజక్టులకు విదేశముల నుంచి 'నిపుణులు' వస్తున్నారు. ఒప్పందం, ఒడంబడికలు ప్రకారం ఆయా ప్రభుత్వములు 'డిమాండ్' చేసిన హెచ్చు మొత్తములను వారి మీద మన ప్రభుత్వం ఖర్చు చేయవలసి వస్తున్నది. విదేశములలోని మూడవ శ్రేణి నిపుణులను మన మీద రుద్దుతున్నారు. అనుభవజ్ఞులైన స్వదేశ నిపుణులు కొంతమంది గత్యంతరం లేక ఆ మూడవ శ్రేణి నిపుణుల క్రింద తక్కువ జీతంతో పని చేయవలసి వస్తున్నది. రెండు విధాలా మనం నష్టపడుతున్నాం. ప్రభుత్వ ఆలోచనా విధానం మారాలి. "అనుకరణ" వ్యామోహాన్ని విడనాడాలి. స్వాభిమానంతో స్వదేశాభివృద్ధికి తోడ్పడాలనే మనస్తత్వం మన విద్యావంతులలో కలగాలి. దానితో పాటు ప్రభుత్వ విద్యా విధానంకూడా మారాలి. అర్హతగల స్వదేశీ విద్యావంతులకు మంచి ఉద్యోగముల నిచ్చి స్వదేశమునందే వుండేట్లుగా ప్రోత్సహించాలి. ప్రతివారు సాంకేతిక విద్యలకు ప్రాధాన్యత నివ్వాలి. శాస్త్రీయ దృక్పథాన్ని (Scientific Outlook) అలవరచుకోనాలి. పరిశోధనలు జరిపి అమూల్యమైన సరిక్రొత్త నూతన విషయాలను కనిపెట్టాలి. వాటిని దేశపురోభివృద్ధికి వినియోగించాలి. అనుభవంలోకి తీసుకొని ఆచరణలో పెట్టాలి. అనుభవంలోనికి రాని విద్య వల్ల ప్రయోజనం శూన్యం.

# "భరతమాత పిలుస్తోంది"

బాల బాలికలారా! భావిభారత పౌరులారా! భారతీయ యువకులారా! భరతమాత పుత్రులారా! వీరాధి వీరులారా! వీరవనితలారా! భరతమాత పిలుస్తోంది! ఆమె మీకోసం నిరీక్షిస్తోంది! ఆమె పిలుపు మీకు వినపడటం లేదా! ఆమె సుందరమూర్తిని మీరు గాంచలేరా! ఆమె కలువ రేకులవంటి కన్నులనుండి కారుతున్న కన్నీరు మీకు కనిపించడం లేదా! ఒక్క పర్యాయం మీ నేత్రాలను పెద్దవిచేసి చూడండి. ఆమె విలపిస్తున్నది; ఆమె హృదయం పరితపిస్తున్నది; ఆమె మనస్సు వికలమైంది; ఆవేదనతో ఆక్రందన చేస్తున్నది. ఎందుకోసం? దేనికోసం? ఆమె పిల్లలు కీచులాడుకుంటుంటే చూడలేక కన్నీరు కారుస్తున్నదేమో!

దురదృష్టవశాత్తు ఈ దేశంలో కొంతమంది స్వార్థపరులు కులతత్వం పేరుతో యిప్పటికీ కుస్తీలు పడుతున్నారు. మతం పేరుతో మారణ హోమాలు అక్కడక్కడ చెలరేగుతున్నాయి; బంధు పక్షపాతం, ఆశ్రిత పక్షపాతం విలయతాండవం చేస్తున్నాయి; అవినీతి వికటాట్టహాసం చేస్తున్నది; శీలరాహిత్యం చిటారుకొమ్మన చేరింది; స్వార్థం సంకుచిత తత్వాలు తారస్థాయికి చేరుకున్నాయి; ప్రాంతీయ కక్షలు ప్రజ్వరిల్లుతూనే వున్నాయి; క్రమశిక్షణా రాహిత్యం పెచ్చు పెరుగుతున్నది. సమైక్యతా భావం నానాటికి సన్నగిల్లుతున్నది. "కులతత్వం, మతోన్మాదం, బంధు పక్షపాతం, ఆశ్రిత పక్షపాతం, అవినీతి, శీలరాహిత్యం, స్వార్థం, సంకుచితత్వాలు, ప్రాంతీయ దురభిమానం, క్రమశిక్షణా రాహిత్యం, అనైక్యత-" అనే సంకెళ్లతో భరతమాత చేతులు బంధించి వేయబడ్డాయి. ఆ విష సర్పాల బారినుండి తప్పించి, భరతమాత దాస్య శృంఖలాలను పటాపంచలు చేసే వీరాధివీరులు లేరా? ఆమె కారుస్తున్న కన్నీటి ధారలను తుడిచే పుత్రులులేరా? ఆమెను ఓదార్చే వీరవనితలు కరువైనారా?

ఉన్నారు....ఉన్నారు....లేకపోలేదు. ధైర్యశాలురైన ధీరులకు కరువులేదు: యువతరానికి లోటులేదు. వీరత్వాన్ని ప్రదర్శించే వీర వనితలు లేకపోలేదు; కండలు బిగించి, మీసాలు మెలివేసి కదనరంగం లోనికి దూకే వీరులకు కొదవలేదు. అయినప్పటికీ వారిలో 'ఆత్మ విశ్వాసం' లోపించిందేమో! స్వాభిమానం తక్కువైందేమో! 'అ ను క ర ణ' వ్యామోహం పెరిగిందేమో!

దీనికి కారణం? ఆత్మవిశ్వాసం, స్వాభిమానాన్ని పెంపొందించే విద్యను వారికి గరపకపోవడమే. అనుకరణ వ్యామోహాన్ని తగ్గించే ప్రయత్నాలు జరుగకపోవడమే. నైతిక విలువలను పెంపొందించి, మానసిక శక్తి వినుమడింప జేసేటటువంటి ఆదర్శవంతమైన విద్యావిధానమును రూపొందించక పోవడమే. శక్తిని, స్ఫూర్తిని, ధైర్యాన్ని, బలాన్ని యిచ్చేటటువంటి స్ఫూర్తిదాయకమైన త్యాగమయమైన దేశభక్తి పరిపూరితమైన, అనాది భారతదేశ చరిత్రను తిరిగి సమగ్రంగా వ్రాపి బాలబాలికలచేత యిప్పటికీ చదివించే ప్రయత్నం జరుగకపోవడమే.

స్వాతంత్ర్యం వచ్చి 30 సంవత్సరములు దాటినప్పటికి ఈ ప్రయత్నం జరుగలేదు. విద్యావిధానంలో సమగ్రమైన మార్పును తీసుకొని రాలేదు. విద్యార్థులలో మానసిక పరివర్తన తీసుకొని రావడానికి ప్రయత్నం జరుగలేదు. ప్రస్తుత జనతా ప్రభుత్వం ఈ విషయంలో తీవ్రంగా ఆలోచిస్తున్నట్లు కనపడుతున్నది. మన ప్రధానమంత్రి శ్రీ మొరార్జి ఈ విషయంలో సరిక్రొత్త నూతన దృక్పథాన్ని ఈ మధ్య ప్రజల ముందుంచారు. "మనిషిని దోపిడీనుంచి కాపాడేది-విద్య" అని చెప్పారు. "నైతిక, ఆధ్యాత్మిక (Moral and Spiritual) శక్తులను పెంపొందించే విద్యను గరపాలి" అని మన రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ చెన్నారెడ్డి పేర్కొన్నారు. ప్రభుత్వంలోనున్న వారు యిప్పుడిప్పుడే ఈ విషయాన్ని గురించి తీవ్రంగా పరిశీలిస్తున్నందుకు చాలా సంతోషం.

ఈ పనిచేయవలసింది ఒక్క ప్రభుత్వమే కాదు. విద్యావేత్తలు కూడా ఈమహా ప్రయత్నంలో భాగస్వాములుకావాలి. శాస్త్రజ్ఞులు ముందుకు

రావాలి, యువలోకం పాలుపంచుకోవాలి. బాల బాలికలు వారి ననుసరించాలి. సమాజ శ్రేయస్సే పరమావధిగా భావించి, కార్యశూరులై కదనరంగంలోనికి కొదమ సింహాలలా కుప్పించిదూకాలి. అకుంఠిత దీక్షతో. ఆత్మ విశ్వాసంతో ముందుకు నడవాలి. మహత్తర కార్యాలను సాధించడానికే ఈ పవిత్ర భూమిలో జన్మించినామనే విశ్వాసం మనలో వుండాలి. కష్టించి పని చేయాలనే తత్వం మనలో ప్రబలాలి. ఇది నిద్రించవలసిన సమయంకాదు. మనపై భారతదేశ భవిష్యత్తు ఆధారపడి వున్నది. పూర్వజన్మ సుకృతంవల్ల ఈ పుణ్యభూమిలో మనం జన్మించాం. ఇక్కడి ప్రతి అణువుమనకు అత్యంత పవిత్రమైనది. మనకు జన్మ యిచ్చిన యీ భరతమాతకు మనం ఎంతో ఋణపడివున్నాం. ఆమె పాదసేవ చేయడం మన విద్యుక్తధర్మం. అమూల్యమైన కాలాన్ని సద్వినియోగం చేయాలి. భౌతిక ఆనందాన్ని చేకూర్చే కామకార్య కలాపాలలో మన సమయాన్ని వృధాచేయరాదు. భోగలాలస క్రీడలలో మునిగి అమూల్యమైన కాలాన్ని దుర్వినియోగం చేయరాదు. ప్రేమగీతాలను ఆలాపించవలసిన సమయం అంతకన్నా కాదు. స్ఫూర్తిని, శక్తిని, ఉత్సాహమును యిచ్చే దేశభక్తి గీతాలను ఆలపించాలి. సత్యాన్వేషణయే విద్యార్జన చేయువారి ప్రప్రథమ కర్తవ్యం.



సత్యాన్వేషణకై ప్రాణాలొడ్డగల ధీరులుకావాలి. త్యాగమే పరమావధిగా భావించే త్యాగశీలురుకావాలి. ఆదర్శం కోసం అంకితమయ్యే యువలోకంకావాలి. క్రమశిక్షణతో బాల బాలికలు ముందుకు నడవాలి. భరతమాత పాదపద్మాలమీద తమ జీవితాల నర్పించగల నిస్వార్థ పరులైన వీరులు, వీరవనితలు కావాలి, దేశ ఆర్థిక పురోభివృద్ధికోసం పరిశోధనలు జరిపి సరిక్రొత్త నూతన విషయాలు కనిపెట్టి అధికోత్పత్తిని సాధించేందుకు విద్యావంతులు, శాస్త్రజ్ఞులు దృఢ విశ్వాసులై దృఢ నిశ్చయులై ముందుకురావాలి. జీవనసంగ్రామ రంగంలో మహా యోధులలాగే నిలబడే ధీరులుకావాలి.



"లెండి! మేల్కొనండి! విశ్రమించకండి!" కార్యోన్ముఖులవ్వండి! కర్తవ్య పరాయణత్వంలో నిమగ్నులవ్వండి! శక్తివంచన

లేకుండా అవిరామంగా కృషి చేయండి! అప్పుడే భరతమాత శాంతిస్తుంది. ఆమె మనస్సు సంతృప్తి జెందుతుంది. ఆమె కారుస్తున్న దుఃఖాశ్రువులు ఆనంద బాష్పములుగా అప్పుడే మారుతాయి. అప్పుడే దేశం సుఖ శాంతులతో విలసిల్లుతుంది.

ఈ మహోత్కృష్టమైన ఆశయాలను, ఆదర్శాలను, భావాలను, ఆలోచనలను, వివేక జ్ఞానాదులను బాల బాలికలలో ముఖ్యంగా యువ లోకంలో కలుగజేయాలనే పరమావధితోనే, ఆ ఆశయంతోనే "వివేకవాణి" పుస్తకమును సమర్పించుకుంటున్నాను. ఈ నా ప్రయత్నం ఏమాత్రం ఫలించినా, ఏకొంచెం సఫలీకృతమైనా నేను నిజంగా 'ధన్యుడనే.'

ఓం, తత్, సత్.

—"కొమరగిరి"

---

"ఏ జాతి తన పూర్వులను స్మరించదో, ఆ జాతికి భవిష్యత్తు శూన్యం. ఏ జాతి తన ఉజ్జ్వల గత చరిత్రను విస్మరిస్తుందో, ఆ జాతికి భవిష్యత్తు వుండదు. ఏ జాతి తన ధర్మ సంస్కృతీ పరంపరలను విడనాడుతుందో, ఆ జాతికి మనుగడే లేదు. కనుక ఈ పవిత్ర భారతావనిలో జన్మించిన మహనీయుల సుగుణములను స్మరించుకుంటూ, గత వైభవాన్ని నెమరువేసుకొని స్ఫూర్తిని పొంది, ఉత్తేజితులై నవభారత నిర్మాణానికి కంకణధారులవ్వాలి.

—శ్రీ చిత్తరంజన్ దాస్

**"Every one wants to command, and no one wants to obey. First, learn to obey. The command will come by itself. Always first learn to be a Servant, and then you will be fit to be a Master."**

**—Swami Vivekananda**

"స్వదేశీ ఉద్యమం మనలో ఆత్మగౌరవం **(Self Respect)** ఆత్మవిశ్వాసం **(Self Confidence)** స్వయం పోషకత్వం **(Self Supporting)** స్వార్థత్యాగం **(Self Sacrifice)** పెంపొందిస్తుంది. మత భేదాలను పోగొట్టి మనల్ని అందరినీ సమైక్య పరుస్తుంది. మన మాతృభూమి కోసం దృఢ విశ్వాసంతో, హృదయ పూర్వకంగా చేతులు కలిపి పనిచేయడానికి ఇది తోడ్పడుతుంది. సమైక్య భారతానికి ఈ స్వదేశీ ధర్మమే మత ధర్మంగా వుండాలి."

—శ్రీ లాలా లజపతిరాయ్.



వాణి

"అసతోమా సద్గమయ
తమసోమా జ్యోతిర్గమయ
మృత్యోర్మా అమృతంగమయ"